# తెలుగువారికి సంస్కృతం

# SANSKRIT FOR TELUGU STUDENTS


భాషాప్రవీణ

ఆచార్య జాస్తి సూర్యనారాయణ

ఎం. ఏ., పిహెచ్.డి.

తెలుగు అధ్యయన శాఖాధ్యక్షులు (రిటైర్డ్)

స్పెషల్ ఆఫీసర్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ

స్నాతకోత్తర విద్యాకేంద్రము

కర్నూలు



1993

# తెలుగువారికి సంస్కృతం

# SANSKRIT FOR TELUGU STUDENTS


భాషాప్రవీణ

ఆచార్య జాస్తి సూర్యనారాయణ

ఎం. ఏ., పిహెచ్.డి.

తెలుగు అధ్యయన శాఖాధ్యక్షులు (రిటైర్డ్)

స్పెషల్ ఆఫీసర్, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ

స్నాతకోత్తర విద్యాకేంద్రము

కర్నూలు



**1993**

# తెలుగువారికి సంస్కృతం

## SANSKRIT FOR TELUGU STUDENTS

by

Prof. J. SURYANARAYANA (Retd.)
Professer and Head of the Dept. of Telugu
and Special officer, S.V.U.P.G. Centre, Kurnool.

ప్రథమ ముద్రణ : మార్చి 1993.

ప్రతులు : 1000



వెల : రూ॥ 60/-

ప్రతులకు

శ్రీమతి జె. సరోజిని
నెం. 512, బాలాజీకాలనీ,
తిరుపతి-517 502.

ముద్రణ:

శ్రీ బాలాజీ ప్రింటర్స్
120, ప్రకాశం రోడ్డు,
తిరుపతి-517 501.

# కృతజ్ఞతలు

విశ్వవిద్యాలయాల్లో పోస్టుగ్రాడ్యుయేటు విద్యార్థులకు ఉపయోగపడే పాఠ్యపుస్తకాల ప్రణాళిక క్రింద ఈ గ్రంథం రచింపబడింది, ఆ విధంగా ఈ గ్రంథ రచనకు అనుమతించి ఆర్థిక సహాయాన్ని అందించిన యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషన్ వారికి —

ఈ గ్రంథ ప్రచురణ నిమిత్తమై ఆర్థిక సహాయాన్ని అందించిన శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానాధికారులకు —

ఈ పుస్తకం శుద్ధప్రతి తయారుచేయటం మొదలుకొని ముద్రణ వ్యవహార మంతా చూడడంలో చేదోడువాదోడుగా సహకరించిన నా శిష్యుడు డా॥ ముదివేడు ప్రభాకరరావుకు.

అతి స్వల్పకాలంలో అందంగా అచ్చువేయించి యిచ్చిన శ్రీ బాలాజీ ప్రింటర్స్ యజమాని శ్రీ ఆర్. వెంకటేశ రెడ్డికీ, మరియు ఆయన ప్రెస్సు సిబ్బందికీ —

కృతజ్ఞతలు

— జె. ఎస్. ఎన్.

# విషయసూచిక

## PART — I



## PART—II

## PART—III

## PART—IV



## PART—V

## PART—VI

# SANSKRIT FOR TELUGU STUDENTS

# తెలుగువారికి సంస్కృతం

## PART - I

ఆర్యుల రాక :-

ఆర్యులతోపాటు సంస్కృతం భారతదేశంలో వ్యాప్తిగాంచిందనేది సత్యం. చరిత్రలో ఈ యంశానికి ఆధారాలనేకం ఉపలబ్ధాలవుతున్నాయి. ఆర్యులు సంచార జాతులుగా ఉన్నప్పుడు హిమాలయాల ద్వారా ఈ దేశంలో ప్రవేశించారు. వీరు ముందుగా నేటి పంజాబు ప్రాంతంలోకి చేరుకుని ఉంటారని తెలుస్తుంది. హిమాలయాలనుండి భారతదేశంలోకి ప్రవేశిస్తే ముందుగా వచ్చేది పంజాబు. వీరి భాషకు ఏ పేరుండేదో చెప్పలేం గాని 'సంస్కృతం' అనే పేరును వీరే కల్పించారని తెలుస్తుంది. సమ్ + కృత అనే వాని కలయిక 'సంకృత' అవుతుంది గాని, 'సంస్కృత' గాదు. ''సంపుంకానాం సో వక్తవ్యః'' (అష్టాధ్యాయీ 8. 3. 34) అనే వార్తికం, 'సంస్కర్త' అనేదానికి మార్గదర్శక మయింది. దీనివంటిదే 'సంస్కృత' అనేది కూడ. సమీచీనత. సంస్కారము, దోషరాహిత్యత సంస్కృత పదవాచ్యాలయిన అర్థాలు. తాము సంస్కరించినందున సంస్కృతం నిష్పన్నమని మన కనిపిస్తుంది. ఆర్యులు తాము ప్రవేశించిన దేశీయుల భాషనా లేక తమ భాషనా సంస్కరించారనేది మరో సమస్య. వీరుద్ధతులు, ఆత్మప్రత్యయవంతులు. తాము గెలిచిన దేశీయులపై వారికి గౌరవభావం లేధనీ, వారధములనే తేలిక భావంతో చూచే వారనీ కొన్ని సందర్భాలవల్ల తెలుస్తుంది.

ఉద్ధతస్వభావంగల వీరు అన్యుల భాషను గాక తమ భాషనే భారతదేశంలోనికి వచ్చిన తర్వాత మార్చుకుని 'సంస్కృతం' గావించారనిపిస్తుంది.

అభిజనము - నివాసము

తాను నివసిస్తున్న దేశం నివాసం. తన పూర్వీకులు. తాతలు లేదా తండ్రి మొదలైన వారు వసించిన దేశం అభిజనం. అంటే తండ్రి లేక తాతల నివాసం తన నివాసం వేర్వేరుగా ఉన్నాయి. అంటే ఆర్యులు సంచారాత్మకంగా ఉన్నప్పటి పరిస్థితులీ వ్యాకరణం లో సుస్పష్టమవుతుంది. ఆనాడు నిర్మితం గాకున్నా ఆ స్థితిగతులను దృష్టిలో నుంచుకొని ఈ వ్యాకరణ నిర్మాణం జరిగిందని తలంపనగును.

ఆర్యుల భాష

ఆర్యుల భాష దేశీయుల భాషకన్న మిన్నయైనందున వారు సంస్కారవంతులు. వారి భాష 'సంస్కృతము' అని గ్రహించాలి. [1]ఉపనదమ్. ఉపనది (పాణిని 5-4-110) నదికి దగ్గరలో ఉన్న భూమి అనే అర్థంలో పదబంధాలను వీరు కల్పించి ప్రయోగిస్తుండగా అచిరకాలంలో వీని ప్రకృతి ప్రత్యయాత్మక విభాగాన్నీ, అర్థాన్నీ వ్యాకరణం ధ్రువీకరించింది. [2]సప్తగంగమ్. ద్వియమునమ్ అనే వానికి సంబంధించి వార్తికం 'సమాహారే చాయ మిష్యతే', ఇవి దేశవాచకాలని తెలుస్తున్నాయి. సమాహార ద్వంద్వ ద్విగు సమాసాలు దేశవాచకాలని నిరూపితం. (తెలుగు సమాన పరిశీలన, పుట-48) 'సప్తగంగమ్' అంటే ఏడు నదులు (గంగలు) అని అర్థం కాదు. ఏడు నదులున్న దేశం. నేటి పంజాబ్ ఇలాంటిదే. ఐదు నదులున్న దేశం దీని ఉద్దిష్టార్థం. అంతేగాని ఐదునదులని గాదు.

---

1. నదీ పౌర్ణమాస్యాగ్రహాయణీభ్యః
2. నదీభిశ్చ 2-1-20.

వేదాలు :

ఆర్యులు తరువాతి తరం వారికనుగ్రహించిన విశిష్టరచనాత్మకాలు వేదాలు. వేదాలు ప్రతిపాదించిన సంప్రదాయాన్నే వైదిక సంప్రదాయంగా తరువాతి వారు పేర్కొన్నారు. వేదాల్లో గల భాష సంస్కృతమే. కాని, పాణిని మొదలైన వ్యాకరణ కర్తలు వివరించిన భాష గాదిది. వేదాల్లోని భాష పాణిని కాలంకన్నా ముందున్న భాష. భాషలో మార్పు అనివార్యం. అందువల్ల వేదాల్లోని భాషలోగూడ మార్పులు రాసాగాయి. మార్పులు వస్తే వేదాలరూపం భాషా విషయంలో మారుతుంది. మార్పు దేశాన్నిబట్టి వివిధాలుగా ఉంటుంది. అలా అయితే వేదాలకు ఏకరూపత లోపిస్తుంది. వివిధ రూపాల్లో వేదాలుండటాన్ని ప్రాచీనార్యులు సమ్మతించలేదు. కొందరు పనిగట్టుకుని వేదభాషలో మార్పుల నరికట్ట ప్రయత్నించారు. కొందరీ యుద్యమంకోసం తమ యావజ్జీవితాన్ని వ్యయం గావించారు. ఇలాంటివారు కొన్ని తరాలకు చెందినవారైయున్నారు. ఎంతోకాలం ఈ యుద్యమం మార్పుకు వ్యతిరేకంగా సాగింది. ఆయినా మార్పులు వస్తూనే ఉన్నాయి. ఇంక మార్పులు లేకుండా భాషను పరిరక్షిస్తే (ముఖ్యంగా వైదిక భాషను) వానికి పరలోకంలో సుఖాలు గలుగుతాయన్నారు.

మార్పు నివారణ :

[1]భాషను వ్యవహరించే వ్యక్తి తన వాక్యాలను పదాలుగాను, పదాలను ప్రకృతి ప్రత్యయాది విభజనాత్మకంగాను తెలిసి వాడితే అలాంటివానికి సంఘంలో గౌరవం గలుగుతుంది. యజ్ఞాన్ని శాస్త్రోక్తరీతిని నిర్వహించిన వాని కానాటి సంఘంలో ఎంతటి ఉన్నత స్థానమూ, పుణ్యము లభిస్తాయో అంతటి సుకృతాదులు భాషను

1. యశ్చ వ్యాకురుతే వాచం - యశ్చ మీమాంసతేఽ ధ్వరమ్ ।
తావుభౌ పుణ్యకర్మాణౌ - పంక్తిపావన పావనౌ ॥
— మహాభాష్యమ్ పుట - 10

వ్యవహరించిన వానికి కలుగుతాయి. [1]శబ్దము బ్రహ్మస్వరూపతుల్యం. శబ్దబ్రహ్మయొక్క నిజతత్త్వాన్ని గ్రహించటం పరబ్రహ్మ స్వరూపాన్నవగతం చేసుకున్నట్లే. [2]సాధుపదప్రయోక్తలు అనాదుండేవారు కొందరు. అట్టివారితోనే నిష్ఠావంతులు సంభాషించాలని వ్యాకరణం నియమిస్తుంది.

పద వివరణ ఆవశ్యకం :

వేదాదుల్లో ప్రయోగించిన పదాల నిష్పత్తిని గూర్చి వివరించే గ్రంథం నిరుక్తం. [3]పదాల వ్యుత్పత్తిని గూర్చి నిరుక్తం వివరిస్తుంది. నిరుక్తమనే ఈ గ్రంథస్థ విషయాల నవగతం చేసుకున్న వ్యవహర్త (భాషను వాడేవాడు) సర్వపాపముల నుండి విముక్తుడవుతాడని భాష్యంలో చెప్పియున్నారు. సాధువులుగా గుర్తించబడ్డ శబ్దాల యొక్క ప్రకృతి ప్రత్యయాత్మక విభాగ విజ్ఞానమే పురుషార్థం. ఈ పరిజ్ఞానానికి సూక్ష్మమైనమార్గం వ్యాకరణం. [4]అందువల్ల వ్యాకరణాన్ని చదివితే వ్యక్తి పురుషార్థాన్ని సాధించినవాడవుతాడని వీరి నిర్ణయం.

'విద్' అనే ధాతుజన్యం వేదమనే పదం. 'ఏరచ్' 3-3-56 చే 'అ' రాగా 'వేద' అయింది. 'విద్' ధాతువుకు నాలుగైదర్థాలున్నాయి. జ్ఞానం, ఉనికి. విచారించుట, లాభం అనేవవి. వేదమంటే జ్ఞానాన్నిచ్చేది, ఉనికిని గూర్చి చెప్పేది, విచారింపదగిన అంశాలున్నది, లాభదాయకమైనది అని గ్రహింపనగును.

---

1. శబ్దబ్రహ్మణి నిష్ణాతః పరంబ్రహ్మాఽధిగచ్ఛతి
2. తదిహసాధూన్ ప్రజ్ఞాపయతః
   ఆచార్యసాధుభిరేవ భాషితవ్యం
   న అసాధుభి రిత్యభిమతం లక్ష్యతే
3. నిరుక్తస్యయో వేద సర్వపాపై ర్విముచ్యతే
4. న చ తత్రోపాయాంతరం లఘీయోఽస్తి
   అన్యదతో వ్యాకరణాత్

1, 2, 3, 4 — మహాభాష్యమ్, పుట - 11

## వివరణ శూన్య అధ్యయనం :

[1]ప్రకృతి ప్రత్యయ విభాగాత్మకంగా వివరాలు గుర్తెరిగి వాక్యాల నధ్యయనం చేయాలి. ఈ విభాగం లేని భాషాధ్యయనం కేవలం విన్నంత మాత్రాన భాష నధ్యయనం గావించటంగా భావించడం నిష్ఫలం. ఎండుకట్టెలను నిప్పులో ఉంచితే మండుతాయి. కాని, ఎంతగా ఎండిన కట్టెలనైనా అగ్ని సంపర్కం చేయించకుంటే జ్వలించవు. అలాగే ప్రకృతి ప్రత్యయ విభాగంలేని భాషాధ్యయనం ప్రయోజన రహితం, నిరర్థకం.

## శాస్త్ర (వ్యాకరణ) ప్రయోజనం :

శబ్దాల విభాగాన్ని గుర్తించినా లేకున్నా వ్యవహర్త శబ్దాల అర్థాలను ఎరిగినందున ప్రయోగిస్తాడు. ప్రయోగించి తన భావాన్ని ప్రకటిస్తున్నాడు. భావప్రకటనకు అర్థవంతాలైన శబ్దాలు చాలు. [2]వాటిలోగల ప్రకృతి ప్రత్యయాది విభాగాలతో ప్రయోక్తకు పనిలేదు గదా ! అనేది ప్రశ్న. ఈ ప్రశ్న సమంజసమే. వ్యాకరణ శాస్త్రం పదాల తత్ప్రత్యయాది విభాగాలను తెలియజేయటం వాటిని మనం గుర్తించటం ధర్మంకోసం. మనమంచికే. తూర్పుదిక్కుకభిముఖంగా కూర్చొని భుజించాలని నియమం. ఆకలి శమించాలంటే ఎలా కూర్చొని తిన్నా సరిపోతుంది. కాని నియమానుసారంగా ప్రాచీకి అభిముఖంగా భోజనం గావిస్తే మనిషికి శ్రేయస్సు, అభ్యుదయం గలుగుతుంది. అలాగే పదాలను గ్రహించి ప్రయోగించటం మాత్రమే గాక వాటి యర్థాలను గ్రహిస్తే ధర్మం, అభ్యుదయం కరతలామలక మౌతుంది.

---

1. యదధీత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే ।
   అనగ్నావివ శుష్కేంధో నతజ్జ్వలతి కర్హిచిత్ ॥
2. అర్థప్రయుక్తే శబ్దానాం ప్రయోగే సముపస్థితే ।
   ధర్మాయ నియమశ్శాస్త్రే ప్రాఙ్ముఖత్వాదివద్భవేత్ ॥

1, 2 — మహాభాష్యమ్ పుట - 11

సుశబ్దము - స్వర్లోకము :

శబ్దరూపనిష్పత్తిని సాకల్యంగా ఎరిగి సక్రమంగా ప్రయోగిస్తే ఒకే ఒక శబ్దం గూడ స్వర్గలోక ప్రాప్తికి సోపానం గావటమే గాక అది మానవులకు అభిమతార్థాలననుగ్రహించటంలో తోడ్పడుతుంది.[1] అని మనం వింటున్నాం గదా !

[2]తన కాలంనాటి పదాలను ఏ విధమైన క్షతి (ఉచ్చారణమార్పు) లేకుండ ఎవడు ప్రయోగిస్తాడో అతడు ప్రశంసార్హుడు. నేర్పరిగ గుర్తింపదగిన వాడు. వాక్య లేదా పద ప్రయోగదక్షుడుగా అతడు కొనియాడ దగినవాడు. అనేకాంశాలందతడు జయాన్ని పొందుతాడు. మార్పులతో పదాలను వాడే వాడు చెడిపోతాడు.

శబ్దప్రయోగం - స్వరభంగం :

[3]శబ్దాన్ని స్వర అర్థ విషయాల్లో భంగం లేదా మార్పు గల్గిస్తూ ప్రయోగించటం సరికాదు. భంగం గల ప్రయోగం మిథ్యగా గుర్తించాలి. మిథ్య అర్థాన్నీయలేకపోగా అనర్థదాయకం అవుతుంది. శబ్దానికి నిర్దిష్టార్థంగాక తదన్య తద్విరుద్ధ లేదా తద్విపరీతార్థత గలిగించే ఉచ్చారణ అర్థానృతం. అనృతం, వాడరాదనేది నిషేధం. [4]అనృతం శబ్దార్థానుబంధియని రెండు విధాలుగా ఉంటుంది. ఇందే దానికి

---

1. ''ఏకః శబ్దః సమ్యగ్జ్ఞాతః సుష్ఠు ప్రయుక్తః
   స్వర్గే లోకే కామదుగ్భవతి'' — మహాభాష్యమ్ పుట - 11
2. యస్తుప్రయుంక్తే కుశలో విశేషే శబ్దాన్యథావ ద్వ్యవహారకాలే
   సోఽనన్త మాప్నోతి జయం పరత్ర వాగ్యోగవిద్దుష్యతి చాపశబ్దైః
   — మహాభాష్యమ్ పుట - 12
3. దుష్టః శబ్దః స్వరతోఽర్థవా - మిథ్యా ప్రయుక్తో న తదర్థమాహ
4. నానృతం వదేత ఇతి నిషేధః। ద్వివిధమనృతం। శబ్దానృతమ్. అర్థానృతమ్, తథాహి, శబ్దస్య అర్థస్యవా అన్యథా ప్రతిపత్తిహేతు — రుచ్చారణమనృతమ్ (పుట - 13)

మన యుచ్చారణ ఆదరించినా ప్రాయశ్చిత్తం చేసుకొని దోషాన్ని తొలగించుకోవటానికి ప్రయత్నం చేయాలి. శబ్దాలను వ్యవహార కాలంలో ఉన్నరీతిని ప్రయోగిస్తే శబ్ద లేదా అర్థమూలకానృతాలకు తావుండదు. అలా అయితే మనం ప్రాయశ్చిత్తం చేసుకోవలసిన అవసరం గలుగదు. అందువల్ల పదాలను వ్యవహార విధేయంగా ప్రయోగించాలి.

భాషలో క్రమంగావచ్చే మార్పులను నివారించటానికి వీరు చేసే ఈ ప్రయత్నం అసహజం, అశాస్త్రీయం. భాషమార్పుకు లోనౌతుం దనేది నిజం ! ఈ మార్పును పైరీతిని నివారించాలనే ప్రయత్నం ప్రవాహానికి ఎదురీదటం వంటిదనే నిజాన్ని గ్రహించాలి !

వ్యాకరణం – వేదరక్ష :

శిష్యుల ఉపాధ్యాయుల పరంపరనిత్యం వల్లెవేస్తూవేయిస్తూ వేదాలను రక్షిస్తున్నారనేది వాస్తవం. వేదాలు పరంపరాగతాలు. అలాంటివాటిని వ్యాకరణం రక్షిస్తుందనటం తగునా అనేది ప్రశ్న ! ఈ వ్యాకర్తలు లౌకిక భాషకు నియమాలను తయారు చేశారు. [1]వైదిక భాష దీనికి భిన్నంగా ఉంటుంది. లౌకిక భాషలో గనరాని లోపాగమ వర్ణవికా-రాదులు వైదికభాషలో ఉంటాయి. ప్రయోగ విధేయ మనస్కులైన వ్యాకరణ కర్తలు తమకు అలవాటైన రీతిలో మార్పులుచేసి వేదాల రూపాన్ని మార్చివేయవచ్చును. వ్యాకరణం తెలిసినవాడు ఈ రూపాల్లోని సామంజస్యతను గుర్తించి ఆర్షప్రయోగాలను అన్యథాకరించడు. ఈ విధంగా వ్యాకరణం వేదాల రూపాన్ని రక్షిస్తుంది. వ్యాకరణాల నియమాలకు వేదాల భాషకు వర్ణాగమ తద్వికార లోపాదులైన మార్పులున్నాయని వీరు స్పష్టం గావించారు. వేద - లౌకిక భాషల్లో గల వర్ణలోపాది భేదాలు మాండలికాలలో గల భేదాల వంటివిగా గుర్తించనగునా ? ప్రాత కొత్త భాషలుగా గ్రహించటం తగునని తోస్తుంది.

---

1. ''యే భాషాయా మదృష్టా లోపాగమ వర్ణవికారాః
కేవలం ఛందస్యేవ దృశ్యంతే''

— మహాభాష్యమ్, పుట - 13

## సంస్కృతం – మాండలికాలు

కాలానుగుణంగా భాషలో మార్పు వస్తుందనే నిజానికి నిదర్శనమే వైదిక, లౌకిక సంస్కృతాలు. మార్పును నివారించాలని ఎంతో మంది వ్యాకరణకర్తలు ప్రయత్నించారు. శబ్దాలలో మార్పును నివారించి ప్రయోగిస్తే స్వర్గం కలుగుతుందని చెప్పారు. అయినా మార్పు వచ్చింది.

లౌకిక భాషలో మాండలిక భేదాలు గలవనే యంశం (భాషా ప్రామాణికత - వైయాకరణుల దృష్టి. తెలుగు వైజ్ఞానిక పత్రిక, అక్టోబరు. 1982) నిరూపితం. ప్రామాణిక వ్యావహారికం 'సుశబ్దం' అనీ, అప్రామాణిక వ్యావహారికం 'అపశబ్దం' అని మహా భాష్యంలో చెప్పబడింది. ప్రామాణిక పదాలు శక్తివైకల్య, ప్రమాద, అలసతలవల్ల వేరు వేరు విధాల ఉచ్చరితాలైనందున అపశబ్దా అవుతాయని మహాభాష్యం[1]. ప్రామాణిక వ్యావహారికం సర్వలోక విదితం.[2] అంటే ఆ పదాలను వ్యవహర్తలందరు వాడుక చేయటమే

---

1. ''తయేవ శక్తివైకల్య ప్్రమాదాలసతాదిభిః
   అన్యథోచ్చారితాః పుంభిరపశబ్దా ఇతీరితాః''
   — మహాభాష్యమ్, పుట - 8

ధ్మాత, పణీకృత, అంబూకృత, అర్ధక, గ్రస్త, నిరస్త, ప్రగీత, ఉపగీత, క్ష్వణ్ణ, రోమశ, అవలంబిత, నిర్హత, సందష్ట, వికీర్ణ, అనేకాది పదగ్రాహ్యాలు. ఏకోఽప్యనేక వర్త్మాసీ త్యపరే – అనంతా హిదోషా అశక్తి ప్రమాదకృతాః''
— మహాభాష్యమ్, Rohtak Edition పుట - 4(a)

2. లోకే విదితాః లౌకికాః - యద్యపి గవ్యాదయోఽపి లోకేవిదితాః । తథాపి తేన సర్వలోక విదితాః । ప్రతిదేశం భిన్నత్వా దప : శబ్దానామ్ । (పుట - 15)

గాక అర్థాన్ని గ్రహిస్తారు.[1] అపశబ్దాలు (మాండలికాలు) సాధు శబ్దాలను స్మరణకు తెచ్చి అర్థబోధకా లవుతున్నాయి.[2] మాండలికాలే ప్రమాణ భాషగాగల ప్రాంతాల్లో ఆ పదాలే అర్థ బోధకతతో శక్తి మంతాలుగా గుర్తించాలి.[3]

కావ్యభాష :

కావ్యరచన సంస్కృతంలో వేయి సంవత్సరాలకు మించి సాగినా భేదాలు రాలేదు. ఈనాడు సంస్కృతంలో దిన, మాస, పత్రికలు, సాహిత్యరచనలు, ప్రసంగ వ్యాసాలు వెలువడుతున్నాయి. కావ్యభాషకు ఈ భాష విధేయంగా ఉంది. ఈనాడు సంస్కృతం వ్యవహారంలో లేదు. కావ్య రచన సాగిన వేయి సంవత్సరాల్లోకూడ సంస్కృతం వ్యవహారంలో లేనందున మార్పు రాలేదని గ్రహించాలి. ఈ కాలంలో (ఆ వేయి సంవత్సరాల కాలంలో) వ్యవహారానికి అష్టవిధ ప్రాకృతా లుపయుక్తాలైనాయి. ప్రాకృత భాషా వికారాలే నేటి ఔత్తరాహ భాషలు.

---

1. "అప శబ్దా హి ప్రతిదేశం ప్రతిగృహం ప్రతిపురుషం ప్రత్యవస్థం భిన్నాశ్చానవస్థితాః"
   — మహాభాష్యమ్, పుట - 17

2. తేచ స్వయ మవాచకా అపి ప్రథమం గవాది శబ్ద స్మరణ ద్వారేణార్థధియం జనయంతి"
   — మహాభాష్యమ్, పుట - 8

3. "యేచ తత్రైవ ప్రథమే వ్యవహారే వ్యుత్పాద్యం తే తేషాం గవాది వత్తేష్వేవ వాచకత్వాభిమానః"
   — మహాభాష్యమ్ పుట - 8

సంస్కృత పదాలకు పదబంధాలకు తుల్యార్థకాలైన పదాలను నిర్మించే ప్రయత్నం చేసి సఫలత గాంచినవి ప్రాకృత భాషలు కాబట్టి ఈ భాషల్లో సమ సంస్కృత పదాలు గనరావు. ''శబ్దామేచ సముత్పన్నా ఆద్యాయాం'' అని తెలుగు. నేటి భారతీయ భాషల్లో సంస్కృత ప్రాతిపదిక ప్రత్యయాలనుకపిలి యథేచ్ఛగా (సంస్కృత భిన్నంగా) ప్రయోగం చేయటం అన్ని భారతీయ భాషల్లో గలదని పరిశీలనవల్ల సువ్యక్తమవుతుంది.

# PART - II

## నేటి భారతీయ భాషలు - సంస్కృతం :

సంస్కృతంతో ఏ విధంగా భేదిస్తుందో చెప్పటం ప్రాకృత వ్యాకరణాలు వివరించాయి. సంస్కృతంలో మూడు వచనాలు. ప్రాకృతంలో రెండే. సంస్కృతంలో ఏయే విభక్తికి ప్రాకృతంలో ఏవి వస్తాయో చెప్పారు. సంస్కృతం కన్న ప్రాకృత ధ్వనులు తక్కువ. సంస్కృతంలో అధికంగా ఉన్న ఏధ్వనికి మారుగా ప్రాకృతంలో ఏ ధ్వని వస్తుందో వివరించారు.

సంస్కృతం దృష్ట్యా ప్రాకృత వ్యాకరణాన్ని తీర్చిదిద్దారు. ప్రాకృతం అష్టవిధంగా గుర్తించారు.

నేటి ఉత్తర దేశీయుల భాషలకు మూలం ప్రాకృతం. ఏ ప్రాకృతం ఏ ఆధునిక భాషకు మూలం అనేది మన కప్రస్తుతం. నేటి భారతీయ భాషలన్నింటిలోను సంస్కృత నామాలను తదను

న ప్రత్యయాలతో చేర్చి ప్రయోగించటం గలదు. సుప్తి జంతాలే త్తద్ధితాంతాలకు సమాసాది పద బంధాలకు నేటి భారతీయ ప్రయోగం ఉంది. ఈ విషయం ఉత్తర, దక్షిణ (ఆర్య / భాషల్లో భేదం కనరాదు.

ంస్కృతంలోని విభక్తి విరహిత నామాన్ని తీసికొని దాని స్వరానికి లోపాన్ని గలిగించి నేటి ఆర్యభాషలవారు ప్రయో గలదు. అంత్యస్వరలోపం అకారానికి పరిమితం. 'రామ' నవి నేటి అర్య భాషలన్నింటిలో తుది స్వర విరహితంగా అని ప్రయోగింప బడుతుంది. 'హరి' మొదలైన ఇకా అంత్యస్వరలోపంలేదు. 'మనస్' మొదలైన 'అస్' అంతాల్లో పించి 'మన్' ఇత్యాదిగ రూపాలు ప్రయుక్తాలవుతున్నాయి. స్ఫంలో లోపం పాక్షికం. 'యశోధరా' మొదలైన సామాసిక ల్లో 'యశస్'లో ఈ లోపం రాలేదని తెలుస్తుంది. సకా పాతిపదికల విషయంలో నేటి భారతీయ భాషల్లో వైవిధ్యం ది.

| | |
|---|---|
| వివాహవయస ఉపస్థిత | (వయస్) |
| దేహమన ప్రాణౌర్ | (మనస్) |
| భ్రాతుష్పుత్రేర్ | (భ్రాతుః < భ్రాతుష్) |
| అల్పవయసే | (వయస్) |
| ప్రసన్నచక్షే | (చక్షుస్) |
| సమ వయసే | (వయస్) |
| అనేక వయస పర్యంత | (వయస్) |

గాల్లో సకారాంతాలు వంగభాషలో ఏ విధంగా మార్పుకు తెలుస్తుంది.

ఈ క్రింది విశేష ప్రయోగాలు హిందీకవి ప్రయుక్తాలు.

యశపాన (యశస్)

ఉరమాల (ఉరస్)
నభచర (నభస్)
మనమోహన (మనస్)

యశోధరా అనే సమానంలో పూర్వావయవమైన 'యశస్' లోని సకారం లోపించలేదు. సంధివల్ల గలిగే మార్పులకు లోనైనది.

మరాఠీ :- ఈ క్రింది ప్రయోగాలు మరాఠీకవి ప్రయుక్తాలు.

దేహమన (మనస్)
ఛంద విషయక (ఛందస్)
బాల్యవయాత్ (వయస్)

మనోరంజక ఇత్యాదుల్లో మనస్సులోని సకారం లోపింపకపోగా సంధి వల్ల నిర్ణీతమైన మార్పులకు లోనైనదని తెలియనగును.

కన్నడం:- కన్నడంలో సకారాంత సంస్కృత పదాలు

సురధను నెగిదె (ధనుస్)
విరోధి సాధన మనాహవదోళ్ (మనస్)
ధనుర్వేద (ధనుస్)
సద్యోగర్భ (సద్యః)
(సద్యః ప్రసూతి) (సద్యః)
శశాంక విశద యశమ (యశస్)
అహర్పతిసుత (అహస్)

తెలుగు :- ప్రాతిపదికాంతం లోని స్. కు లోపం వికల్పం. 'మనము' మొదలగునవి ఉదహరణాలు. లోపం రాకుంటే మనసు / స్సు అని రూపాలు ఏర్పడతాయి. తెలుగు సమాసాల్లో సకారలోపం గనరాదు. తేజోరాజిత, రోదో వివర మొదలగునవి ఉదాహరణాలుగ గుర్తించ దగును. సంస్కృతం యొక్క నిజరూపాన్ని నిలుపుట అనే విషయంలో ఆర్య భాషలకన్న ద్రావిడ భాషలు గణింపదగియున్నవి.

సురధను నెగిడె, శశాంక విశదయశను మొదలగు కన్నడ ప్రయోగాలు ఆర్యభాషల్లో ఈ కాలంగల రూపాలను పోలియున్నవి. తక్కినవి సంస్కృత (ధనుర్వేద, సద్యోగర్భ మొదలగునవి) సంప్రదాయ విధేయాలుగా ఉన్నాయి. తెలుగు స మ స్త ప దా ల విషయమై (తేజోరాజిత మొ॥) సంస్కృత విధేయం. ఇతరత్ర అంటే వ్యస్త పదాల విషయంలో హలంతాల కంతంలో ఈ భాషలో సామాన్యంగా గలిగే ద్విత్వ ఉగాగమాలు ద్విత్వానికి వైకల్పికత్వము ఉన్నాయేగాని తదన్యములైన మార్పులేమియు యిందులేవు. సకారం లోపించి ఉత్వడుజ్ఞులు (చంద్రముఁడు) ఏకము (తపము) గారటం ఈ భాషకుగల ప్రత్యేకత. సంస్కృతానికి విధేయంగా, మూలానికి దగ్గరగా ఉండటం అనేది తెలుగువారి ప్రత్యేక లక్షణం :

## ప్రాతిపదికలుగా సుబంతాలు :-

సంస్కృత ప్రాతిపదికలపై విభక్తి వచన బోధక ప్రత్యయాలు చేరగా ఏర్పడిన విభక్త్యంతాలనే ప్రాతిపదికలుగా భారతీయ భాషలు కొన్నిట గ్రహించటం గలదు.

తెలుగు :- భువి, దివి అనేవి భూ, దివ్ అనేవానికి సప్తమీవిభక్తి ఏకవచన ప్రత్యయ సహితరూపాలు. వీటిని తెలుగులో ప్రాతిపదికలుగా గ్రహించారు. దీనికి వ్యాకరణానుమతిగూడ గలదు. ఆంధ్ర శబ్దచింతామణి లోని 'భూదివోఽస్తు జౌయత్రత్' అనే సూత్రం ఈ యంశానికి అంగీకారం తెలియజేసింది. మూర్ధన్ అనే శబ్దానికి సప్తమీ విభక్తి ఏకవచన ప్రత్యయ సహిత రూపమైన 'మూర్ధ్ని' అనేదాన్ని కొమఱ్ఱాజు వెంకట శివుడు రేపాల రాజలింగ శతకం, 44వ పద్యంలో ప్రయోగించాడు. దీనిపై ద్వితీయైకవచన ప్రత్యయం చేరినందున ఏర్పడే 'మూర్ధ్నిని' అనే నామం పై శతకంలో ఉండటం గమనించాలి.

'నిశ' అనేది సంస్కృతంలో సప్తమ్యంతం. దీన్ని ఏక వచనంగా ఆ భాషకుగల వ్యాకరణం నిర్ణయించింది. దీన్ని హిందీ, బెంగాలీ, మరాఠీ మొదలగు ఆధునికార్యభాషలు ప్రథమాంతంగా ప్రయోగించినట్లు గుర్తించాలి. 'నిశదిన్' మొదలగు ద్వంద్వ సమాసాల్లో నిశ ప్రాతిపదికకు పర్యాయంగా ప్రయుక్తం. (దిశ దిన బెంగాలీ P.-147 పుట - 13) దీన్ని ఈ మూడు భాషలవారున్ను వాడుక చేస్తున్నారు. నిశిరాత్రి ఇత్యాదుల్లో తనకున్న సామాన్యార్థానికి విధేయం గాకుండా ఈ సప్తమ్యంతం తెలుగులో ప్రాతిపదికకు మారుగా ప్రయుక్తం. ఇక్కడ నిశి అంటే deep అని అర్థం. ప్రగాఢమైన, మానవ సంచారం లేనందున, ప్రాణులన్ని సంచారాన్ని విరమించిన ప్రజలంధకారం అలముకొన్న చీకటిరేయి, అని యిక్కడ మనం గుర్తించాలి.

మతుబంతాలు :-

ఈ ప్రత్యయాంతాలైన నామాల ద్వితీయైక వచనాలైన బుద్ధిమంతమ్. గుణవంతమ్ మొదలైన వానిలోని యంతిమ మకారం లోపింపగా ఏర్పడిన 'బుద్ధిమంత' మొదలైనవి నేటి భారతీయ భాషల్లో ప్రాతిపదికలుగా ఉండటం గమనింపదగిన యంశం.

**హిందీ :** మతిమంత, నీతిమంత, మురతి (మూర్తి) వంత, హర్ష వంత, క్రోధవంత మొదలగునవి.

భగవంత, హనుమంత అనేవానికి భగవాన, హనుమాన అనే రూపాంతరాలు గూడ ఉన్నాయి. ఈ రూప ద్వయం తెలుగులో గూడ ఉండటం గమనించాలి, ఈ సందర్భంలో మతుప్తకారానికి 'ఆన' ఆదేశంగావస్తుందని బాలవ్యాకరణం (తత్సమ - 74) చెప్పి యుండటం గమనించాలి. భగవంతుఁడు, భగవానుఁడు ఇత్యాదిగ రూపద్వయాన్ని ఈ సూత్రం విధించింది. ఇంతేగాక, గుణవంత, బుద్ధిమంత మొదలగు మతుబంతాలు తెలుగుతో ప్రయుక్తాలవుతాయి.

వీని మహద్వాచకమైతే ఉత్వడుజ్గులు (గుణవంతుఁడు) మొదలగునవి. అమహద్వాచకంలో స్త్రీలింగమైతే ఉత్వం రుగాగమం తరువాత 'ఆలు' చేరి గుణవంతురాలు ఇత్యాదగాను అమహత్ (స్త్రీ వ్యతిరిక్తమైతే) గుణవంతము మొదలగు రూపాలు ఏర్పడుతుంటాయి.

మరాఠీ భాషలో విచారవంత, శ్రీమంత, బలవంత, శక్తిమంత, మూర్తిమంత మొదలగు మతుబంతాల ద్వితీయ ఏకవచన ప్రత్యయాంతాలు ప్రయుక్తాలు.

వంగభాష లో బుద్ధిమాన, బుద్ధిమతా యిత్యాది రూపాలు ప్రయుక్తాలు. ఇవి సంస్కృతంలో ప్రథమాంతాలే గాని, పై భాషల్లో వలె ద్వితీయైక వచనాంతాలతో సంబంధం గలవి కావు.

కన్నడం లో ఆచారవంతను, బుద్ధిమంతను మొదలగు రూపాలు ప్రయుక్తాలని పరిశీలనవల్ల తెలుస్తుంది. భగవంత, భగవాన అనే రూపద్వయం హిందీలోను తెలుగులోను ఉండటం విశేషం. బీహారు నుంచి వంగ, ఒరిస్సా రాష్ట్రాలమీదుగా తెలుగు దేశానికి సాంస్కృతిక మత భాషాది విషయికంగా సంబంధా లున్నాయని S.K. ఛటర్జీ నిరూపించిన అంశం (J. A. S. B. P. 85 Pargiter) సహేతుకమనిపిస్తుంది.

సంస్కృత ప్రత్యయాంతాలు :

నేటి భారతీయ భాషలవారు సంస్కృత ప్రత్యయాలను గుర్తెరిగినవారు. ఆ ప్రత్యయాలను సంస్కృత ప్రాతిపదికలపై చేర్చి రూపకల్పనం చేయటంలో ఈ భాషలవారికి అభినివేశం గలదు. కొన్ని సందర్భాల్లో సంస్కృత భాషలో ఈ సందర్భంలో గలిగే ఆదేశాగమాదులు సంధివల్ల గలిగే మార్పులు ప్రవర్తించినందున ఈ రూపాలు నేటి భాషలవారు గల్పించారని మనం గ్రహించగలం. ఈ విధంగా రూపాలను నిష్పన్నం చేయటంలో వైవిధ్యం లేకపోలేదు. కొంతకు కొంత సాదృశ్యం గూడ ఈ రూపాలల్లో గలదని పరిశీలనవల్ల స్పష్టమవుతుంది.

పంపకవి కన్నడంలో రచించిన భారతంలోని 4వ ఆశ్వాసం 75 వ పద్యంలోను, అక్కడి గద్యంలోను సంస్కృత విభక్త్యం తాలుగా గుర్తించదగిన పద్మజం, చంద్రం, మలయానిలం (4-75) విధాత్రం అని ప్రయోగాలున్నాయి. ఇవన్నీ సంస్కృతంలో ద్వితీయైక వచనాంతాలుగా గుర్తించదగి ఉన్నాయి. కాని కన్నడం ద్వితీయైక వచనంలో 'అమ్' అనే ప్రత్యయం దేశీయ ప్రత్యయంగా గూడ గలదు. మరి. విధాత్రం అనేటప్పుడు 'విధాతృ' సంస్కృతం గాన 'అమ్' అనే ఈ ప్రత్యయంగూడ సంస్కృతంగానే గుర్తించటం తగును. పద్మజం, చంద్రం మొదలైనవి గూడ సంస్కృతనామాలే. ఈ సందర్భంలో విధాత్రం అనేది - 'విధాతృ + అమ్' అని ఈ రెండు సంస్కృతభాషకు చెందినవైనందున (అ ఖతే) గుణం వచ్చి విధాతర్ అని అవుతుంది. తరువాత 'అప్తృన్ తృచ్ స్వసృ నప్తృ నేష్టృ త్వష్టృ క్షత్తృ హోతృ పోతృ ప్రశాస్తౄణామ్' (6-4-11) తకారంపై అకారానికి దీర్ఘం వచ్చి విధాతార్ + అమ్ = విధాతారం అవి కావలసి యుండగా విధాత్రం అని ప్రయోగించుట యణాదేశ సంధి వలన జరిగింది. విధాతృ + అమ్ అనే సంస్కృత పదాం శాల కలయికలో కన్నడంవారు సంస్కృత విధానానికి విభిన్నము. స్వదేశీయము అయిన సంధిని పాటించి రూపకల్పన కావించినారని గ్రహించగలం. [అమ్ కన్నడ ప్రత్యయమైతే సంస్కృత (యణాదేశ) సంధిరావటం విశేషం. సంస్కృత భాషకు చెందిన పద పహాంశానికి తెలుగు పదంగాని, ప్రత్యయంగాని పరంగా ఉంటే తెలుగు సంధి వస్తుంది. చూ॥ తెలుగు కవుల సంస్కృత ప్రయోగాలు పుట - 51] అలాగే ఇక్కడ కన్నడ సంధి రావాలి గదా ! యణాదేశం కన్నడ సంధి కాదు. ఇది తెలుగు పద్ధతికి విరుద్ధంగా ఉన్నట్లు గుర్తించగలం.

శత్రంతాలు :-

'శతృ' అనే ప్రత్యయం వర్తమానార్థకం. ఇది ధాతువులపై చేరుతుంది. ప్రక్రియదశలో శతృ - అత్; గ ఉంటుంది. అది యందలి 'శ' కారం, అంతంలోని 'ఋ', ఇత్సంజ్ఞకాలైనందున లోపించిపోతాయి.

కాబట్టి 'అత్' మిగులుతుంది. పరస్మైపదధాతువులపై చేరుతుందీ ప్రత్యయం. ధాతువాత్మనే పదమైతే 'శానచ్' (అన) అనేది చేరుతుంది. నేటి భారతీయభాషల్లో కొన్నింట ఆత్మనే పరస్మైపదాది ధాతువర్గం గుర్తించబడినా అందులో పై ప్రత్యయభేదాల ప్రసక్తి లేదు. అన్నిధాతువులకు శతృమాత్రం చేరుతుంది.

హిందీవారీ శతృప్రత్యయాలను దేశీయ ధాతువులకు అంతంలో చేర్చిప్రయోగించటం గలదు. కహ్, బైట్, బాజ్, గిర్, దేఖ్, సున్, టూట్ మొదలగు హిందీపదాలపై శతృ (అత) ప్రత్యయాన్ని చేర్చి కహత్, బైఠత్, గిరత్, టూటత్ మొదలైన శత్రంతరూపాలను హిందీకవులు ప్రయోగించారు ఈ రూపాలు ప్రాచీనకాలంలో ప్రయుక్తాలైనట్లు గ్రహించాలి. ముఖ్యంగా సూరదాస్ (సూరసాగర్), తులసీదాస్ (రామచరితమానస్) ఈవిధంగా ప్రయోగించారని పరిశీలనవల్ల తెలుస్తుంది.

ఇలాంటి రూపాలప్రయోగం వంగభాషలో నాయీ పరిశీలనలో గనరాలేదు. మరాఠీవారున్నూ ఈవిధమైన ప్రయోగాలు చేశారనటానికి ఉదాహరణాలు పరిమితంగా దొరికాయి. జలక్రీడాకరత్ (Marathi translation of History of Bengali Literature by Sukumar Sen, P-64)

మంటను, వెలుగును చెప్పే ధ్వన్యనుకరణాల (ధగ, చక, తళ) కు అంతంలో తెలుగులో 'అత్' అనే సంస్కృత శతృప్రత్యయం చేరుతుందని పరిశీలనవల్ల తెలుస్తుంది. అదే పదంపరంగా ఉన్నప్పుడు పాక్షికంగా ఈ చేర్పు వర్తిస్తుంది. ధగధగ, చకచక, తళతళ, అని అనవచ్చు లేదా పూర్వావయవం తరువాత 'అత్' ను చేర్చి ధగద్ధగ, చకచ్చక, తళత్తళ అనిగూడ అనవచ్చు. (తెలుగు కవుల సంస్కృత ప్రయోగాలు, పుటలు 222-226) ద్విరుక్తతకారాంతంలో మరల శతృలేదా శానచ్ చేరవచ్చును. ధగధగత్, ధగద్ధగత్. శానచ్ చేరితే 'ఆయ' నియతంగా వస్తుంది. ధగధగాయ

మాన, ధగద్ధగాయమాన– మొదటి అవయవం తరువాత 'శానచ్' ప్రత్యయం చేరటంలేదు. అంటే 'ధగాయధగ' అనికాదు గాని, ధగధగాయ అనేది కుదురుతుంది. ధగధగధగ అని ఈవిధంగా అసంఖ్యాకంగా ధ్వన్యనుకరణాలను వాడవచ్చు. మొదటి రెండింటికి తర్వాత 'అప్' అనే దానిని చేర్చిన 'ధగద్ధగద్ధగ' అనే ప్రయోగం ఆంధ్రమహాభారతం, విరాటపర్వం, తృతీయాశ్వాసంలోని 188 వ పద్యంలో గలదు. మూడు అంతకుపైగా ధ్వన్యనుకరణ ఘటితాలతో ఏ సందర్భంలోనూ శానచ్ అనే ప్రత్యయం చేరటంలేదు అనేది గుర్తించదగినయంశం.

దీప్తి లేక దహనములను చెప్పే సందర్భంలో వాడే ధగ, చక, తళ మొదలగు వాటికి వర్తమానార్థకాలైన శతృ, శానచ్ ప్రత్యయాలను ఒకటిగాను రెండు లేక కొన్ని సందర్భాల్లో మూడింటిని చేర్చి సన్నివేశానికి వర్తమానాతాస్ఫూర్తిని గల్గించటం తెలుగులో సాధ్యమవుతుంది. ఈ విధమైన అర్థస్ఫూర్తి సన్నివేశానికి ఇతోధికదీప్తిని గలిగించి కవితను జవసత్వాలతోపాటు ప్రసాదింపజాలి యున్నదని గ్రహింపగలం.

## విహిత వికరణ ప్రత్యయాలపై నిరాదరణ –

సంస్కృత ధాతువులు పదిగణాలుగా గుర్తించారు. పదిగణములగల ఈధాతువులను 'దశగణి' (పది గణములు గలగింది) అని పేర్కొనటం ప్రసిద్ధంగా ఉంది. సార్వధాతుకాల్లో (లట్, లోట్, లఙ్, విధిలిఙ్ మరియు శకారేత్సంజ్ఞకాలయిన శతృ, శానచ్ మొదలైన ప్రత్యయాలు) ధాతు ప్రత్యయాలకు లకారాదుల కాదేశంగా వచ్చిన పురుషవచన బోధకాలకు నడుమ చేరేధ్వనుల్లో ఏకరూపత లేదు. ఈ వైవిధ్యం ఎనిమిది రకాలుగా ఉంది. ఇంతేగాక (వికరణ ప్రత్యయ) ఏధ్వని చేరకుండా నేరుగా ధాతువుతో ప్రత్యయాలు చేరే వర్గం ఒకటి. ధ్వని చేరకపోగా ధ్వనికి మార్పుగ ధాతువుకు

ద్విరుక్తత గలిగేదొకటి. కాబట్టి ధాతువులు మొత్తం పది విభాగాలను గలిగివున్నాయి. పై ఎనిమిదింట్లో రెండింటికి 'అ' చేరుతుంది. య—ఒక వర్గంలోను. న (అద్ముపరంగా) ఉ, నా, అయ అనేవి తక్కినవి. హిందీవారు ఈ ప్రత్యయాలను విస్మరించి నేరుగ ప్రథమము, ప్రాథమికము అయిన అకారాన్ని (అకారేతరాలు ఆగమంగా రావలసిన సందర్భంలో) ప్రయోగించటం గలదు. కథతి, మథతి మొదలగునవి, ఈ సందర్భంలో గుర్తించదగిన ఉదాహరణాలు ఈ వర్గానికి చెందిన ఉదాహరణాలు దాససాహిత్యానికి (సూరదాస్. తులసీదాస్) సంబంధించినవైయుండటం గుర్తింపదగినయంశం. కథతి, మథతి, అనేవి ఉదాహరణాలు. కథ్, మథ్ అనేవి ధాతువులు. 'తి' అనేది పురుషవచన బోధకమైన ప్రత్యయం. ఇది వర్తమానకాలాన్ని (లట్) తెలియజేస్తుంది. 'తి' అనే ఈ ప్రత్యయం పరస్మైపదధాతువులపైన మాత్రమే చేరుతుంది. ధాతు ప్రత్యయాలకు నడుమ చేరిన వర్ణం 'అ' అనేది. ఇది భూ (మొదటి వర్గం) మొదలైన ధాతువర్గంపై చేరుతుంది. మరియు నిది 'తు' (ఆరోవర్గం) దాదులపైచేరుతుంది. కాని కథ్ అనేది చురాది గణంలో చేరేధాతువు. ఈ వర్గంలో వికరణ ప్రత్యయం 'అయ' కాబట్టి చుర్+ అయ + తి అని ఉండగా ధాత్వాదిలోగల ఉకారానికి గుణం వల్ల ఓకారం ఆదేశం అయినందున 'చోరయతి' అని అవుతుందే గాని హిందీవారు వాడినట్లు 'చురతి' గాదు.

మథ్ అనేది తొమ్మిదోవర్గా (క్రియాది)నికి చెందిన ధాతువు. ఇక్కడ వికరణ ప్రత్యయం 'నా' అనేది. కాబట్టి మథ్నాతి అని సిద్ధిస్తుందేగాని మథతి అనిగాదు.

పై ఉదాహరించిన ప్రయోగాలు హిందీవారికి సంస్కృత వ్యాకరణనియమాలపై వారుప్రతిపాదించిన వికరణ ప్రత్యయాదులపై ఆధరము లేదనియు మరియు హిందీవారు స్వతంత్రప్రవృత్తి గలవారనియు తెలుస్తుంది. తరువాతి కాలంలో ఈ స్వాతంత్ర్యమును హిందీవారాదరించియుండలేదని పరిశీలన వల్ల వ్యక్తమవుతుంది.

ఇంతేగాక సూరదాస్ రచించిన సూరసాగర్‌లో సంస్కృత క్రియారూప నిష్పత్తిలో మరోవినూత్న మార్గం గనవస్తుంది. గై (గైశబ్దే ఖ్వాది పుట - 201) అనేధాతువుపై 'ల్యుట్' అనే ప్రత్యయం చేరుతుంది. ఇది ధాతువుపై చేరుతుంది. మరియు దీనికి పురుష వచనబోధకతాశక్తిలేదు. కాబట్టి దీన్ని కృత్ప్రత్యయం అంటారు. ఈ ప్రత్యయం చేరినందున గై అనే ధాతువు నుండి 'గాన' అనే క్రియాజన్యమైన నామం ఏర్పడుతుంది. ఇది క్రియాజన్యమనే నామం అనే విషయాన్ని విస్మరించి, గై అనేదీసందర్భంలో అసలు క్రియా పదం అనేవిషయాన్ని వ్యాకరణం ప్రతిపాదించియున్నదనే యంశాన్ని విస్మరించి హిందీకవులు గాన'అనేదాన్ని వారలవాటు ప్రకారం తుది స్వరాన్ని (అకారం) లోపింపజేసి 'గాన్' అని అంటారు. దీన్నే క్రియగా గుర్తించి గాన్+తి అని పురుషవచన బొధకత గల 'తిƆ' చేర్చి నడుమ వికరణ ప్రత్యయంగా అకారాన్ని జతచేసి 'గానతి అనే రూపాన్ని లట్ ప్రథమపురుషైక వచన రూపంగా ఊహించి సూరదాస్ ప్రయోగించాడు.

'జ్ఞా' (అవబోధనమనే యర్థంగల, పుట - 229) అనే ధాతువు క్ర్యాది వర్గానికి చెందింది. దీన్ని తొమ్మిదో గణంగా గుర్తించారు. ఈ గణంలో ధాతుప్రత్యయాలకు నడుమ (వికరణ ప్రత్యయంగా) 'నా' అనేది వస్తుంది. కాబట్టి జ్ఞా+నా+తి అని ఏర్పడవలసియుండగా (జ్ఞాజనోర్జా 7-3-79) జ్ఞాకు సార్వధాతుకాల్లో 'జా' ఆదేశంగా వస్తుంది. కాబట్టి 'జానాతి' అని అవుతుంది. జ్ఞా+అన=జ్ఞాన అవుతుంది. దీన్ని హిందీవారు వారి ఉచ్చారణధోరణి కనుగుణంగా మార్చి వాడి నందున జాన<జాన్ అవుతుంది. దీని పైన 'అ' అనే వికరణ ప్రత్యయము అనంతరము 'తి' అనే పురుష వచన బోధకప్రత్యయము చేరినందున 'జానతి' అని ఏర్పడుతుంది. దీన్ని హిందీలో సూరదాస్ ప్రయోగించి తన స్వాతంత్ర్యాన్ని నిరూపించుకున్నాడు.

'ప్రయాణ' నుంచి వచ్చిన 'పయన' అనే తద్భవం పైన 'శీ' ధాతు వునకు 'అన' అనే ప్రత్యయం చేరినందున ఏర్పడే శయన (ను+తి, స్తు+తి) నుతి, స్తుతి మొదలైన కృదంతాలపై తెలుగులో 'ఇంచు' అనే దాన్ని వ్యాకరణం విధించినందున నుతించు, పయనించు, పయనించు మొదలగు తత్సమ ధాతువులు ఏర్పడతాయిగాని 'ఇంచు' వ్యవధానం లేకుండా తెలుగువారు పురుషవచన[illegible] హిందీవారివలె క్రియాజన్యనామాలపై చేర్చరు.

విశేషసుబంతాలు :-

లేఖక, దేవత, ఏక మొదలగు నామాలన్నీ సంస్కృతంలో సహజంగా అకారాంతాలు. వీటి తుది స్వరానికి లోపం ప్రాకృతాది భాషల్లో గలుగుతుంది. అలా లోపం వచ్చిన రూపాలు మరాఠీ భాషలో కొన్ని నిలిచివున్నాయి. ఇలాంటి వాటి విషయంలో మరాఠీవారు కొంత చొరవతీసుకొని వీనినే సంస్కృత నామాలుగా గుర్తించి వీటి నుంచి సంస్కృత విభక్తివచనాంతరూపాలను గల్పించి కావ్యభాషలో ప్రయోగించి యుండటం చూడనగును, పైరూపాలకు తుది స్వర లోపం గలుగుతుంది. కాబట్టి లేఖక్, దేవత్, ఏక్ అనే రీతిని హలంతరూపాలేర్పడుతాయి. వీని పైన సాధారణ హలంతాలపై షష్ఠీ విభక్తి బహువచనంలో చేరే(మరుత్+ఆమ్=మరుతామ్) ఆమ్ అనే ప్రత్యయాన్ని విహితం గావించి లేఖకామ్, దేవతామ్ ఏకామ్ అనే రూపాలను మరాఠీలో ప్రయోగించారు. వీనికి లేఖకానామ్, దేవతానామ్ మొదలగు రీతిని షష్ఠీబహువచన ప్రత్యయాంతాలు సంస్కృతంలో ఏర్పడవలసి ఉంది.

వయస్ మొదలగు సకారాంతాలలోని తుది సకారానికి లోపాన్ని వివక్షించి 'వయ' ఇత్యాదిగ అకారాంతాలుగా ప్రాతిపదికనూహించి 'వయాత్' మొదలైన విభక్త్యంత రూపాలను మరాఠీలో వాడుక చేయటం గలదు. దీనికి 'వయసః' అనేది సంస్కృతవ్యాకరణనియ

మాలననుసరించి సిద్ధించే పంచమీవిభక్తి ఏకవచనప్రత్యయ సహిత రూపము.

'విద్యా' అనే ఆకారాంతానికి సప్తమీఏకవచనంలో 'విద్యాయాఆమ్' అనే రూపం ఏర్పడవలసియుడంగా, అట్లుగాక దీనితుది దీర్ఘానికి హ్రస్వాన్ని ఆదేశంగావించి హ్రస్వాంతమే దాని సహజరూపమని విశ్వసించి రామ మొదలైన అకారాంతాలపై చేరే 'ఇ' అనే ప్రత్యయాన్ని సప్తమీవిభక్తి ఏకవచనంలో చేర్చి 'విద్యే' అనే రూపాన్ని గల్పించి 'విద్యేకృషిర్' అనే సందర్భంలో మరాఠీవారు ప్రయోగించి యుండటం గమనింపదగినయంశం. విద్యయందు కృషి అని ఈ సందర్భంలో ఉద్దిష్టార్థమయినందున 'విద్యే' అనేది నియతంగా సప్తమ్యంతమైయుండాలని గ్రహించాలి. ప్రథమ ద్వితీయల్లో ద్వివచనం సంస్కృతంలో 'విద్యే' అనేది ఉంటుంది. కాని దాని ప్రసంగం ఈసందర్భంలో కుదురదు.

కన్నడంలో విధాత్రమ్ అనే రూపం పంపభారతంలో ఉంది. ఇందులో విధాతృ+అమ్ అని విభాగం. అమ్ అనేది సంస్కృతంలో ద్వితీయావిభక్తిలో ఏకవచనప్రత్యయం. (అమ్ అనేది కన్నడంలో గూడ ఉందని శబ్దమణి దర్పణం, పుట-131) ఈ సందర్భంలో యణాదేశసంధి వచ్చినందున 'విధాత్రమ్' అనిరూపం సిద్ధించింది. సంస్కృతంలో ఇక్కడి 'ఋ' కి గుణం వస్తుంది. ఆనంతరం6.4.11సూత్రం-అప్ తృన్తృచ్ స్వసృనప్తృనేష్టృ త్వష్టృ క్షత్తృ హోతృ పోతృ ప్రశాస్తౄణామ్. అనే సూత్రంచే గుణం వచ్చినందున, 'ఋ'స్థానంలోఆదేశమైన 'అర్' అనేదానిలోని అకారానికిదీర్ఘం ఆదేశమవుతుంది. అందువల్ల 'విధాతార్' అని అంగం ఏర్పడుతుంది. దీనిపై 'అమ్' చేరినందున 'విధాతారమ్' అని అవుతుందేగాని 'విధాత్రమ్' అనికాదు. తెలుగులో సంస్కృత నామాలకు అక్షరలోపాదులురావు. కాబట్టి తెలుగులో సంస్కృతం తన నిజ స్వరూపాన్ని చాలావరకు యథాతథంగానిలుపుకున్నదని నిష్కర్షగా చెప్పగలం.

అయితే ఈ సందర్భంలో మరో అంశం గుర్తించాలి. తెలుగులో అధికంగా, తక్కిన భారతీయభాషల్లో ఏ భాషకు తగ్గిపోనంతగా సంస్కృత భాషను వాడుక చేయటం గలదు. తత్పురుషాది తెలుగు సమాసాలను గుర్తించటమేగాక వానికి ప్రత్యేకించి లక్షణం చెప్పక సంస్కృతలక్షణాన్నే యథాతథంగా గ్రహించాలని తెలుగు వ్యాకరణం ఉద్ఘోషించింది. సంస్కృతవ్యాకరణంలో ఉండే పారిభాషికపదాలను (వృత్తి, సంహిత, విభక్తి, కారక మొ॥) ఎన్నింటినో తనలో యిముడ్చుకున్నది తెలుగు. తెలుగు వ్యాకరణంలో ఏ అంశమైనా చెప్పియుండనియెడల దానిని సంస్కృత వ్యాకరణానుసారంగా (అనుక్తమన్యతో గ్రాహ్యమ్) అనిచెప్పి ముందుకు సాగిన ఘనత తెలుగుకే దక్కింది. సంస్కృతంపై తెలుగువారికిగల గౌరవభావాన్ని వారే యీక్రింది విధంగా వివరించియున్నారు.

అవ్యా మహార్ధ్యా సామూలం సర్వస్యేతి నిగద్యతే।
తదనుక్తస్య కార్యస్య వక్తాభవతి పాణినిః॥[1]

తెలుగు మహాకావ్యరచనలో సంస్కృతభాషామయరచనం గావించటం దోషంగాదని యథర్వణాచార్యులు చెప్పియున్నారు.

"ప్రబంధేకేవలాద్యస్య ప్రయోగస్తు నదోషకృత్"[2]

అనుకరణవిరహితంగా తెలుగులో సంస్కృత పదప్రయోగానికి వీరు అనుమతినిచ్చారు.

"వినానుకరణం కేచిదాద్యశబ్దం ప్రయుంజతే"[3]

సంస్కృతంలో స్త్రీలింగప్రకరణం ప్రత్యేకించి ఉంది. నేడు భారతదేశంలో వాడుకచేస్తున్న ఆధునిక ఆర్యభాషల్లో ప్రత్యేకించి

---

1,2,3 అహోబలపండితీయము

స్త్రీలింగబోధకప్రత్యయం రూపుదాల్చియుండలేదు. Masterఅనే ఆంగ్ల పదంపై మతుబర్థకమైన'ఇన్' ను చేర్చి తదంతంలో 'ఈ' అనే ప్రత్యయాన్ని స్త్రీలింగలోచేర్చటంగలదు పుం (మాస్టర్జీ)'మాస్టరినీ'అనేదీ విధంగా ఏర్పడిందే. ఇందులో 'ఇన్' అనే ప్రత్యయానికి అవసరం లేదనిపిస్తుంది. గుణ+ఇన్ అని చేరగా ఏర్పడిన 'గుణిన్' అనే గానిపై మరల స్త్రీప్రత్యయం ఇకారం చేరినందున గుణినీ అవుతుంది. ఇక్కడ 'ఇన్' అర్థవంతం. అర్థం విషయం గుర్తించక సామ్యాన్ని మాత్రం పాటించి 'మాస్టరీనీ' అనేరూపాన్ని వీరుకల్పించి ఉంటారనిపిస్తుంది. అంటే నేటి హిందీభాషలో 'ఇనీ' అనేది స్త్రీ లింగబోధకం. సర్దార్ అనే దానికి 'ఇనీ' ని చేర్చినందుననే 'సర్దారినీ' అనేరూపం స్త్రీలింగబోధకం ఏర్పడింది. హిందీవారి భాషలోగల పదమధ్య అచ్చు లోపించుట అనే ప్రత్యేకలక్షణం వల్ల 'రి' లో 'ఇ' లోపించి' మాస్టర్నీ' అనేరూపం. 'మాస్టర్నీదయాకౌర్' అనే పేరలో ఉన్నదని తెలుస్తుంది.

వంగ భాషలో 'రజక' అనేదానిపై 'ఇనీ' చేరినందువలననే 'రజకినీ' అని అయినదనీ, ఇది అపప్రయోగమనీ S.K ఛటర్జీ తన రచనలో వివరించియున్నాడు.

మరాఠీలో 'ఇనీ' అనేది స్త్రీప్రత్యయంగా ప్రయుక్తమైనట్లు గనరాదుగాని సంస్కృత క్తిన్నంతాలు (హ్రస్వఇకారాంతాలు) సహజంగా స్త్రీలింగాలయినా వానిపై మరల 'ఈ' అనేదాన్ని స్త్రీ ప్రత్యయాన్ని చేర్చి ప్రకృతీ (ప్రకృతి), మతీ (మతి) మొదలైనరూపాలు ప్రయుక్తాలవుతున్నాయి. హ్రస్వాంతమైన క్తిన్నంతాలకు మరాఠీలో ప్రయోగం లేదన్నా అతిశయోక్తి కాదు.

తెలుగు మొదలైన ద్రావిడ భాషల్లో పురుష స్త్రీవాచకనామాలు లింగబోధకతకై పదాంతంలో చేరుతాయి. రామయ్య, మనుమడు మనుమరాలు మొదలగునవి ఉదాహరణాలు.

తెలుగులో భాగవతార్ అనేదానికి స్త్రీ ప్రత్యయరూపాన్ని నిష్పన్నం గావించడానికి చేసిన ప్రయత్నంలో 'ఇనీ' అనేది చోటు చేసుకొన్నందున 'భాగవతారిణీ'>భాగవతారిణి అనే రూపం సిద్ధించింది. భాగవతార్ అన్యదేశ్యమైనందున ఈమార్గాన్ని ఆదరించారు.

అంటే. అన్ని భాషల్లో 'ఇనీ' అనేది స్త్రీలింగ బోధకంగాఉందని గుర్తించగలం.

సంస్కృత వాక్యాల ననుకరించటం తెలుగులోగలదు. అందువల్ల '(శ్రీః' అనుదానికి తత్సమరూపమైన '(శ్రీ' విసర్గవిరహితంగా వర్ధతాం (శ్రీయనియె' అనే ప్రయోగంలో గలదానికి వ్యాకరణం గతి కల్పించింది. సంస్కృత వాక్యంతో విసర్గలు సంధివల్ల ఓకారంగా మారటాన్ని (నామె, లోకోమె॥) వ్యాకరణం ప్రతిపాదించింది. తెలుగులో హలంతాల కుగాగమద్విత్వాలు గలిగాక అనుకరణంలోని తుది ధ్వని మీది పదంతోగలపి సంధి గావటం కింతత్తనియె. దాసోఽహమ్మనె యిత్యాదుల్లో ఇత్యాద్యనుకరణ సంధిలో వ్యాకరణం నిరూపించింది.

ఆర్య. అనార్య. (ద్రావిడ) వర్గాలలో పరిగణితాలయిన ఏభాష పాటించనంతగా సంస్కృతభాషను తనలోకి దిగుమతి చేసుకోవటంలోను సంస్కృత పద సంరూపానికి ఏవిధంగాను భంగంరానంతగా రూపపరిరక్షణ గావించినవారిలో తొలుత పేర్కొనదగినవారు తెలుగువారని తెలుస్తుంది. సంస్కృత భాషపైగల మమకారాన్ని పురస్కరించుకొని తెలుగు తొలికావ్యం సంస్కృతశ్లోకంతో ఆరంభమయింది. తెలుగులో అద్వితీయకవిగా గుర్తింపదగిన తిక్కన తన తొలికావ్యమైన నిర్వచనోత్తర రామాయణాన్ని శ్లోకంతో ప్రారంభించాడని నాచనసోమనాథాదులు ఎడనెడ సంస్కృత భాషామయ రచనలను సాగించారని. సంస్కృతభాషామయాలైన దండకాలను శ్రీనాథాదులు తమ రచనలో పొందుపరిచినారనీ, అన్నమయ్యా మొదలైన పదకర్తలేగాక, ఆధునికులైన సౌందరనందకర్తలున్నూ సంస్కృతమయ రచనలు గావించినారనీ మనం గుర్తించాలి

సంస్కృతవ్యవస్థకు భంగకరాలయిన ప్రక్రియలు :-

ఈ వర్గంలో పరిగణించబడిన ప్రక్రియ (ద్రావిడ) లనార్య భాషయయిన తెలుగులో చాలాతక్కువ. అసలు లేవన్నా అనవచ్చును. ఆర్య భాషాకుటుంబానికి చెందిన హిందీ మొదలగు భాషల్లోనే వీనికి ప్రాచుర్యం గలదని పరిశీలనవల్ల తెలిసేసత్యం.

ద్వంద్వం సంస్కృతంలో ఒక సమాసం. సమప్రాధాన్యంగల పదములు రెండుగానీ అంతకన్న ఎక్కువగానీ యిందులో భాగ స్వాములుగా ఉంటాయి. సమప్రాధాన్యం, అర్థం, తద్వాచ్యమైన వ్యక్తి లేక పదార్థం విషయంలో, 'హరిహర' అనేదొక ద్వంద్వం. ఏతత్పదవాచ్యులైన వక్తులిద్దరు దేవతా విశేషాలు గావటమేగాక పుంలింగైకవచనాంతాలు. వచన సంఖ్యాది నియమాలంతగా పట్టింపు గాదు. పాణిపాద, స్త్రీపుంస మొదలైనవి ద్వంద్వాలు. ద్వంద్వం ద్వివచనాంతంగా ఉంటుంది. అందలిపదాలు రెండుకన్నా ఎక్కువైతే బహువచనాంతంగా ఉండాలి. తెలుగులో ద్వివచనం లేనందున ద్విపదఘటిత ద్వంద్వాలుగూడ బహువచనాంతాలుగా ఉంటాయి. అవి సంస్కృతంలో ద్వివచనాంతాలుగా ఉండవచ్చు. అయినా తెలుగులో ద్వివచనత గనరాదు. అందావిధానంలేదుగదా!

రామలక్ష్మణౌ (సం. ద్వి.) – రామలక్ష్మణులు

ధర్మజార్జునౌ (సం. ద్వి.) – ధర్మజార్జునులు

మొదలైనవి ఉదాహరణాలు, అంటే ఈ సందర్భంలో మనం మరో అంశం గుర్తించాలి. సంస్కృతంలో నిష్పన్నమై ప్రచురతను పొందిన సమాసములనే ప్రత్యయాదుల మార్పులతో తెలుగులో వాడటమేగాని సంస్కృతపదాలతో క్రొత్త ద్వంద్వ సమాసాలను తెలుగులో సృష్టి గావించటం లేదనిపిస్తుంది. 'సిద్ధంబు సర్వంబును గ్రాహ్యంబు' (బాల. సమాస-3) సిద్ధసమాసాల్లో అవ్యయీభావం తప్ప మిగిలిన సమాసా లన్నీ యథావకాశంగా తెలుగుకవుల ప్రయోగాల్లో రూఢికెక్కాయని గ్రహింపనగును.

కన్నడంలో శస్త్రశాస్త్ర (1-98) గాంగేయ విధాత్రం(1-106) మొదలగు ద్వంద్వ సమాసాలున్నాయి. వీనికి సంస్కృతంలో ద్వివచనం వస్తుంది. కన్నడంలో ద్వివచనం లేనందున బహువచన ద్యోతక ప్రత్యయం రావాలి. బహువచన బోధకత లేకుండ ఈ సమాసాలు ఏకవచనాంతాలుగా ఉండటం ద్రావిడభాషల్లో ఒకటైన తెలుగుసంప్రదాయానికి విరుద్ధంగాను ఆర్యభాషావర్గంలో చేరే హిందీ మరాఠీ మొదలైన భాషలకు దగ్గరగాను ఉంది. ఈ ప్రయోగాలు పంపభారతంలోనివి. అంటే అతిప్రాచీన కాలంలోనే కన్నడం ఉత్తరదేశీయులభాషయైన ప్రాకృత భాషలకనుగుణంగా రూపుదిద్దుకున్నట్లు గ్రహించాలి. ఆనాటి ప్రాకృత భాషలే నేటి ఔత్తరాహ భాషలైనవనేది జగమెరిగిన సత్యం. ప్రాకృతాది భాషాప్రభావానికి నన్నయాదులు లోనుగాలేదనీ వారు సవిమర్శకముగ సంస్కృత సంప్రదాయాన్ని ఆదరించారు. సంస్కృతభాషకు గల సహజ లక్షణాలకు భంగం కలిగించే పద్ధతిని వారాదరించలేదని తెలుస్తుంది.

ద్వి లేదా త్రిపద ఘటితాలైన ఈక్రింది హిందీ, మరాఠీ మరియు వంగభాషల్లోగనబడే సమాసాలు ఏకవచనాంతాలుగా ఉండటం ఈ క్రింది ఉదాహరణాలవల్ల నిరూపితమవుతుంది. ఈ సమాసములందలి పదములన్నియు సంస్కృత పదములై యుండుట గమనించదగును.

ద్విపద ఘటిత హిందీ సమాసాలు :-

పూజా అర్చనా (సంధి లేదు)
మాతు పితా
శివ విరించి
హరిహలధర

| | |
|---|---|
| కృత్యాకృత్య | (సంధి ప్రవర్తించింది) |
| శీలాశీల | ( .. ) |
| కర్తవ్యాకర్తవ్య | ( .. ) |
| యాతాయాతా | ( .. ) |

త్రిపద ఘటిత హిందీ సమాసాలు :-

ధనసుతదారా
ధనీమానీ గృహ
యుధిష్ఠిరనకుల సహదేవ

చతుష్పద ఘటిత హిందీ సమాసాలు :-

రూపరేఖ గుణజాతి
వన ఉపవనసరోవర
కురుపతి ద్రోణకృపకర్ణ మొదలగునవి

ద్విపద ఘటిత మరాఠీ సమాసాలు :-

పాటలిపుత్ర తామ్రలిప్తి
శిల్పకలా స్థాపత్యకలా
యువ యువతీ
ఇష్టా నిష్ట
పతి పత్ని
ఆచార విచార
నిర్ధన ధనవాన్
మాన మర్యాదా
కర్మబుద్ధి
ఓషధి వనస్పతీ
తరులతా
పశుపక్షీ

త్రిపద ఘటిత మరాఠీ సమాసాలు -

రామలక్ష్మణసీత

చతుష్పద ఘటిత మరాఠీ సమాసాలు :-

నదీనద అరణ్యనగరీ (విసంధి)

ద్విపద ఘటిత వంగభాషా సమాసాలు :-

పితామాతా
మాతాపుత్రీ
పల్లీగ్రామే
జగత్సంసారే
జీవన యౌవన
చలాచల
లేఖాపడా
పూజార్చనా
శ్రద్ధాశాంతీ
స్నానాహారే
నిశిదిన

త్రిపద ఘటిత వంగభాషా సమాసాలు :-

ఆహార విశ్రామ ఆశ్రయ (వివింధి)

ఈ భాషలో (వంగ) ఇలాంటి సమాసాలు అత్యధికంగా ఉన్నాయి.

సమాసాంతమునందలి వచన సూచకాంశము విషయమునందే గాక ఈ సమాసములలో కొన్నిట ప్రవర్తింపవలసిన సంధి విధాన మునకు ప్రవృత్తి గానరాదు. సమాసమునందు సంహితనియతము. సంహితయున్నయెడల నియతముగ సంధిరావలయును. అయినను పైయుదాహరణములలో కొన్నిట సవర్ణ దీర్ఘాది సంధులకు ప్రవృత్తి గల యుదాహరణములందుగూడ తదప్రవృత్తి గుర్తింపదగియున్నది.

అవ్యయీ భావ సమాసాలు :-

అనవ్యయాలు అంటే అవ్యమేతరాలు. ఈ సమాసాల్లో ఉండే పూర్వోత్తరపదాలు. ఈపదములు కలిసినపుడు పదక్రమం మారుతుంది.

సమాసంలో. అంతేగాక, పదాలకు, పదాలకు తదన్యపదాలాదేశంగా రావటం ఈ సమాసంలో కొన్ని సందర్భాల్లో గలదు. ఈ వర్గంలో చేరిన సమాసాలవ్యయాలవుతాయి. అంటే ఇవన్నీ లింగ విభక్తి వచన శూన్యాలవుతాయి. ఇవి వాక్యంలో క్రియా విశేషణాలుగా ఉంటాయి. కాబట్టి వీటిని క్రియావిశేషణాలు (Adverbial Compounds) అంటారు. ఈ సమాసాల్లో తొలిపదం ప్రధానంగా ఉంటుంది. ఈ సమాసాలు ప్రాయికంగా పూర్వపద ప్రాధాన్యతగలిగి వుంటాయి. అందువల్లనే సమాస పరిగణనంలో ఇది మొదటిదిగా గుర్తించబడింది.

చిరాయ మొదలైన ప్రతిపదోక్తావ్యయాలు గానీ, కర్తుమ్ మొదలైన లాక్షణికావ్యయాలు గానీ సంస్కృతంనుంచి తెలుగు మొదలైన ద్రావిడభాషల్లోకి వచ్చినట్లుదాహరణాలు లేవు. అవ్యయత దీనికి కారణం అని అనుకోవచ్చు. ఈ సమస్యవల్లనే అవ్యయత్వం పొందిన ఈపూర్వపద ప్రధాన సమాసాలుగూడ తెలుగులోకి రాలేదనిపస్తుంది. ఈ యంశంలో కన్నడం గూడ ద్రావిడ సంప్రదాయ విధేయమై తెలుగుననుకరించియున్నది.

ఆధునికార్యభాషల్లో ముఖ్యంగా బెంగాలీలో అవ్యయీభావ సమాసాల ప్రయోగం అధికంగా ఉంది. ఈ సమాసాల కాద్యంతాల్లో సందర్భానుసారంగా వివిధపదాంశాలను చేర్చి ప్రయోగించటం గూడ వంగభాషలో గలిగియుండటం ఆభాషలో ఈసమాసాలకు గల ప్రాచుర్యాన్ని తెలుపుతుంది.

<u>వంగభాషలోగల అవ్యయీభావ సమాసాలు :-</u>

పూర్వమందు పదాంశంతో—
అభూతపూర్వ
స్పష్ట ప్రత్యక్షవత్
పరముగా పదాంశం/ప్రత్యయము
యథా సమయే
స్పష్ట-ప్రత్యక్ష-వత్

ప్రామాంతరే
స్థానాంతరిత
యథాపరిమాణే
యథావార్తా
యథాస్థానే
ప్రత్యక్షవత్
యథోచితయత్న
యథానియమ

పూర్వంగా గానీ పరంగాగానీ పదంలేదా పదాంశంలేని అవ్యయీభావాలు.

యథాసాధ్య
భూతపూర్వ
యథాకర్తవ్య
యథాయోగ్య
యథావిధి
యథోచిత
యథాసంభవ
యథేష్ట

అవ్యయీభావాలు—హిందీ:—

ప్రతినిత్యం అనేదొక అవ్యయీభావ సమాసం. ఇది నిత్యం నిత్యం అనే పదాలవల్ల ఏర్పడింది. ఇందులో ఒకదానికాదేశంగా 'ప్రతి' వచ్చినందున 'ప్రతినిత్యం' అని ఏర్పడింది. బెంగాలీవారు ఈ సమాసాలకాదిలో స్పష్ట' ఇత్యాదులను అంతంలో 'వర' మొదలగు వాటిని చేర్చి విశేషరూపాలను విశేషార్థకాలుగా వాడటం జరిగింది. హిందీలో ప్రతినిత్యం అనే ఈ సమాసంలో పదక్రమాన్ని మార్చి 'నిత్యప్రతి' అని ప్రయోగించారు. 'నిత్యం' పూర్వపదం కాగా అందలి అంత్యంలోగల అనుస్వారం లోపంగూడ వచ్చినట్లు ప్రత్యేకించి

మనం ఈ సందర్భంలో గుర్తించాల్సిన అంశం. ఈ రెండు విధాలైన (నిత్యప్రతి/ప్రతినిత్యం) సమాసాలను ఒకేరచయిత ఒకే గ్రంథంలో అర్థభేదంలేకుండ ప్రయోగించటం ఇవి కేవలం పర్యాయాలుగా గుర్తింపదగియున్నాయని మనం గ్రహించాలి. ఇంతేగాక మైథిలీశరణ్‌గుప్త అనే ప్రసిద్ధ హిందీ రచయిత 'యథా' అనే పదం ఆదిగాగల ఈ క్రింది సమాసాలను తన రచనలో వాడినట్లు పరిశీలన వల్ల తెలుస్తుంది.

| | |
|---|---|
| యథాపూర్వ | యథాస్థాన |
| యథావిధి | యథారుచి |
| యథాయోగ్య | యథేచ్ఛ |
| యథోచిత | యథార్థ |
| యథాసమయ | |

'పూర్వవత్' అనేది 'యథాపూర్వమ్' వివరణాత్మక వాక్యం. అంటే ఇక్కడ 'వత్' అనే ప్రత్యయానికి మారుగ 'యథా' వచ్చింది. మిగిలిన సందర్భాల్లో 'అనతిక్రమ్య' అనే అవ్యయానికి బదులుగా యథాప్రయుక్తం. యథావిధికి విగ్రహం (వివరణాత్మకవాక్యం) విధిమనతిక్రమ్య అనేది.

మరాఠీ:— మరాఠీలో 'అథవా' మొదలైన అవ్యయాల ప్రయోగం గలదు గాని అవ్యయీభావ సమాసాల ప్రయోగం అంతగాలేదు.

అభూతపూర్వమ్ (భూతపూర్వ అనేదానికి ముందు 'అ' చేరింది)
యథా యోగ్య
యథాసాధ్య

కన్నడాంధ్రములందీ సమాసములకతంతాభావము. ఈయంశమున ద్రావిడభాష లార్యభాషల కన్నమిన్నగా తమ తమ ప్రత్యేక లక్షణాలను నిలుపుకున్నవని గ్రహించటం సమంజసం.

సంధి

సంహిత ఉంటేసంధి వస్తుంది. ఏకపదంలో (ప్రకృతి ప్రత్యయాలనడుమ) ధాతూపసర్గలనడుమ సమసించే పూర్వోత్తరపదాల మధ్య సంహిత (ఉచ్చారణలో దగ్గరితనం) ఉండి తీరుతుంది. సంహిత ఉన్నయెడల సంధి నియతంగా వస్తుంది. ఆధునికార్య భాషల్లో సమాసాల్లో సంహిత ఉండటుండిగాబట్టి సంధి నియతంగా ప్రవర్తించ వలసియుండగా ఆ సంధిరాని ఉదాహరణలీ క్రిందమనం గుర్తించనగును.

సంధి విరహిత హిందీ ప్రయోగాలు (సమాసాలు)

ముని అతి
అతి అనురాగ
హిత అనహిత
వేద ఉపనిషద్
సీత ఉషన
గున అవగున
హర్ష అతురతా
కాల అగ్ని
అంతరరాష్ట్రీ

అనేటప్పుడు లోపదీర్ఘతలను సంస్కృతం విధించగా ఆమార్పును హిందీవారు పరిగణించలేదు. అంతరరుద్ధ అనే వంగభాషా ప్రయోగం ఇలాంటిది. ఈ ప్రయోగాలు క్రమంగా భారతీయభాషలన్నింట (Including Dravidian) ప్రవేశిస్తున్నాయి. ఈవిధమైన ప్రచారానికి నేటి వార్తాపత్రికలు తోడ్పడుతున్నాయి. భాషల్లో ఏకత్వానికి (unity) నేడు పత్రికల పాత్రఎంతైనా ఉంది.

దేవర్షి, సప్తర్షి, వర్షర్తు మొదలగు సమాసాల్లో ఉత్తరపదము ఋకారాది. ఈ సిద్ధ సమాసాలను విసంధి వల్ల వేరుచేసి పరపదాదిలో

గల 'ఋ'కి ప్రాకృత భాషీయులు 'రి'(స్వరరిచ ఋవర్ణస్య)ని విధించారు. ఆ ప్రాకృత మార్గ విధేయంగా సంస్కృతసిద్ధ సమాసాలను విడదీసి 'ఋ' అనే అచ్చుకు 'రి' ని ఆదేశం గావించి దేవరిషి, వర్షరితు, సప్తరిషి మొదలగు సమస్తరూపాలను హిందీ (సూరసాగర్) వారు ప్రయోగించారని పరిశీలనవల్ల తెలుస్తుంది.

గమనిక:- పదాంతంలోగల ఇక్కుల కసవర్ణములైన అచ్చులు పరమయినచో హ్రస్వం వికల్పమని పాణిని అష్టాధ్యాయి – ఇకోఽసవర్ణే శాకల్యస్య హ్రస్వశ్చ (6-1-127) లో ప్రతిపాదించాడు. చక్రి+అత్ర అనేది ఉదాహరణం. ఇక్కడ సంధ్యభావం సారాంశం. ఈ విధానం ప్రాకృతాల్లోను అనంతరకాలంలో ఆధునికార్య భాషలైన హిందీ మొదలైన భాషల్లో ప్రాచుర్యాన్ని పొందినట్లు గ్రహింపగలం. 'ఇక్' అనే ప్రత్యాహారంలో గతార్థంగాని అకారానికి 'ఋ' పరంగా ఉన్నపుడు (ఋత్యకః 6 1-128)గూడ హ్రస్వం వికల్పమని పాణిని అష్టాధ్యాయిలో ప్రతిపాదించాడు. బ్రహ్మ+ఋషి అనేది సందర్భంలో గుర్తించదగిన ఉదాహరణం. ఈ విధంగా సంధిగతాల్లో ఋ కారాదులను వేరు చేయటం అనంతర కాలంలో సంస్కృతంలో కన్న ప్రాకృతంలో ప్రాచుర్యతను గాంచి కాలాంతరంలో వారి ఉచ్చారణాను సారంగా స్వరము గానీ, 'రి' అనేదాన్ని గాని 'ఋ'కు ఆదేశం గావించి యుంటారని మనకవగతమౌతుంది.

<u>విసంధిగల వంగభాషా ప్రయోగాలు:-</u>

ఆసన్న అనైసర్గిక
నిరానంద అంధకార
అపరాధీ ఏవం నిరపరాధీ
ఖ్యాత అఖ్యాత
పాఠ్య అపాఠ్య
అభావే అనటనే
శిక్షిత అశిక్షిత
అల్ప అవశిష్ట

వర్షా అంతే
ఇచ్ఛా అనిచ్ఛా
స్నాన ఆచమన
అనాస్వాదిత అమృత
నితాంత అప్రాసంగిక

మరాఠీలో విసంధి ప్రయోగాలు:-

మధ్య ఆసియా
వ్యాపార ఉద్యోగ
వర్షాఋతూ (హిందీలో వలె ఇక్కడ 'ఋ' కు మారుగ 'రి' ఆదేశం గాలేదు)
వసంతఋతూ
అంతిమ అనుప్రాస
అతిఉత్తమ
అతిఆనంద
ఆశాఆశంకా
అనార్య అసంస్కృత

విసంధికి కన్నడాంధ్రాల్లో ఉదాహరణాలు లేనందున ఈ పద్ధతి ద్రావిడ భాషల్లో లేదని మనం గ్రహించాలి. పాణిని పాక్షికంగా విసంధిని ప్రతిపాదించగా దాన్ని ప్రాకృత భాషలాదరించాయి. వాని వల్ల నేటి ఆర్యభాషల్లోనికీ విధానం ప్రవేశించిందని గమనించాలి.

కృత్తద్ధితాంతాలు:-

తద్ధితాంతాల్లో 5 1-119 సూత్ర ప్రతిపాదితమై త్వ/తా (తక్) అనే విభవార్థకంలో వస్తాయి. బాల్యత్వ. బాల్యతా మొదలగునవి ఉదాహరణాలు. హిందీలో 'తా' అనే ప్రత్యయాన్ని అధికంగా వాడుక చేస్తున్నారు 'త' అనే ప్రత్యయానికి సందర్భంలో ప్రయోగం లేనే లేదన్నా అతిశయోక్తి కాదు.

కువేషతా
గుణవత్తా
అకించనతా
అలజ్జతా
ఆర్యతా
నిరీహతా
ఉచ్చతా
త్యాగతా

మొదలయినవి హిందీలో తులసీదాస్ ప్రభృతులైన ప్రాచీన మహా కవులేగాక మైథిలీశరణ్‌గుప్త యిత్యాదులైన ఆధునిక మహాకవులు గూడ వాడుక చేసియున్నారు 'తా' కి బదులుగా పాణినీయం ప్రతిపాదించిన 'త్వ' అనేది చేరితే ఏర్పడే కువేషత్వం, గుణవత్వం మొదలయినవి, వాని ప్రయోగాలు హిందీ కావ్య భాషలో పూర్తిగ అంతరించిపోయినవి. ఈ ప్రత్యయద్వయానికి సంస్కృతంలో ప్రయోగం ఉంది. తెలుగువారీ ప్రత్యయాలను రెంటిని సందర్భానుసారంగా వాడుక చేస్తున్నందున వీరు సంస్కృత విధానాన్ని ఆచరణ వేస్తున్నవారుగ గుర్తింపదగియున్నారు.

ఇక్కడ మరో విషయం గుర్తించాలి. తా (తక్) అనేది గ్రామ జన మొదలైన పదాలపై సమూహార్థంలో చేరుతుందని పాణిని 'గ్రామ జనబంధుభ్యస్తల్ (4-2-43) అనే సూత్రంలో నిర్దేశించాడు. గజ, సహాయ శబ్దాలకు గూడ ఈ ప్రత్యయం చేరుతుందని వార్తికకారుడు వ్రాశాడు.

తులసీదాస్ రామాయణం (పుటలు 139, 144) లో పైవిధానం ప్రయుక్తం. కాని దీనికి సమూహార్థం గాక భావార్థం మాత్రమే ఉద్దిష్టమని సందర్భం వల్ల తెలుస్తుంది. కాబట్టి భావార్థంలో 'త్వ' అనే ప్రత్యయానికి లోపము. తా (తల్) అనే దానికి సమూహార్థము హిందీలో లోపించాయనేది గమనించవలసిన అంశం. అంతేగాక, తా (తల్) అనేదానికి భావార్థమేగాని పరిమిత సందర్భాలలోనైనా

దానికి సమూహార్థంలేదని గ్రహించాలి. ప్రత్యయాలకు అప్రవృత్తిగా మనం గుర్తించదగును. కొన్ని ప్రత్యయాలకధిక ప్రవృత్తి గలదని పరిశీలనవల్ల సువ్యక్తమవుతుంది. (ఇతచ్) మరాఠీలో తా (తల్) అంతాలు కొన్నిగలవు.

(1) నవీనతా
(2) అస్థిరతా
(3) విద్వత్తా
(4) స్వామిత్వ
(5) లయబద్ధతా
(6) కార్యకుశలతా
(7) విశ్వజగతికతా
(8) సమాప్తిహీనతా
(9) బాహ్యికతా
(10) సార్వజనికతా
(11) అసహిష్ణుతా
(12) గతిహీనతా
(13) నాగరతా
(14) అనన్యయోగితా
(15) సార్వభౌమికతా
(16) స్వదేశకరా
(71) సర్వసమావేశకతా

అంతేగాక 'త్వ' అనేది అంతంగాగల స్వామిత్వ అనేది గూడ ఈ సందర్భంలో ఉండటం గుర్తింపదగినయంశం.

వంగభాషలో ఈ క్రింది తా (తల్) అంతాలు గుర్తించదగి ఉన్నాయి.

| | |
|---|---|
| గ్రామ్యతా | అకర్మణ్యతా |
| త్రస్తతా | అకించిత్కరతా |
| భీతివిహ్వలతా | వక్తృతా |

మొదలగు 'తా' అంతాలున్నాయే గాని 'త్వ' ప్రత్యయాంతాల ఉనికి గనరాదు. కన్నడాంధ్రములందు 'త్వ' మరియు 'తా' అనే రెండు ప్రత్యయాలు ప్రయుక్తాలవుతున్నందున సంస్కృత భాషయొక్క నిజరూపం హిందీ, మరాఠీ మొదలగు ఆధునికార్యభాషలందు గాక ద్రావిడ భాషలుగా పరిగణితములైన దక్షిణదేశీయ భాషలందేగలదని ఈ యంశమును బట్టి మనము చెప్పగలము.

ఇమనిజంతాలు:-

భావార్థంలో 'ఇమనిచ్' అనే ప్రత్యయం నామాలపై చేరుతుంది. నామాలకలయిక యైనందున దీన్ని తద్ధిత ప్రత్యయంగా గుర్తించాలి. దీన్ని అంత, ఆది, అగ్ర మొదలగు సంస్కృత పదాలపై చేర్చి ప్రయోగించటం హిందీలో గలదు. పై నామాలకు ఈ ప్రత్యయంచేరటం వ్యాకరణ సంప్రదాయ సమ్మతంగాదు. అయినా హిందీవారు తమకుగల నిరంకుశతను దృష్టిలో పెట్టుకొని ఈ విధంగా తమ స్వాతంత్ర్యాన్ని ప్రకటించారనీ, అందువల్ల అంతిమ, ఆదిమ, అగ్రిమ ఇత్యాదిరూపాలు నిష్పన్నాలై కవిప్రయోగ రూఢాలయినాయనీ గ్రహించాలి. ఇంతేగాక, ఈ ప్రత్యయాన్ని సంస్కృతేతర పదముగా గుర్తింపదగిన లాల్ అనే వర్ణవాచకంపై ప్రయుక్తంగావటం గమనించాలి. వర్ణవాచకాలపై ఈ ప్రత్యయం చేరవచ్చును. శుక్లిమా (వర్ణదృఢాదిభ్యః ష్యఞ్చ 5-1-123) అనేసూత్రం ఈరూపాన్ని సాధింప నుపకరించే రూపం. రక్తిమ అనేది వర్ణవాచకమయినందున దీనిపై ఈసూత్రప్రతిపాదితాంశమైన ఈ ప్రత్యయ ప్రవృత్తిగలదు. ఈ సందర్భంలో 'రక్త'కు వికృతిపదము, దేశీయమైన పదము 'లాల్' అనేది, ఈ పదంపై ఈ ప్రత్యయాన్ని కూర్చి వాడటం వల్ల ఈ ప్రత్యయం హిందీ రచయితలదృష్టిలో ఎంతగా ప్రాచుర్యాన్ని పొందిందో తెలుసుకోగలం.

'మయట్ అనే సంస్కృత ప్రత్యయం తెలుగులో మిక్కిలి ప్రాచుర్యాన్ని పొందిన సంస్కృత ప్రత్యయం. కాబట్టి ఈప్రత్యయం

ప్రోవుల, తమ ఇత్యాది తెలుగు పదాలకు పరంగా చేరినందున ఏర్పడే రూపాలను ప్రాచీనాంధ్ర కవులు ప్రయోగించియుండటం గుర్తింపదగినయంశం. 'చక్రోరచయంబు-చదల తమమయంబు గాగ. 'మెదడు ప్రోవులమయమయ్యె - ప్రధనభూమి' అనే ప్రయోగాలు గుర్తింపదగినవి. ఈ ప్రయోగద్వయము కవిత్రయ యుగమునకు చెందిన వాడుగా గణుతికెక్కిన నాచనసోమన ఉత్తర హరివంశమున గావించిన ప్రయోగములు. తమమయ మనేదాన్ని కవిత్రయములో ప్రథమగణ్యుడయిన తిక్కన తన నిర్వనోత్తర రామాయణమునందు గావించిన ప్రయోగము.

వంగభాషలో తొమ్మిదిపాళ్ళకు పైగా సంస్కృతం ఉందని అభిజ్ఞులంటుంటారు. కాని, ఆ భాషలో పైరీతిగ 'ఇమ' అనే ప్రత్యయాన్ని వాడినట్లు గానరాదు. ఒక విధంగా చెప్పాలంటే ఈభాషలో ఈ ప్రత్యయం అంతగా ప్రాధాన్యాన్ని సంతరించుకోలేదు. దీనికి కారణాలనరయుట కష్టబహుళమైన అంశం. అంతగా పరిశ్రమతో కారణాలనూహించగలమేకాని యథార్థాన్ని తేల్చటంకష్టం. 'రక్తిమా' అనే ప్రయోగంలో ఇమ' అనేది గలదు. 'ఆరక్తిమముఖ' అనే సమస్తపదంలో గూడ రక్తిమ అనేది చోటుచేసుకొన్నదని మనం చెప్పవచ్చును. దేశీయ పదాలపైనగానీ వ్యాకరణం ప్రతిపాదించని సంస్కృత పదాలపైనగానీ ఈ ప్రత్యయాన్ని చేర్చి ప్రయోగించటం బెంగాలీలో లేదు. 'రక్త' అనేది వర్ణవాచకమైనందున దీనిపై 'ఇమ' అనే ప్రత్యయం చేరటం సంస్కృతివ్యాకరణ సంప్రదాయానికి అనుగుణమే గాని తదన్యంకాదు. మరాఠీవారు సంస్కృత నిఘంటువున కనుగుణంగా తమ తమ పదజాలాన్ని ప్రయోగించటంగలదు. ప్రశస్తము. ఖనిజలవణములు పుష్కలంగా గల భూమినే మృత్తిక అనటం అమరకోశంలో (మృమృత్తికా ప్రశస్తాతు) కలదు. ప్రశస్తమైన నేల అనే అర్థంలో మృత్తికను, సర్వసస్యములతో విరాజిల్లుతున్న భూమిని 'ఉర్వర'యనియు (ఉర్వరా సర్వసస్యాఢ్యా ) అమరంలో చెప్పబడింది. ఈ పదాల నీ యర్థంలోనే మరాఠీ వారు

వాడియుండటం గుర్తింపదగును. నేటి వ్యవహారంలో ఇవి భూ పర్యాయాలై పోయినాయి.

'ఇమ'అనే ప్రత్యయాన్ని మరాఠీ వారు యథేచ్ఛగ వాడలేదు. 'అంతిమ' అనే మాటను వీరు కొన్ని చోట్లవాడియుండిరి. 'అంతిమ అనుప్రాస' అనే పారిభాషిక పదంలో గూడ ఇది ఉండటం గుర్తింప దగును.

ఈ ప్రత్యయం విషయమై కన్నడంలోని స్థితి విచిత్రముగ నున్నది. ఈ ప్రత్యయాన్ని సంస్కృతవ్యాకరణం విధించిన సంద ర్భంలోకాక తదన్యమైన ప్రౌఢఅనే దానిపై చేర్చి పంపకవి 'ప్రౌఢిమ' అనే రూపాన్ని వాడుకచేసియున్నాడు. సంస్కృత వ్యాకరణంలోగల ప్రత్యయాలను గ్రహించి వినూత్న ప్రాతిపదికలపై వాటిని చేర్చి కొత్త పదబంధ కల్పనం కన్నడంలో పంపకవికి ముందే ప్రారంభ మయినదని గ్రహింపనగును. అనంతరకాలంలో ఈ రూపం భాస్కర రామాయణంలో ప్రయుక్తమైనందున ఆనాటికి తెలుగు పండిత కవులు పంపభారతాన్నవగితం చేసుకొని యందలి ప్రయోగ విధానాలపై ఆదరభావాన్ని పెంచుకున్నారని అందువల్ల 'ప్రౌఢిమ' ఇత్యాదులు తెలుగులో చోటుచేసుకున్నాయనీ మనం గ్రహింపదగును.

<u>ఇలచ్ ప్రత్యయాంతాలు:-</u>

పాణిని వ్యాకరణంలో (5-2-100, 5-2-117) రెండు సూత్రాలు ఇలచ్ అనే ప్రత్యయాన్ని విధించటానికై నిర్దిష్టాలై ఉన్నాయి. కాని ఈ రెండు సూత్రాలు గుర్తించని ప్రాతిపదికలపై ఈప్రత్యయాన్ని చేర్చి ప్రయోగించటం హిందీలో కలదు ధూమిల,స్వప్నిల, మరియు ఫేనిల అనేవీ సందర్భంలో గుర్తింపదగిన ఉదాహరణాలు. ధూమ, స్వప్న. ఫేన అనే ప్రాతిపదికలపై ఈప్రత్యయాలు చేరగా పూర్వా వయవాంతంలోగల అకారానికి లోపం విహితమయినందున ధూమిల, మొదలైన రూపాలు నిష్పన్నములయినాయని గ్రహించాలి. ఈ

ఈవిధంగా తుది స్వరానికి లోపం రానియెడల అకార, ఇకారాలకు గుణసంధి ప్రాప్తిస్తుంది. గాబట్టి ధూమెల మొదలగు అసాధు రూపాలు నిష్పన్నాలవుతాయి.

వ్యాకరణ నియమాలకు అంటే పాణిని ప్రతిపాదిత మార్గానికి విరుద్ధంగా 'ఇల' అనే ప్రత్యయం సంస్కృతపదాలపై చేరగా నిష్పన్నాలైన ఈ క్రింది ప్రయోగాలు తెలుగులో కలవు. ఀః ప్రయోగాలు భాస్కరరామాయణంలో తొలిసారిగ దొరికాయి. భాస్కరరామాయణానికి మునుపున్న నన్నయాదుల భాషలో ఈ ప్రయోగాలు ప్రయుక్తాలయినాయనటానికి ఆధారాలు గానరావు.

గ్రంథిల
ఆగ్రహిణి
సికతిల
శర్కరిల

మొదలైనవీ ప్రయోగాలు. ఈ ప్రయోగాలను గూర్చి మిగిలిన వివరాలకు'తెలుగుకవులసంస్కృతప్రయోగాలు' (పుట–164)చూడనగును.

కన్నడంలో ఈ ప్రత్యయాంతాలకు ప్రయోగం లేదనిపించును. వంగభాషలో 'ఇల' ప్రత్యయాంతాలు కొన్ని ఉన్నాయి.

ఈర్ష్యాఫేనిల
జన్మిల

అనేవీ సందర్భంలో గల ప్రయోగాలు, ఫేనిల అనేది హిందీలో గూడ గలదుగాని 'జన్మిల' అనేది హిందీలోగాని, తెలుగులో గాని లేని రూపం. ఇది బెంగాలీకి మాత్రం పరిమితం.

మరాఠీలో 'ఇలచ్' అనే ప్రత్యయంతాల ప్రయోగం గనరాలేదు. సంస్కృతంలో ఀః ప్రత్యయాంతాలను వీరి భాషలో వాడుక చేసినట్లు దాఖలా లేక పోవటమేగాక ఀః ప్రత్యయాలను స్వతంత్రముగా

హిందీ, వంగభాషల్లో సంస్కృతపదాల కంఠంలో చేర్చి ప్రయోగించిన లక్షణాలు గూడ మరాఠీలో లేకుండుట గుర్తించాలి.

వృద్ధికి వ్యతిరేకత :-

ఆధునిక భారతీయభాషలైన హిందీ మొదలగు భాషల్లో సంస్కృత పదాలల్లో సహజంగా ఉండే వృద్ధికి అభావాన్ని గల్పించి ప్రయోగించటం గలదు. పదాదిలోగల అ> ఆగాను, ఇ> ఐగాను, ఉ> ఔ గాను మారటం వృద్ధి. ఇది పూర్వపదాంత పరపదాదిలోగల స్వరాలకు ఆదేశంగా వచ్చే వృద్ధిని పోలినది కాదు. పదాదుల్లో ఈ మార్పు వస్తుంది గాబట్టి పదాది అక్షరానికి గలిగిన మార్పయినందున దీన్ని సంక్షేపంగా ఆదివృద్ధి అని పేర్కొనటం గలదు. ఈ ఆది వృద్ధికి భంజకాలైన ఈ క్రింది ప్రయోగాలు హిందీలో గలవు ఇవి ప్రాచీన కవులేగాక, ఆధునిక కవుల ప్రయోగాల్లో గూడ చోటుచేసుకోవడం గుర్తింపదగిన యంశం,

న్యాయ+ఇక < నైయాయిక

అని గావలసియుండగా 'న్యాయిక' అని హిందీవారు ప్రయోగించారు.

దుర్భగ+య < దౌర్భాగ్య

అనిగావలపియుండగా 'దుర్భాగ్య' అని హిందీలో ప్రయోగము,

అతిథి + ఏయ < ఆతిథేయ

అని గావలసియుండగా 'అతిథేయ' అని హిందీలో ప్రయోగం.

ఆగ్నేయాస్త్ర, వారుణాస్త్ర అనే సంస్కృత సమాసపదాలల్లో ఆద్యక్షరానికి (అ> ఆ) వృద్ధిరాగా దానికి భంగాన్ని గలిగించి 'అగ్న్యేస్త్ర', వరుణాస్త్ర ఇత్యాది ప్రయోగాలు హిందీకవి ప్రయోగాలుగా గణుతికెక్కి ఉన్నవి.

ఈయంశమునందు మరాఠీవారు సంస్కృత మర్యాదనుపాటించియున్నారు. అంటే వారు ఆగ్నేయాస్త్ర మొదలగు ప్రయోగములందరమును చూపుటయేగాక బుద్ధి+ఇక, యిత్యాదులందు వారాది

వృద్ధి సమాదరించినందున బౌద్ధిక మొదలగు రూపాలు ఏర్పడినాయి. బౌద్ధికలో పూర్వావయవం 'బుద్ధ' గాదు బుద్ధి' అని ప్రయోగం వల్ల తెలియనగును. కౌటుంబిక > కుటుంబ, విశ్వజగతికతా> జగతిక ఆత్యుత్కృష్ట> అత్యుత్కృష్ట, వైచారిక> విచార+ ఇక, శౌక్రేయ> శుక్ర+ఏయ, దైదీప్యమాన > దేదీప్యమాన మొదలైన ఆదివృద్ధి సహిత రూపాలను. మరాఠీవారదరించి యుండిరని, ఈ మార్గము హిందీవారి మార్గానికి విరుద్ధంగా ఉన్నదని తెలియుచున్నది.

ఈ విషయమై తెలుగువారు హిందీవారి మార్గమునుగాక మరాఠీ వారి మార్గము నాదరించిరని పరిశీలనము వలన తెలియును. శుక, పిక అనే పదాలకు సమూహార్థంలో ఆదివృద్ధి సహిత రూపాలైన శౌక, పైక అనే వాటిని తెలుగువారు ప్రయోగించిరి, ఐదంయుగీన> ఇదంయుగ అనేది మూలం. ఈ రూపాన్ని కూడ తెలుగు కావ్య భాషలో కవులాదరించియుండుట గమనింపదగును.

వంగభాషలోగల సాన్నిపాతిక (జ్వర) అనే ప్రయోగంలో గల సన్నిపాత అనేది ఆదివృద్ధి వలననే ఆద్యక్షర దీర్ఘతను పొందగలిగిన దని గ్రహింపదగును— విమాతృ+ఏయ అని యుండగా వైమాత్రేయ (భయా) అని కావటంగూడ ఆదివృద్ధి వచ్చినందుననే. వైమాత్రేయ అనే పదబంధంలో పూర్వోత్తరావయవాలు సంస్కృతమే అయినప్పటికీ ఈ పదబంధఘటన సంస్కృతంలో లేదనిపిస్తుంది. ఇదికేవలం బెంగాలీవారి సంస్కృత ప్రయోగముగా గుర్తింపదగియున్నది.

సంస్కృతంలో ఆదివృద్ధివచ్చినరూపాలకు ఏవిధమైన భంగాన్నీ గలిగించక పోవటం కన్నడ కవి పండితుల దృష్టి. ఏలయనగా నట్టి రూపాల యథేచ్ఛగా కన్నడ కవులందు సందర్భానుసారంగా వచ్చియున్నాయి. అంతేగాక, దుష్యంత + ఇ < అని ఉండగా ఆదివృద్ధి వచ్చినందుననే 'దౌష్యంతిభారత' అనే రూపం కన్నడ కావ్య భాషలో ప్రయుక్తమైయుండుటను గుర్తించాలి. భవలాలాటి విలోచనాగ్ని' అనే ప్రయోగంలో 'లలాట' అనేది 'ఇ' ప్రత్యయం పరం కాగా 'లలాటి' గా మారినది. ఇక్కడ గూఢ పదాలలో గల

అకారమునకు దీర్ఘమాదేశమగుట గమనింపదగును. కావున 'లాలాటి' మైనది. ఇదియు కర్ణాట భాషలో కవి ప్రయుక్తము.

అవ్యయాలు :-

లింగవచన విభక్తి విరహితాలు అవ్యయాలు. ఇందులో కొన్ని లాక్షణికములు. వ్యాకరణ లక్షణానుసారముగ ఏర్పడినవి. కొన్ని ప్రతిపదోక్తములు. వ్యాకరణము వీని నిష్పత్తిలో వివరణముల నీయదు. అందును అవ్యయములందు మరల ద్వైవిధ్యము గలదు. విభక్తి ప్రతిరూపకావ్యయములు కొన్ని. తక్కినవి తదన్యములు. కథమ్ – ద్వితీయైక వచనమును. విహాయ-చతుర్థీ ఏకవచనమును విహస్య – షష్ఠీ ఏకవచనమును పోలి ఉన్నవేగాని అవి వాస్తముగ అవ్యయాలు.

సామాన్యావ్యయాలు వినా, యత్ర, ఏకత్ర మొదలగునవేగాక ఏకత్రిత మొదలైన సంశ్లిష్టావ్యయాలు గూడ హిందీలో ప్రయుక్తాలై ఉండటం గమనించాలి. అవ్యయాలపైన గూడ చేరే ప్రత్యయం 'ఇత' అయిఉండటం మరోవిశేషం. ఇది 'ఇతచ్' అనిన్నీ ''తదస్య సంజాతమితి తారకాదిభ్య ఇతచ్'' (5-2-36) అనే సూత్ర ప్రతిపాది తమైనదనిన్నీ మనం గుర్తించగలం. అవ్యయాలపైన గూడ చేరే ప్రత్యేక లక్షణంగల 'ఇతచ్' తక్కిన తద్ధిత ప్రత్యయాలకన్న వేరై నదిగా గుర్తింపదగును. సంఖ్యావాచకాలపై 'ధా' అనేది చేరినందున ఏర్పడే ఏకధా, నవధా, శతధా మొదలగు అవ్యయాలుగ మారటం గలదు. ఇట్టి వాటిని హిందీలో యథేచ్ఛగ ప్రయోగించారు

నేతి (న + ఇతి) అనే ద్వ్యవ్యయ ఘటితం తెలుగులో పెక్కు సార్లు ప్రయుక్తం, వినా, వృధా, తధా మొదలగు అవ్యయాల ప్రయో గం తెలుగులో గలదు. అన్యథా అనేదాని నుఙ్యంతం బగు నగు ధాతువయిన కా (గా) అనేది (B. V. క్రియా, 115) ఉన్నది. ఈ కా(గా) క్రియావిశేషణాలపైన చేరుతుందని వ్యాకరణం అన్యథా అనే ఈ సంస్కృతావ్యయాన్ని తెలుగు క్రియావిశేషణంగా గుర్తింప

బడి యుండును. అందువల్లనే దీనిపైన కా(గా) అనేది చేరిందని తలంపనగును. లెస్స, న్యాయ్యము మొదలైనవి తెలుగులో క్రియా విశేషణములు. (Adverbs) కాబట్టి వీటిపై కా(గా) చేరింది. వీనితో తుల్యమైన లక్షణ లక్షితము సంస్కృత భాషకు చెందిన 'అన్యథా' అనేది. కాబట్టి ఈ పదంపై 'గా' అనేది చేరినందున ఏర్పడే 'అన్యథాగా' అనే పదప్రయోగం గావించిన ఆంధ్రకవులు తిరుపతి వేంకట కవులు. ఈ ప్రయోగము ఆ జంట కవులు రచించిన 'సుశీల' అనే కావ్యంలో 5వ అశ్వాసంలోని 12వ పద్యంలో ప్రయుక్తం.

వంగభాషలో కింతు, ఏవం, అథవా, వినా(వాక్యవ్యమే) యథా మొదలైన అవ్యయాలు ప్రయుక్తాలు. వీటిలో కింతు అధికంగా ప్రయుక్తమై ఉంది, ఉందులో రెండవయవాలున్నాయి. అందులో మొదటిది 'కిమ్' అనేది 'ఇ' సుబంతం. 'కిమ్' శబ్దం నపుంసక లింగంలో ప్రథమ ద్వితీయైక వచనాంతరూపం. ఇంతేగాక అసంఖ్యాకంగా అవ్యయీభావ సమాసాలు వంగభాషలో ప్రయుక్తాలైనాయి.

మరాఠీలో అథవా, ఏకత్ర, ఏకత్రిత, తథాపి, సర్వత్ర, కింవా, యథాతథ్య (యథా - తథా), ఏకదా మొదలైన అవ్యయాలను మరాఠీ కవులు యధా సమయంలో ప్రయోగించి తమ అభిప్రాయ ప్రకటన కుపయోగించుకున్నారు. ఏకత్ర మొదలైన వాటిపై 'ఇత' అనే ప్రత్యయం చేరగా ఏర్పడే ఏకత్రిత మొదలగునవి గూడ మరాఠీలో చోటు చేసుకోవటమే గాక, యథాతథా అనే జంటకు భావార్థంలో 'య' అనే తద్ధిత ప్రత్యయాన్ని చేర్చి 'తథా' లోని తుది స్వరమైన 'ఆ' అనేదానికి లోపాన్ని వివక్షించి 'యాథాతథ్య' అనేసమస్తరూపం గూడ మరాఠీ భాషలో చోటుచేసుకుంది. యథాశక్తి, ప్రతిదినం మొదలైన అవ్యయీభావ సమాసాలు తమతమ సహజరూపాన్ని కోల్పోయి యథాశక్తీ, ప్రతిదినీవృద్ధిలాచ అనే విధంగా రూపాంతరతను పొంది మరాఠీ భాషలో ప్రయుక్తమై ఉండటం గమనింపదగిన అంశం. వృద్ధిలాచ్ అనే సమస్తపదంతో 'ప్రతిదినమ్' అవ్యయీభావ సమాసం కలియటమేగాక అవ్యయీభావ సమాసాంతంలో 'ఈ' అనే సంస్కృత

భాషకు సంబంధించిన పదాంశంచేరి ఉండటం గుర్తింపదగిన అంశం

కన్నడంలో సంస్కృతావ్యయాలను వ్యస్తంగా వాడినట్లు చెప్ప ననువుపడే ఉదాహరణాలీ పరిశీలనలో గనరాలేదు. ఈ నా పరిశీలన పరిమితం. కన్నడ భాషలో పంపవిరచిత భారతగ్రంథం వరకే పరిమితం. అనంతరకాలంలో ఈ రూపాలు ఆ భాషలో చేరి వుంటా యనుకోవచ్చు.

'వినా' అనేది సంస్కృతంలో ఒకఅవ్యయం. దీన్ని ప్రయో గిస్తే దీనితో అర్థంవిషయంలో సంబంధంగలపదం ద్వితీయావిభక్తిలో ఉండాలి. లేకుంటే తృతీయ అదీగాకుంటే పంచమీ విభక్తి ఉండాలి.[1] ఈ అవ్యయంతో పాటు ఈ విశేష కారకాన్ని ఆధునిక భాషలు కొన్ని పాటించాయి. అంటే సంస్కృతంలో ఉండే విశేషకారకాన్ని వీరు పాటించారని తలంచాలి. ఈ విషయంలో మొదట గుర్తింపదగిన వారు తెలుగు కవులు. తెలుగులో ఆధునిక కవియైన విశ్వనాథ సత్యనారాయణ తన రామాయణ కల్పవృక్షంలో ఈ అవ్యయాన్ని ప్రయోగించారు. ఇంతకు మునుపీ అవ్యయం తెలుగులో కావ్యభాషలో గాని, పండితుల వ్యవహారంలో గాని లేదనిపిస్తుంది. ఈ అవ్యయం తో పాటుదీనికి సంస్కృత వాక్యనిర్మాణంలోగల ప్రత్యేకతను గూడ తెలుగులో వీరు ప్రవేశింపజేశారు.[2]

నిన్నువినాఘటిల్లునె
రాము వినా

---

1. పృథగ్వినానానాభిస్తృతీయాన్యతరస్యామ్ 2-3-32.
2. విశ్వనాథవారికంటే ముందే త్యాగరాజు తన కీర్తనల్లో మొత్తం 20 చోట్ల 'వినా' శబ్దాన్ని ప్రయోగించారు. ఉదాహరణకు— 'నిను వినా రఘువర' అని, 'వినాయకుని వలెను బ్రోవలే నిను వినా వేల్పులెవరమ్మా'' అని, 'త్వాం వినానాన్యత్ర జానే రామ, త్వాం వినా కోగతి రానకీ జానే'' ఇత్యాది ప్రయోగాలు.

అనే ఈ రెండు ప్రయోగాల్లో ద్వితీయా విభక్తి ఏకవచన ప్రత్యయం ప్రయోగింపబడినది.

'నీ చేత వినా గరికపోచైన గదలదు' అనే ఈ ప్రయోగంలో తృతీయా విభక్తి గలదు. అంతేగాని, పంచమీవిభక్తిని ఆ సదర్భంలో తెలుగువారాదరించి యుండలేదు. వినాదేవదత్తాత్, వినారామాత్ మొదలగునవి ఉదాహరణములు.

హిందీ కవుల్లో ప్రసిద్ధిగాంచిన మైథిలీ శరణ్ గుప్త వంటి మహాకవులు తమ హిందూజయభారత్ మొదలగు గ్రంథాల్లో ఈ 'వినా' అవ్యయాన్ని ప్రయోగించారేగాని ఈ యవ్యయానికి సంస్కృతంలో గల విశేషకారకాలని వాడియుండలేదు. మైథిలీ శరణ్ గుప్తగారు 'వినావిలంబ్' యిత్యాదిగ ఈ యవ్యయాన్నివాడరు. 'విలంబ్' అనేదానికి ద్వితీయా లేదా తృతీయా లేదా పంచమీ విభక్తి సంస్కృత నియమాన్ననుసరించి రావలసియుండగా హిందీవారా నియమాన్ని పాటించి యుండలేదనిపిస్తుంది. 'వినా ఏక్ భీ గోలీ' అనే ప్రయోగం హిందీలోకి అనువదించబడిన War and Peace అనే నవలలోనిది. ఇక్కడ గూడ సంస్కృత వ్యాకరణ ప్రతిపాదిత నియమం వరగణితంగాలేదు. హిందీ దినపత్రికయైన 'దైనిక్ భారత్' లో వినా గురు కృపానే అనే ప్రయోగంగలదు. ఇక్కడ గురు కృపానే తృతీయావిభక్త్యంతము. దీని వల్లనేటి హిందీ దినపత్రికల వారు ఈ యవ్యంతోపాటు దీనికి గల వైశిష్ట్యమును గుర్తించారని తలంపనగును. తెలుగులో గూడ అధునిక కాలంలో వచ్చినకవులే ఈ కారక విశేషాన్ని సంస్కృత నిధేయంగా గ్రహించారు. కాని అంతకు ముందు దీని ప్రయోగం తెలుగులో (వినా) లేదు. హిందీలో ఉన్నది గాని సంస్కృత వాక్యనిర్మాణ వైచిత్రి యిందు ప్రవేశించి యుండలేదు.

వంగభాషలో 'వినా' అనే అవ్యయాన్ని ప్రయోగించారు. కాని సంస్కృత వాక్య నిర్మాణ వైశిష్ట్యాన్ని వీరు స్వీకరించియుండ లేదు. వినా వాక్యమయే అనేది వంగభాషలో లభించే ఉదాహరణం

'వినాకరణ్' అనేది మరాఠీభాషలో గల ఉదాహరణం. ఇందులో సంస్కృత కారకవిశేషం పరిగణితం కాలేదు.

కన్నడంలో ఈ అవ్యయానికి ప్రయోగం గనరాలేదు. ఈ అవ్యయాన్ని సంస్కృత కారక విశేషంతోపాటు గ్రహించిన ప్రత్యేకత తెలుగువారికి దక్కింది హిందీలో నేటి దినపత్రికల్లో ఈయంశాని గుర్తించి ప్రమోగిస్తున్నందున ఆధునికకాలంలో సంస్కృత విధేయత పెరిగి పోతున్నదని సుదృఢంగా చెప్పవచ్చును. తెలుగులో గూడ నిన్న మొన్నటి కవి ఈ యవ్యయాన్ని ప్రయోగించటమే గాక దీనికి వాక్య నిర్మాణదశలో గల ప్రత్యేకతను గూడ అనుసరించటం గుర్తించాలి. దీనివల్ల ఏనాడో నన్నయాదుల కాలంలోనేగాక నేడును దేశభాషలుగా ప్రసిద్ధిగాంచిన భారతీయభాషలు సంస్కృతం నుండి పదాలనేగాక వాక్య నిర్మాణంలోగల ప్రత్యేక లక్షణాలను గూడ స్వీకరిస్తున్నారని నిరూపింపవచ్చును.

తరతమ ప్రత్యయాంతాలు :

ఈ ప్రత్యయాంతాలు నేటికిని అంగ్లంలో తమ తమ నియమితార్థాల్లో ప్రయుక్తాలవుతున్నవి సంస్కృతంలో ఈ ప్రత్యయాంతాలు తమకు విహితమైన యర్థాన్ని బాణాదుల కాలానికి పోయినట్లు ప్రయోగాలవల్ల తెలుస్తుంది. చెవికింపుగ ఉండేరీతిని భాషను దిద్దటంలో తరతమాంతాలను బాణాదికవులు వాడుకున్నట్లు, అల్పతర ప్రవిచారః (నాట్యశాస్త్రమ్ 7-18) దహ్యే ఖల్వహ మధిక తరమనేన (హర్ష చరిత్ర పుట-158) మొదలైన ప్రయోగాల్లో తరప్రత్యయాంతాలు స్వార్థంలోగాక సామాన్యార్థంలో ప్రయుక్తాలయినాయి. రెండు వస్తువుల్లో ఏది ప్రశంసార్హమనే ప్రశ్న కలిగినప్పుడు దానికి పరిహార్యంగా సమాధానం దొరికితే తద్వాచకానికి 'తరు' చేరాలి. అలా కాకుండ 'తర' అని ప్రయోగించటం ఇక్కడ ఉన్నది. ఇది సామాన్యార్థకం :

నేదిష్ఠ సవివి (హర్షచరిత్ర పుట-156) అనే సందర్భంలో తమ ప్రత్యయాంతంగా గుర్తింపదగిన 'నేదిష్ఠ' అనేది సర్వోత్కృష్టమనే అర్థంలోనే వాడాలి. దగ్గరలో ఉన్నవి, రెండుకన్న ఎక్కువసంఖ్యలో ఉన్నవాని ప్రసంగం ఉంటే వాని కన్నింటిలో దగ్గరితనంలో ప్రథమ గణ్యం విషయంలో దీన్ని ప్రయోగించాలి. కాని అలాకాకుండ మిక్కిలి దగ్గర లేదా దగ్గర అనే అర్థంలో దీన్ని ప్రయోగించటం దీనికున్న ప్రత్యేకార్థానికి భంగకరమయినదని గుర్తించాలి.

"భార్యా శ్రేష్ఠతమస్సఖా" అనే రూపం పురాణకాలంలోనే సంస్కృతంలో ప్రసిద్ధం. ఇందులో 'శ్రేష్ఠ' అనేది 'తర' ప్రత్యయాంతతుల్యం. మరల దీనిపై 'తమ' చేరటం పునరుక్తి. సంస్కృతంలో ప్రచురమైన తర, తమ ప్రత్యయాలకేగాక ఇష్ఠనీయ సున్నంతాలకు ప్రకర్ష లేదా ఆధిక్యాన్ని తెలియజేయుటకు వాడుతున్నారని గ్రహింపగలం.

సంస్కృతంలో గల ఈ విధానాన్నే తెలుగు వారాదరించారని పరిశీలన వలన తెలుస్తుంది.

క్రియాపదాలకు ద్విరుక్తి తెలుగులో గలదు. పదపద, చెప్పు చెప్పు మొదలైనచోట్ల ద్విరుక్తిని తొలగించి క్రియావిశేషణాన్ని వాడటం తెలుగులో గలదు. త్వరగాపద, త్వరగాచెప్పు అని పై ప్రయోగాలను మార్చవచ్చు. అలాగే చండచండం, తీవ్రతీవ్రం మొదలైన వాటిల్లో ప్రథమావయవానికి 'అతి', రెండోదానికి 'తర' మార్చి మార్చి వాడవచ్చు. ఒకేసారి పూర్వాపరావయవాలకీ యాదేశ ద్వయం కుదరదు. అతి చండం, లేదా చండతరం అలాగే అతితీవ్ర లేదా తీవ్రతరం అవుతుందేగాని అతి తరగాదని గ్రహించాలి. హిందీ మొదలగు ఆధునిక భారతీయభాషల్లో తరతమ ప్రత్యయాంతాలను వాడినట్లు దాహరణములున్నాయి. కాని యీసందర్భాల్లోఅతిశయార్థంలో గాక ధృంశార్థంలో వాడారని మనం గుర్తించగలం. అతిశయార్థం అంటే "అయమేషా మతిశయేనాఢ్యః' (అఢ్యతమః) ఇత్యాద్యర్థాల్లో గాదు

| ప్రియతమ | పుణ్యతమ |
|---|---|
| గురుతమ | విషమతమ |

మొదలుగా 'తమ' ప్రత్యయాంతాలు హిందీకవి ప్రయుక్తాలయినట్లు పరిశీలన వల్ల తెలుస్తుంది. ' ప్రియతమ 'కు, మారుగా ''ప్రేష్ఠ ' అనిన్నీ, రూపాలున్నాయి. కాని హిందీవారు 'తమ'కు, బదులుగా 'ఇష్ఠ'ను ఆదేశం వచ్చినపుడు ప్రియ > ప్ర అని అయినందున ఏర్పడే రూపాలను వాడియుండలేదు. ఈ విధమైన రచన సరళము, సుబోధము గాదనీ సంస్కృత భూయిష్ఠమయినందున క్లిష్టంగా ఉంటుందని వీరూహించి ఉంటారని తలంపవచ్చును.

కాని, ఇష్ఠన్నంతమైన 'శ్రేష్ఠ అనే 'తమ' ప్రత్యయాంతం 'దైనిక్ భారత్ అనే హిందీ దినపత్రికలో ప్రచురితమై ఉండటం గమనించదగును. ఇది కేవలం 'శ్రేష్ఠ' అని మాత్రం కాకుండ మరల దీనిపై 'తమ' అనేది చేరి 'శ్రేష్ఠతమ' అనేది ప్రయుక్తమై ఉంది. ఈ పదబంధం వాల్మీకి తన రామాయణంలో ప్రయోగించియున్నాడు. దాన్నే వీరు ప్రయోగించారో లేక స్వతః కల్పించి ప్రయోగించారో చెప్పలేం. వ్యవహారంలో ఉన్న భాషకు ప్రబల నిదర్శనంగా ఉండే భాషను పత్రికలవారు ప్రయోగిస్తారనేది వాస్తవము, మరి 'శ్రేష్ఠతమ' హిందీ దినపత్రికలో గలదు గాన, 'తర, తమ' ప్రత్యయాంతాల వాడుక సామాన్యులకందుబాటులో ఉండే హిందీలో గలదని తలంచటం సమంజసం.

వంగభాషలో క్షుద్రతమ, తుచ్ఛతమ, అధమతమ, క్షీణతమ మొదలగు తమ ప్రత్యయాంతాల ప్రయోగం గలదు. క్షీణ, క్షీణతర క్షీణతమ అనే రీతిని సామాన్య తరతమ ప్రత్యయాంతాలను ఒకే సందర్భంలో ప్రయోగించుట వంగభాషలో విశ్వకవి రచనలో కనబడుతుంది. ద్విగుణతర, అధికతర, ఉజ్జ్వలతర, స్ఫుటతర అనేది ఆదియందకారంతో 'అస్ఫుటతర' అని ప్రయుక్తంగావటమే గాక, 'గురు' అనే దానికి 'తర' ప్రత్యయార్థంలో 'గరీయస్' అనేరూపం సిద్ధించుచుండగా దాన్ని విస్మరించి 'గురుతర' అనే ప్రయోగాన్ని

వంగభాషలో విశ్వకవి పఖుపర్యాయములు ప్రయోగించియుండుట గుర్తింపదగినయంశం. సామాన్య రూపాలనేగాని గరియస్, గరిష్ఠ మొదలగు విశేషరూప ప్రయోగంలో వంగభాషీయులకు శ్రద్ధలేదని తెలియనగును.

మరాఠీవారు 'అంతర' అనేదానిపై 'తర' ప్రత్యయాన్ని చేర్చి 'అంతరతర' అనిన్నీ, 'తమ 'ను చేర్చి 'అంతరతమ' అనిన్నీ ప్రయోగించారు. అంతేగాక, వీరు 'శ్రేష్ఠ' అనేదానికి వ్యతిరేకంగా 'కనిష్ఠ' అనే దాన్ని వాడియున్నారు. 'కనిష్ఠయువ' అనేది వయో వాచకజన్యం. దానికి వయోవాచకమైన 'వృద్ధ' అనే దానికి 'తమ ప్రత్యయాంతమైన 'జ్యేష్ఠ' అనేదాన్ని ప్రయోగించటం న్యాయం. అయినా వీరు 'శ్రేష్ఠ'ను వాడారు. 'శ్వాశ్వ అనేది' శ్రేష్ఠకు మూల రూపంశ్వాశ్వ, యువ అర్థం విషయంలో సామ్యంగానీ, వైరూప్యం గానీ లేదని పరిశీలన వలన తెలుస్తుంది.

'తమ' ప్రత్యయాంతాలపై వివిధ పదాంశాలను ప్రయోగించి వాడటం వంగభాషలో గలదు. ' శ్రేష్ఠత్వ ' అనేటప్పుడు ' త్వ ' చేరినది. శ్రేష్ఠతమ రచనా అనేటప్పుడు 'తమ' ప్రత్యయాంతమైన 'శ్రేష్ఠ' అనేదానిపై మరల 'తమ' చేరి యుండటం గుర్తింపదగిన యంశం. శ్రేష్ఠకవీ, కనిష్ఠకవీ మొదలయిన రీతిని ఈ విశేషణములు మీది నామములతో సమన్వయించుచు ప్రయుక్తములై యుండుట గమనింపదగిన యంశము.

కన్నడమునందీ క్రింది తరతమాంతములు గలవు, కన్నడంలో తమ ప్రత్యయాంతాలు ప్రయుక్తాలయి యున్నాయో లేదో చెప్పలేం. ప్రస్తుత పరిశీలనలో 'తమ' ప్రత్యయాంతాలు దొరకలేదు. చారుతర, భయంకరతర, తరళతర, ప్రవరతర, అనితర తర ప్రత్యయాంతాలు విరళ విరళంగా దొరికాయి. ఇవన్నీ తరళ తరళ లేదా అతితరళ అనే వానికి పర్యాయాలేగాని, 'తర' ప్రత్యయాంతాల నిజస్వరూపాన్ని నిరూపించే ప్రయోగాలు గావు.

ఇతచ్ ప్రత్యయాంతాలు :

తదస్య సంజాత మితి తారకాదిభ్య ఇతచ్ (5-2-36) సంజాతార్థంలో ఈ ప్రత్యయం వస్తుంది. సంజాతం అంటే కలిగిన అని మనం గ్రహింపవచ్చు. పుట్టిన, జనించిన అనికూడ చెప్పవచ్చు 'తత్' అనేది ప్రథమాంతానికీ, 'అస్య' అనేది షష్ఠ్యంతానికీగుర్తులు. నిర్దిష్టము అంటే జనించేది, ప్రథమాంతం గావటమే గాక జనించేది. ఆజన్మకాధారమైనది షష్ఠీ విభక్త్యంతంలో నిగూఢంగా దాగి ఉండి తగిన సమయంలో వెలుగులోకి వస్తుంది. పైగా ఈ తద్ధితాంతమైన వృత్తి అన్యపద ప్రాధాన్యం గలిగివుంటుంది(Exocentic Construction తారకితం — నభః, తారకలు గలిగినది = ఆకాశము ప్రథమాంతంలో ప్రత్యయం చేరుతుంది. షష్ఠ్యంతం వృత్తిలో గనరాదు. సంజాత తమ మూలం షష్ఠ్యంత నిష్ఠం. మరియు పరినిష్ఠిత రూపం బహువ్రీహిగా అన్యపద ప్రధానమయినందున గుర్తింపదగును కాషాయం కషాయేణ రక్తమ్ (4-2-1) మస్త్రః (వస్త్రైః పరివృతః), దాశరథిః (దశరథస్య అపత్యం) మొదలగు తద్ధితాంతాలన్నీ Exocentric type of Construction అవుతాయి. మొదటి రెండింట ప్రత్యయం చేరింది తృతీయాంతం మూడోదాన్లో షష్ఠ్యంతంగా ఉన్నాయి. ప్రథమాంతాలుగా లేవు. నిర్దిష్టనామాలకు కషాయ, వస్త్ర మొదలైన ఈ ప్రత్యయం చేరటం గలదు. ఇతచ్ ప్రత్యయం ప్రథమాంతాలు షష్ఠ్యంతాలకు (తారకాదు లాకాశాదులకు) చేరుతాయని సర్వనామాల సాయంతో చెప్పుకోవలసిన అవసరం గలిగిందేగాని వాస్తవనామాల కింద ప్రయోగంలేదు. ఇందులో నామద్వయం ఉన్నాయి. (నక్షత్రాదులు, ఆకాశాదులకు) పైన ఒకే ఒకనామం గలదు. రెండు నామాలకు సంబంధించిన ప్రత్యయ విధానం తద్ధిత ప్రత్యయాల్లో లేవన్నా సరిపోతుంది. అంటే అలాంటివానికి గల ప్రాచుర్యమతి విరళం. కాశికలో ఈ ప్రత్యయం చేరే ప్రాతిపదికల సంఖ్యకు భట్టోజీలో ఈ ప్రత్యయం చేరే సంఖ్యకూ సంబంధంలేనే లేదు. వీని సంఖ్య కారకంలో 27మాత్రమే. భట్టోజీకాలానికి ఇవి 88అయినవి ఈ రెండు వ్యాకర్తల పరిగణిత రూపాయలలో ఇంతటి సంఖ్యాభేదం

మరియే యితర పదాల విషయంలోను లేదంటే అతిశయోక్తిగాదు. కాశికాకారుడు పేర్కొన్న తంద్ర, పుష్ప అనే రెండు గాక తక్కిన 27–2=25 భట్టోజీలో గూడ ఉన్నాయి. ఈ 25 గాక భట్టోజీ 88–25=63 పదాలకు అంతంలో ఈ ప్రత్యయాలు చేరటాన్ని అంగీకరించాడు.

ఈ 'ఇత' అనే ప్రత్యయం నామ్మూలకంతంలో చేరటమే గాక ఏకత్ర మొదలగు అవ్యయాలకు అంతంలోగూడ చేరుతున్నందున ఏకత్రిత మొదలైన రూపాలు నిష్పన్నాలయినాయి.

మర్మర, చక్ర. శోణ, అపమాన, ఆధార మొదలగు పదాలపై ఈ ప్రత్యయం చేరటం సంస్కృత వ్యాకరణ సమ్మతంగాదు. అంటే పై పదాలు తారకాదిగణంలో చేరలేదు. ఈ గణం ఆకృతిగణం. అందువల్ల సందర్భానుసారంగా సంస్కృతకవి పండితులు తమ రచనల్లో ఈ ప్రత్యయాంతాలను విశేషించి ప్రయోగిస్తే వాటిని రూపసాదృశ్యం వల్ల ఈ గణంలో మనం జమ చేయటానికి వ్యాకర్త అనుమతినిచ్చి యున్నాడు. అయితే సంస్కృతేతర భాషల్లో గూడ ఈ సంప్రదాయం నిలిచి ఉండటం గమనించాలి. ఈ విధంగా స్వతంత్రించి చేసిన ప్రయోగాలు తెలుగులో రెండు వందలకుపైగా ఉన్నాయని ( తెలుగుకవుల సంస్కృత ప్రయోగాలు, పుటలు 137–145) పరిశీలనవల్ల తెలుస్తుంది. ఇంతేగాక ఏకత్ర అనే అవ్యయంపైన ఈ ప్రత్యయం చేరినందున ఏర్పడే ఏకత్రిత అనే ప్రయోగం హిందీలోగలదు.

ఇక్కడ మరోవిషయం గుర్తించాలి. సంస్కృత ధాతువులకు 'క్త' అనే ప్రత్యయం చేరినపుడు ఆ 'క్త'లో శేషించేభాగం 'త' అనేదానికి ఇకారం చేరినందున భవిత (భూ + ఇ + త), భూషిత భూషిత (భూష్+ఇ+త) మొదలైనవి ఏర్పడుతాయి. వీటిల్లోగూడ 'ఇత' అనే ప్రత్యయమే ఉంది. అయితే ఈ 'ఇత' అనేది పై తద్ధిత ప్రత్యయం కన్న వేరైనదిగా గుర్తించాలి.

పాణిని రచిత వ్యాకరణం ప్రతిపాదించిన గుచ్ఛ, జడ, కలుష మొదలగు పదాలపై 'ఇత' అనే ప్రత్యయం చేరినందున ఏర్పడే గుచ్ఛిత, జడిత, కలుషిత మొదలైన రూపాలు వంగభాషలో ప్రయుక్తంగావటం గమనింపదగును. హిందీభాషలో వలెనే వంగభాషలో గూడ సంస్కృతవ్యాకరణ ప్రతిపాదిత ఆకృతిగణాన్ని గుర్తించినందున ఈ ప్రయోగాలను విశ్వకవి ప్రయోగించి యుండునని తలంపనగును.

మరాఠీలో తారకాదిగణంలో పరిగణితాలుకానట్టి పదాలనేకం'ఇత' అనే ప్రత్యయాంతాలుగా ప్రయుక్తాలై యున్నట్లు ఈ క్రింది వివరాలు తెలియజేస్తాయి. ఇందిచ్చే ఉదాహరణాలు ఒక పర్యాయంగాక ఎన్నో పర్యాయాలు ప్రయుక్తాలై యున్నాయి.

| | |
|---|---|
| మర్యాదిత | ప్రవాహిత |
| భాషాంతరిత | స్థానాంతరిత |
| అంకూరిత | ఆధారిత |
| వికసిత | వివాహిత |
| సీమిత | రూపాంతరిత |
| అనువాదిత | అనూదిత |

మొదలైనవేగాక ఏక, త్రిక అనే రూపం గూడ ఇందు గలదు. ఇందులో ఏకత్ర అనేది అవ్యయం. దీనిపై 'ఇత' అనే ప్రత్యయం చేరటం గుర్తింపదగినయంశం. స్థానాంతర అనేది అవ్యయీభావ సమాసం దీనిపై 'ఇత' అనే ప్రత్యయం చేరి 'స్థానాంతరిత' అనే రూపం నిష్పన్నంగావటం గుర్తింపదగిన యంశం.

కన్నడంలో తారకాదిగణంలో గతార్థంగాని ఈ క్రింది ప్రయోగాలు 'ఇతచ్' ప్రత్యయాంతాలుగా ఉండటం గమనించదగును.

| | |
|---|---|
| ధవళిత | హేషిత |
| క్వణిత | ముఖరిత |
| చటులిత | ఘటాఘటిత |
| బధిరిత | అధరిత |

| | |
|---|---|
| తాటిత | పరికలిత |
| దంతురిత | ఖర్విత |
| కాతరిత | మేచకిత |
| లాంఛిత | |

అనే ఇతచ్ ప్రత్యయాంతాలు కన్నడ కవి ప్రయోగరూఢాలై ఉన్నాయి. ఆర్యభాషలందేగాక కన్నడాంధ్రాది ద్రావిడ భాషలందు గూడ ఈ ప్రత్యయం సజీవమై నూతనపదబంధ నిష్పాదకతాశక్తి గలిగి యుండటం పరిగణనీయం.

ఆర్య. అనార్య (ద్రావిడ) భేదాలను విస్మరించి సంస్కృత ప్రత్యయాలను తమ తమ రచనల్లో ప్రయోగించటమే గాక నూతన పదబంధాలను నిర్మించటంలో ఈ ఇరువర్గాలకు చెందిన భాషా భాషీయులు సిద్ధహస్తులని సంస్కృతం ఈ విధంగా నేటి దేశీయ భాషల్లో ప్రయోగరూఢి గాంచి వున్నందున అది సజీవభాషయేగాని మృతభాషగాదని గుర్తింపదగును.

విశేష తద్ధితాంతాలు :

హిందీ :- లాక్ష్మణ్య, అబల్య అనే తద్ధితాంతాలు హిందీకవి మైథిలీశరణ్ గుప్త ప్రయోగాలు గమనింపదగినవి. వ్యక్తివాచకాలపై సంబంధార్థంలో 'య' అనే ప్రత్యయం చేరటం విశేషం. ఒక సందర్భంలో ఆదివృద్ధి కూడ వచ్చినది. మరోసందర్భంలో ఆదివృద్ధికి అభావం గలదు. సఖ్యుర్యః (5-1-126) ప్రతిపాదించిన 'య' అనే ప్రత్యయం చేరినందున 'అబల్య' అనే రూపం వచ్చియుండును. ఈ ప్రత్యయం భావార్థంలోను కర్మార్థంలోను వస్తూ ఉండటం గమనింప దగును. ఈ ప్రత్యయం చేరగా ఆదివృద్ధి గూడ వచ్చినందున నిష్పన్నమైన రూపం 'లాక్ష్మణ్య' అనేది.

త్రైయంబక. (త్రియంబక), యౌధిష్ఠిర (యుధిష్ఠిర) మొద లైనపదాలపై నుండి తద్ధిత ప్రత్యయాలు ఏర్పడటం గలదు. కాని

అవి అకారమాత్రాలు. 'య' అనేది వ్యక్తివాచకంపై చేరటం ఇక్కడి విశేషం.

స్త్రీభ్యోఢక్ (4 1-120) అనేసూత్రం చేత **విమాతృ** అనే స్త్రీలింగ ప్రాతిపదికపై 'ఢక్' **అనే** ప్రత్యయం విహితమైనందున కిత్వం వల్ల ఆదివృద్ధి వచ్చి 'ఢ' **కు** 'ఏయ' ఆదేశమయినందున 'వైమాత్రేయ' అనే రూపం సిద్ధిస్తుంది. దీన్ని హిందీకవి మైథిలీ శరణ్ గుప్త ప్రయోగించియుండటం గమనింపదగును. 'మాతృ' సహజంగా స్త్రీలింగమయినా దీనిపై 'ఢక్' ప్రత్యయాన్ని చేర్చి ప్రయోగించటం సంస్కృతంలో ప్రాచుర్యాన్నిగాంచినట్లు లేదు.

వంగభాషలో రవీంద్రుడు 'వైమాత్ర' అనే ప్రయోగాన్ని గావించియున్నాడు. ఇది 'భాయీ' అనే నామానికి **విశేషణంగా** (వైమాత్రభాయీ) ప్రయుక్తంగావటం గమనింపదగినయంశం 'విమాతృ' **అనేదానికి** సంబంధార్థంలో శైషికాల్లో చేరిన శేషే (4-2-92) **అనే** సూత్రంచే 'అణ్' అనే ప్రత్యయం చేరినందున **ఆదివృద్ధి** వస్తుంది. అనంతరం ప్రత్యయ సంబంధి అకారం పరంగా ఉన్నందున ప్రాతిపదిక అంతంలోగల 'ఋ' కారానికి యణాదేశసంధి **వల్ల** 'ర్' కారం ఆదేశమయినందున 'వైమాత్ర' అనే రూపం ఏర్పడినది వంగభాషలో విశ్వకవి మొదలగువారు సంస్కృతపదాలను ప్రత్యయాలను వాని నిష్పత్తిలోగలిగే సుబంతరూపాలను వ్యాకరణ సంప్రదాయానికి విధేయంగా పరిగణించి ప్రయోగించినారని గమనింపదగును.

మరాఠీభాషలో ఈ క్రింద గుర్తింపదగిన విశేషరూపాలున్నాయి 'త్యక్' అనే ప్రత్యయం దక్షిణ, పశ్చాత్, పురస్ అనేవానిపై చేరుతుందని, దక్షిణాపశ్చాత్పురసః త్యక్ (4-2 98) అనే సూత్రం చేత 'త్యక్' అనే ప్రత్యయం విహితం ఈప్రత్యయం 'ఇ' కారేత్సంజ్ఞక **మ**యినందున ఆదివృద్ధివస్తుంది. కాబట్టి దక్షిణ + త్య < దాక్షిణాత్య, పశ్చాత్ + త్య < పాశ్చాత్య ఇత్యాది రూపాలు ఏర్పడుతాయి. ఉచ్చారణ వశాననో, లేఖనసౌకర్యంకోసమే పశ్చాత్ + త్య అని యుండగా

ఒక తకారంలోపించి పాశ్చాత్య అని ఏక తకారయుక్త రూపం ప్రయుక్త మవుతుంది. దీని నాధారంగా చేసుకొని మహారాష్ట్రులు తమ మాతృభాషలో దిగ్వాచకాలయిన పశ్చిమ, పూర్వ మొదలయినవానికి 'త్యక్' అనే ప్రత్యయాన్ని జతచేయటంగలదు. దీనివల్ల ఆదివృద్ధి వస్తుంది గాబట్టి పాశ్చిమాత్య, పౌర్వాత్య ఇత్యాదిగరూపాలు ఏర్పడి నాయి. వీటిని ఈ భాషలో మిక్కిలి ప్రచురంగా ప్రయోగించారు. త్యక్ పరంకాగా పశ్చిమ, పూర్వ, దక్షిణ యిత్యాదుల్లో తుదిస్వరానికి దీర్ఘం ఆదేశంగావటం గమనింపదగిన యంశం.

సంస్కృతంలో 'దరిద్ర' అనేది దారిద్ర్య మనుభవిస్తున్న వ్యక్తివాచకము. 'దరిద్రాన్ భరకౌంతేయ' ఇది కేవలము దారిద్ర్య మనే భావార్థవాచకమని తలచినందుననో ఎందువల్లనో మరాఠీవారు దీనిపై 'ఈ' అనేదాన్ని చేర్చి 'దరిద్రీ' అని ప్రయోగించటంగలదు. ఈ 'ఈ' అనేది గుణ మొదలగు వాటిపై వ్యక్తివాచికతలై చేరే 'ఇన్' అంతాలకు ప్రథమైక వచనరూపంలో ఏర్పడే 'గుణీ' ఇత్యాదులందలి తుది ఈకారము (గుణీ=గుణ+ఈ)దీని ప్రయోగం వినా ఇది పరినిష్ఠితార్థాన్నీయగలదు. 'దరిద్రీ' అనే దానిలోగల దరిద్ర+ఈ అనే అవయవాలు రెండూ సంస్కృతమే అయినా ఈ సందర్భంలో వీటి కలయిక సంస్కృతభాషకు విధేయమైన పద్ధతిగాదు ఇది మరాఠీవారి సంస్కృతముగా గుర్తింపదగును. 'అత్యంత' అనే దానిపై 'ఠక్' అనే ప్రత్యయం చేరినందున ఏర్పడే 'ఆత్యంతిక' అనేదిమరాఠీవారు విశేషముగ గల్పించిన ప్రయోగమేగాని సంస్కృత భాష కనుగుణమైన రూపముగా దీన్ని మనం గుర్తింపవీలుకాదు.

'విమనస్' అనేదానికి 'య' అనేప్రత్యయం చేరినందున 'వైమనస్యా' అనిగావచ్చును. గాని ఇలాంటి తద్ధిత ప్రత్యయం గలదా ఆనేవిషయంలో మనం ఇదమిత్థముగ చెప్పలేం. అర్థాద్యత్ (4-3-4) యత్ అనే ప్రత్యయాన్ని అర్థం శబ్దానికి విధించింది. మూలరూపంలో వృద్ధిని గలిగించే శక్తి దీనికిలేదు. 'యక్' అనే పత్యయం విమనస్ అనేదానికి చేరినందున వైమనస్య అనిఅవుతుంది

'మను' అనేదాని నుంచి 'మానవ' అనేనామం సంస్కృతంలో ఏర్పడు తుంది. దీనిపై ఠ అనే ప్రత్యయాన్ని విధించి ఈ ఠకారానికి 'ఇక' అనే ఆదేశము ఆదివృద్ధి రాగా ఏర్పడే మను+ఇక (పూర్వ పదాంతంలో ఉకారానికి ఓకారం గుణంవల్ల, ఓకారానికి అవాదేశం అయవాదేశసంధి వల్ల) అనేవి గలిసి మానవికఅని ఏర్పడే ప్రయోగం సంస్కృత విధి కనుగుణమే అయినా సంస్కృతభాషలో గనరాని రూపము. దీన్ని గూడ మరాఠీవారి ప్రయోగ విశేషం (సంస్కృత)గా గుర్తించాలి.

'ఘన పథమం' అనేది కన్నడంలోగల విశేష సంస్కృత ప్రయోగం. గగనమార్గ అని దీనికర్థం పథిన్ అనే దానికి ద్వితీయా విభక్తి ఏకవచనరూపం 'పంథానమ్' అనేది. పథః పన్థచ (4.3.29) అనేసూత్రం పథిన్ అనే ప్రాతిపదికకు తద్ధిత ప్రత్యయమైన 'క' పరంగా ఉంటే 'పన్థ' అనే ఆదేశాన్ని విధించినందున 'పంథకః' అనే రూపం ఏర్పడుతుంది. ఈ ప్రయోగం వల్లనో మరి యేలనో పథ అనేరూపం ఏర్పడి దీనిపై అమ్+అమ్, సంస్కృత+కన్నడ ప్రత్యయాలు చేరినందున ఘనపథమం అని ఏర్పడి ఉంటుందని గ్రహింపదగును.

'చతురంగ'కు ఆదివృద్ధి గావించి కన్నడకవులు ప్రయోగించిన 'చాతురంగ' అనేది విశేష సంస్కృత ప్రయోగము. దీనికి విధంగా వృద్ధి గల్పించి ప్రయోగించటం సంస్కృతంలో లేదనిపించును.

సురాపగాత్మజ, సురాపగానందన, ఇంద్రానోకిహ మొదలైన సంస్కృత సమాసాలు కన్నడ కవిప్రయుక్తాలు. ఈ విధంగా సమాసాలల్లో (సంస్కృత) పదవినిమయం గావించి ప్రయోగించటం తెలుగులో విస్తారంగా (తెలుగుకవుల సంస్కృత ప్రయోగాలు, పుటలు 71-90) గలదు. హరిచిత్తుడు (విష్ణుచిత్తుడు) లులాయదానవ (మహిషాసుర) మొదలగునవి ఉదాహరణాలు.

హిందీ, మరాఠీ మొదలైన ఆర్యభాష లందును సమాసము లందలి పదవినిమయము గలదని తెలియును.

This type of investigation shall lead to Universal linguistics, related to the languages of modern India.

# PART - III

# సంస్కృత భాషాధ్యయనము

'ఉపనయనం' అంటే గురువుదగ్గర పంపుట (ఉప=సమీపము నకు, నయనము = పంపించుట) అని అందలి పదాలకు గల అర్థం దీన్నే ఒడుగులేక వడుగు అంటాము. గురువుదగ్గర అధ్యయనం గావించేవాడు 'వటువు' అని పిలువబడుతాడు, సంస్కృతంలో దీనికి పదమూడు. పందొమ్మిది సంవత్సరాల (Teenage) బాలకుడు అని అర్థం. అవయస్సు గలవానికి సంధ్యావందన విధానాన్ని నేర్పుతారు. త్రిసంధ్యల్లో వందనం చేసేవానికే వేదాల నధ్యయనం చేసేయోగ్యత ఉంటుంది. వారికి సంస్కృతంలో పరిచయం లేకున్నా వైదిక సంస్కృతాన్ని విని కంఠస్థంచేస్తారు. స్వరయుక్తంగా వేదాన్ని పలక గలిగి ఉండటాన్ని వారు గురుముఖతః పొందుతారు. గురువు వేదాన్ని ఆలాపనచేస్తుండగా దాన్ని విని యథాతథంగా వటువులు తమ తమ ముఖావయవాలతో ఉచ్చరిస్తారు. వేదాలు కంఠస్థం అయిన తరువాతనే వీరు సంస్కృతభాషను. ముఖ్యంగా కావ్య (లౌకిక) భాషను నేర్చుకుని, అనంతరకాలంలో వైదిక భాషకు కావ్యభాషతో గల తారతమ్యాలను గ్రహిస్తారని తెలుస్తుంది. ఈ విధంగా కావ్యభాషను గ్రహించాక చతుర్దశ విద్యలను అధ్యయనం చేయటం గలదు. ఈ యంశాన్ని కౌత్సునికథలో (రఘువంశమ్–5వసర్గ) కాళిదాసు వివరించాడు.

అనాటివారు నిత్య విద్యార్థులుగ ఉండేవారు. ఏ ప్రాంతంలో నైనా వినూత్న గ్రంథరచన జరిగితే దాన్ని తెలుసుకోవాలని వారికి కుతూహలం అధికంగా ఉండేది. కుతూహలమే కాదు అలావారు క్రొత్త క్రొత్త గ్రంథాలను పఠనంచేయని యెడల తమకు రాజాదరణ లోపించే ప్రమాదం ఉంది. రాజాస్థానంలో ఏపండితుడైనాతానున్న రాజుదగ్గరకు వచ్చే పండితులతో అవసరమైతే వాదించి అతడిని ఓడించి తన ఘనతను నిలుపుకోగల దక్షత గలిగి ఉండాలి. అలా గాక ఏపండితుడైన ఆస్థానవిద్వాంసుని ఓడించినయెడల విద్వాంసుడు తన పదవిని తనను జయించిన విద్వాంసున కొనగవలసియుండెడిది. గౌడ డిండిమభట్టు శ్రీనాథుల వృత్తాంతమీ యంశమునకు నిదర్శనము

తెలుగునేలపై పసి బాలబాలికలకు అక్షరాభ్యాసం సువర్ణమయ పాత్రములో పోసిన తండులముల పై జరుగుచుండెడిది. వారు శివ [illegible] గములతో 'ఓమ్ నమః శివాయ'
[illegible] ృతభాషయనే విషయం నేటి
తెలిసియే యుండునని మన
[illegible] ్ని గుర్తించనివారు దీన్ని
[illegible] ః శివాయ' అని కొందగు.
'శివాయ' అనేదానికి తర్వాత
[illegible] కొందరు, 'నమః' అనే
[illegible] దరు నేడు అక్షరాభ్యాసం

సంస్కృత వ్యాకరణము :-

భాషలో వాక్యాలుంటాయి. వాక్యనిర్మాణాన్ని గూర్చిన వివ రాలను చెప్పేది వ్యాకరణమే. పాణిని వ్యాకరణంలో విభక్త్యర్థ ప్రకరణమనేది ఏయే విభక్త్యంతాలకు ఏయే యర్థాలున్నాయో (కర్తృ కరణమో స్తృతీయా) చెప్పటమేగాక ఏయేయర్థాన్ని చెప్పటానికి ఏవిభక్తి ప్రత్యయాన్ని వాడాలో, (దూరాంతికార్థైష్షష్ఠ్య తరస్యామ్) అని దగ్గర దూరం అనే అర్థాలను షష్ఠీ విభక్త్యంతం తెలుపుతుందనే

అంశం గూడ విభక్త్యర్థ ప్రకరణంలోచెబుతారు. దీనికి తుల్యమైన ప్రకరణం తెలుగులోగలబాలవ్యాకరణాదుల్లోగల కారకప్రకరణమనేది.

వ్యాకరణమనే పదానికి ప్రాచీనపండితులు వివక్షించిన అర్థంలో విభక్త్యంతాలకుగల అర్థం విషయంగానీ వాక్యనిర్మాణ విషయంగానీ ప్రసంగితంకాలేదు. శబ్దములను ప్రకృతి ప్రత్యయ విభాగాత్మకంగా వివరించటం వ్యాకరణానికిగల ప్రధానధ్యేయం.

'వ్యాక్రియంతే వివిచ్యప్రదర్శ్యంతేశబ్దాః అనేన ఇతి వ్యాకరణమ్ అని వ్యాకరణమనే సమస్తపదానికి వారు నియమించినట్టి వివరణాత్మక వృత్తి లేదా విగ్రహం. సుప్తింగంతాలను గూర్చిన వివరణమేగాక కృత్తద్ధితాంతాలల్లోగల ప్రకృతి ప్రత్యయాల వివరణను గూడ వీరు వివక్షించారు సమాసాలకుగల వృత్తి వాటిని పద ప్రాధాన్యం దృష్ట్యా వివరించటం వీరి వ్యాకరణంలోగలదు. ఏకశేషవృత్తినీ, సనాద్యంతధాతు రూప వృత్తినీ వీరు వివరించారు.

అవ్యయాలలో లాక్షణికావ్యయాలను వీరు విసరించారు. కర్తుమ్ అనేది లక్షణాసిద్ధమైన అవ్యయం. ఇందులో 'కృ' అనేది ధాతువు తుమ్ అనేది ప్రత్యయం. దీన్ని తుమున్ అని పేర్కొంటారు. 'కృ' లో ఋ ➢ అర్‌గా మారటానికి వ్యాకరణాత్మక వివరణం వీరి రచనల్లో ఉంటుంది. అలాంటి వివరణతో నిమిత్తంలేని అవ్యయాలు కిథమ్, విహాస్య, విహాయ మొదలైనవి. ఇది క్రమంగా ద్వితీయాషష్ఠీ చతుర్థ్యంతాలను పోలిఉన్నాయి ఇలాంటివాటిని విభక్తి ప్రతిరూపకావ్యయాలని పేర్కొన్నారు. వినాక్వచిత్, కశ్చిత్ మొదలైనవి ప్రతిపదోక్తావ్యయాలు. వీనిలో కర్తుమ్ మొదలగు వాని విషయంలో విభాగం సాధ్యంకాదు.

సుప్తింగంతములే పదములుగా ఈవ్యాకరణంలో పరిగణించారు. పదములు గాని వానికి వాక్యంలో ప్రయోగయోగ్యత లేదు. కాబట్టి అవ్యయాలకు (ప్రతిపదోక్త, లాక్షణిక, విభక్తి ప్రతిరూపక) అన్నింటికి అంతంలో ప్రత్యయాదులను చేర్చి వాటిని లోపింపజేయటం సంస్కృతవ్యాకరణంలో గలదు.

పాణినీయం :

సంస్కృత వ్యాకరణంలో ముఖ్యంగా పాణిని రచించిన 'అష్టాధ్యాయి' అనే వ్యాకరణాన్ని ప్రకరణాలుగా విభజించి ఉదాహరణాలతో సమన్వయించి వార్తికాలతో వివరించిన ఘనత కాశికావృత్తికి దక్కినది. ఈ వృత్తిలో పాణినీయంలోగల సూత్రక్రమం పాటించారు. పాణిని సూత్రక్రమాన్ని పాటించక ప్రక్రియ ప్రాతిపదికగా సూత్రాలను అమర్చి వివరణాత్మక వృత్తిని వ్రాసి ఉదాహరణాల్లో సమన్వయించి వార్తికాలను తదర్థాలను సోదాహరణంగా నిరూపించడం భట్టోజీ కావించాడు. దీనికి వైయాకరణసిద్ధాంతకౌముదియని పేరు. ఇందులో పదమూడు ప్రకరణాలున్నాయి. (అనుబంధంగాక) వాని క్రమం ఈ విధంగా ఉంది.

1) సంజ్ఞాప్రకరణం
2) పరిభాషాప్రకరణం
3) సంధి ప్రకరణం

ఇందులో అచ్, హల్, విసర్గ, స్వాది అని నాల్గు విభాగాలున్నాయి. అచ్సంధికి అంతంలో ప్రకృతిభావం అనే ప్రకరణం ఉంది. స్వర సంధి ప్రవర్తించని సందర్భాలకు ఉదాహరణాత్మకమైన వివరణం యిందులో గలదు.

4) శబ్దాధికారం :— దీనికీ పేరు పాణినిగాని, భట్టోజీగాని పెట్టినట్లు తెలియరాదు. ఇందులో అజంత పుం స్త్రీ నపుంసకలింగ శబ్దరూప నిష్పత్తి గలదు. తరువాత హలంత పుం స్త్రీ నపుంసకలింగ శబ్దరూప నిష్పత్తి గలదు.

5) స్త్రీ ప్రత్యయ ప్రకరణం
6) విభక్త్యర్థ ప్రకరణం
7) సమాస ప్రకరణం

సామాన్య విశేష సమాసాల విభజన, విశేషసమాసాల్లో అవ్యయీభావ తత్పురుషాది నాల్గు విభాగాలు. అలుక్సమాసము, సమసాశ్రయ

విధులు ఇందులో ఉన్నవి. తత్పురుష ప్రకరణాంతంలో సమాసాంత ప్రత్యయాదులను గూర్చిన వివరణగలదు.

8) తద్ధిత ప్రకరణం :— ఇందులో అపత్యార్థక రక్తార్థ, అధ్యేత్రర్థ, చాతురర్థ, శైషిక, వికారార్థ, ఠక్/ఛ/యత్/అధికారాలు అర్హీయాలు - అధ్యేత్రాద్యర్థకాలు - భావకర్మార్థాలు - పాంచమకాలు- మత్వర్థీయాలు - విభక్తి సంజ్ఞకాలు - స్వార్థకాలు - ద్విరుక్తప్రక్రియ ఉన్నాయి.

9) తిఙంత ప్రకరణం :— దశగణి-సన్నంత-యఙ్లుగంత-నామధాతు-కండ్వాది-ఆత్మనేపద - పరస్మైపద - భావకర్మ-కర్మకర్తృ-లకారార్థ ప్రక్రియలున్నాయి.

10) కృదంత ప్రకరణం :— కృత్యప్రక్రియ-పూర్వకృదంత-ఉణాది (చతుష్పాది)-ఉత్తరకృదంత

11) వైదిక ప్రక్రియ :—

12) స్వరప్రక్రియ — సాధారణ-ధాతు - ఫిట్ సూత్రాలు (చతుష్పాది) ప్రాతిపదిక స్వరప్రక్రియా - ప్రత్యయ స్వరప్రక్రియా— సమాస స్వరప్రక్రియా – తిఙంత స్వరప్రక్రియా.

13) లింగాను శాసనం :—

అనుబంధం :— శిక్ష-పాణినీయ సూత్రాలు (అధ్యాయ పాద సూత్రక్రమంలో) గణపాఠము - ధాతుపాఠము - సూత్రసూచీ (అకారాదిక్రమంలో) ధాతుసూచీ (అకారాదిక్రమంలో)ఇన్ని వివరాలు గలది వైయాకరణ సిద్ధాంతకౌముది అనే భట్టోజీ నిర్మిత వ్యాకరణం.

సూత్రాలు, వృత్తి, ఉదాహరణాలు, వార్తికాలతో కూడిన ఈ వ్యాకరణం అచ్చులో 484 పుటలనూ, 44 పుటల అనుబంధాన్ని గలిగి ఉంది. ఈ వ్యాకరణంపై సంస్కృతంలో వచ్చిన వ్యాఖ్యలు అసంఖ్యాకాలు. వివిధ భారతీయ భాషల్లోను, ఆంగ్లంలోను ఈ

వ్యాకరణంపై వచ్చిన వివరణాత్మకంగా వ్యాఖ్యలు నూర్లకొలది ఉంటాయి.

షడంగాలు - వ్యాకరణం :—

పాణినీయంలో ప్రతిపన్న శబ్దాల యొక్క వివరణం జరిగింది. అప్రతిపన్నాలకన్న ప్రతిపన్నాలు అంటే సాధు శబ్దాలు తక్కువ. అంతేగాక అప్రతిపన్నాలైన శబ్దాల్లో వైవిధ్యం ఎక్కువ. ప్రతిపన్న శబ్దాల్లో కాలదేశాలను బట్టి వచ్చే భేదాలు కనరావు. అప్రతిపన్నాలైన శబ్దాల్లో దేశ, గృహ, వ్యక్తి, అవస్థలననుసరించి పదాలల్లో వైవిధ్యం కానవస్తుంది. సుశబ్దాలవివరణ (ప్రకృతి ప్రత్యయాత్మకంగా) చేయటంకన్నా 'సు' లేదా ప్రతిపన్న శబ్దాలను ఉదాహరిస్తే సరిపోతుంది గదా అనేది మరోప్రశ్న ;

శబ్దసంపద అనంతమైనది. అందువల్ల సుశబ్దాలనన్నింటినీ పట్టికలుగా తయారుచేసి తక్కినవి అపశబ్దాలనటం అంత తేలికైనపనిగాదు ఈ విధమైనా ప్రయత్నాన్ని ఒకప్పుడు బృహస్పతి చేయనుద్యమించి విరమించు కున్నాడట ; వేయి సంవత్సరాలు ఇంద్రునకు సుశబ్ద ప్రవచనం (పఠనం - అధ్యయనం) చేయ ప్రయత్నించిన బృహస్పతి పదసాగరం యొక్క అంతానికి చేరుకోలేక విరమించాడు. వక్త - ఉపాధ్యాయుల్లో నాటికీ నేటికి ఘనతగాంచినవాడు బృహస్పతి. విద్యార్థి ఔన్నత్యానికి-శ్రోతలకు రాజయిన ఇంద్రుడు. ప్రవచనకాలము వేయి దివ్య ( మానవ సంవత్సరాలుగాదు ) సంవత్సరాలు. అలాంటి సందర్భంలోనే అసాధ్యమైన అంశం మనరు మానవ మాత్రులకెలా సాధ్యమవుతుంది?

శబ్దము లనంఖ్యాకము లయినందున సుశబ్దాలనైన ప్రతిపదోక్తాలుగా చేయటం ఏవిధంగా పరికించినా అసంభవం. అందువల్లనే వ్యాకరణం ఈ మార్గాన్ననుసరించింది.

సూత్రప్రాయంగా సుశబ్దాలను ప్రతిపాదించింది. ఈ విధంగానే అసంఖ్యాకంగా పదాలు నిష్పన్నాలుగావచ్చును. కథ్ + ఇ + త = కథిత

అవుతుంది. మండిత, భూషిత, వందిత, ఛవిత మొదలగునవి ఏర్పడుతాయి. గమ్ + త (ఇ ప్రసంగంలేదు). అంత్యహల్లు (ధాతువులో)లోపిస్తుంది గత అవుతుంది. అలాగే, హత, నత, యత, మత, రత మొదలయినవన్నీ ఏర్పడుతాయి. పైవర్గంలో చోరిత ఏర్పడుతుంది. కాని దీనికి భాషలో ఉపయోగం పరిమితంగా ఉంటుంది. అలాగే రెండోవర్గంలో తన్+త=తత అవుతుంది గాని దీనికి ప్రయోగాలులేవు. చోరిత, తత మొదలైన వ్యవహారదూరాలైన ప్రయోగాల కనుమతినిచ్చే వ్యాకరణం పర్జన్యతుల్యత (పర్జన్యవల్లక్షణ ప్రవృత్తిః)ను చెప్పుకున్నారు. వరదలతో బాధపడేదేశంలో వర్షం నిరుపయోగం. అలాగే ఉపయోగం, ప్రయోగం లేని చోరిత, తత మొదలగునవి. వానిని నిష్పన్నం చేయటం వ్యర్థం అనీ, అది వ్యాకరణంలో పరిహార్యమనీ వ్యాకర్తలు. అంటే సుశబ్దనిష్పత్తిలో వ్యవహార ప్రసిద్ధిని వ్యాకరణం లక్ష్యీకరించారని తలంచాలి.

ప్రపంచంలో మానవుడు తన భావాలను అక్షరరూపంలో తరువాతి తరాలవారి కందింపజేయ నుద్దేశించిన ప్రయత్నాలలో ప్రథమ గణ్యములు వేదాలు. 'విద్' అనే ధాతువు ఒకటే అయినా వివిధార్థాలను గలిగి ఉండటాన్ని మనం ఇంతకుమునుపు చెప్పుకున్నాం. వేదానికీ యర్థవిశేషాలన్నీ సంక్రమిస్తాయని గ్రహించాలి.

కాలక్రమంగా భాషలో మార్పురావటం సహజం. ప్రజల వ్యవహారంలో ఉన్నభాషలో మార్పువేగం అధికం. గ్రంథరూపంలో ఉన్నభాషలో మార్పువచ్చే అవకాశం తక్కువ. ఆ గ్రంథాన్నుచ్చరించేవారు తమకాలంనాటి పదాలను మూలభాషలో వాడుక చేయటం సహజం. ఆ గ్రంథాలను లిఖించేప్రయత్నం జరిగితే అపుడు ఆ పదాలను మూలభాషలో ప్రయోగించి భాషాస్వరూపానికి మార్పుకలుగజేస్తారు. ఇలాంటి భయంవల్లనే వేదాలకు లిఖితరూపం లేకుండా మన ప్రాచీనులు వాటిని వాగ్రూపంలోనే ఉంచారు. ఆనాటికి లిపి ఉన్నా లేఖన సాధనాలందుబాటులో ఉన్నా లేఖకులు తమ కాలంనాటి ఉచ్చారణకు విధేయంగా వేదభాషను మార్చేప్రమాదాన్ని ఊహించి

దాన్ని నిరోధింప వేదాలను విని నేర్చుకోవలసిన వాటిగానే ఉంచారు. వేదాల యొక్క స్వరూపాన్ని కాలానుగుణంగా మారకుండ ఉంచటానికే వీరు షడంగాలనువాడారు. అయంగాల్లో ప్రధానమైనది వ్యాకరణం. కాబట్టి ఇది ప్రథమగణ్యం. శిక్ష అనే అంగం వైదికపదాల స్వరాన్ని గూర్చి నిర్ణయించేది. ఈ అంగంపదాలకు గల స్వరాన్ని మార్పులేకుండ కాపాడిందని గ్రహించాలి. వేదాలకు ముఖం వ్యాకరణం. ముఖం అంటే నోరు అంటే వాచకయంత్రం ముఖం. వ్యాకరణవిధేయంగా వైదికపదాలను పలికించే విషయంలో వ్యాకరణం తోడ్పడుతుంది. ఈ విషయాన్నే పతంజలి తన మహాభాష్యంలో

> షట్సుచాంగేషు వ్యాకరణం ప్రధానం
> పదపదార్థజ్ఞానస్య తదాయత్తత్వాత్

—మహాభాష్యమ్ పుట-7

వ్యాకరణం వేదరక్ష చేస్తుందనే అంశంలో పతంజలి ప్రశ్న పూర్వకంగా సమాధానాన్ని వివరించి సిద్ధాంతీకరించటం గమనింపదగిన యంశం.

'నను నియతాను పూర్వికస్య. శిష్యాచార్య పరంపరయా ధార్యమాణ శరీరస్య వేదస్య కా నామ రక్షా వ్యాకరణేన?' పూర్వపూర్వ విధానానికి ఒదిగి శైష్యోపాధ్యాయిక నాశ్రయించిన శరీరముగల వేదాలకు వ్యాకరణం ఏమి రక్షణ గల్పిస్తుందనేది ప్రశ్న! ఈ ప్రశ్న వైదికభాష వ్యవహారదూరమైన లౌకికభాష వ్యవహారంలో రూఢిగాంచిన సమయంలో గలిగినది. లౌకికభాష కావ్యభాషకు అభిన్నం. వైదిక భాషలోగల పదాల్లో గుర్తింపదగిన మార్పులు లౌకికభాషనువాడే వారి దృష్టికి గోచరిస్తాయి. లౌకికమును ప్రమాణంగా విశ్వసించి నందున అ దృష్టితో వైదికభాషను దిద్దే ప్రయత్నించేయగలరు. వైదికప్రయోగం శిష్టోధార్యమనే పరిజ్ఞానం లేని వైయాకరణులు (ప్రయోగ శరణాః వైయాకరణాః) ప్రామాదికాలుగా తలంచి మార్పు చేయ పూనుకోవచ్చు. వైదికభాష లౌకికభాషకు భిన్నంగా

ఉంటుందనేయంశాన్ని గుర్తించినందున వైయాకరణుడట్టి పూర్వ్వ చేయక ప్రాచీనరూపాన్ని మూలవిధేయంగా రక్షించి వైదికభాష యొక్క నిజస్వరూపాన్ని నిలుపుతాడు. కాబట్టి ప్రాచీనభాషా లక్ష ణాలను రక్షింప నుపకరించేవాడు వ్యాకర్త. ఇది వేదపరిరక్షణలో వ్యాకరణశాస్త్రం నిర్వహించేపాత్ర.

మరియు వ్యాకరణశాస్త్రం చాలగొప్పది. ఈ శాస్త్రమును మననధ్యానాదులవల్ల ఉపాసింపవలసిన అవసరం ఎంతైనా ఉంది. విద్యల కన్నింటికి వెలుగునిచ్చే శక్తి ఈ వ్యాకరణశాస్త్రానికిగలదు. పద తదర్థ ప్రతిపాదకమైన ఈ వ్యాకరణం మానవవిజ్ఞానానికి తొలి మెట్టు. అందుకే ''ప్రథమే విద్వాంసో వైయాకరణాః, వ్యాకరణ మూలత్వాత్ సర్వవిద్యానామ్'' అనే సూక్తి ప్రసిద్ధిగాంచినది. మోక్ష మును పొందగోరిన వారికినిజముగ ఫలప్రదమగు మార్గము వ్యాకరణ పరిజ్ఞానమే (ఇయంసా మోక్షమాణానామ జిహ్మారాజపద్ధతిః) అనుటయే గాక వ్యాకరణ పరిజ్ఞానమనే సంస్కారంచే పవిత్రమైన ముఖముగల మానవులే వేషాంతరంచేత ఈ భూమండలంలో పరిభ్రమించే దేవతలు గా గుర్తింపదగియున్నారు.

## సాధ్వసాధు శబ్దాలు :

సాధ్వసాధువులని శబ్దాలల్లో రెండు వర్గాలను గుర్తించారు. సాధువుగానివి అసాధుశబ్దాలని చెప్పటం సులభం. కాని, ఏవి సాధువులనే విషయాన్ని నిరూపించటం సులువుగాదు. ప్రాచీన శబ్దాలు అంటే ఈనాడుభాషలో చేరినవిగాక అనూచానంగా అనాదిగా (అనిదం ప్రథమాః) వాడుకలో ఉన్నవి సాధుశబ్దాలని పతంజలి నిర్ణయం. అయితే ఈనిర్ణయం అస్తవ్యస్తంగానూ అసమగ్రంగానూ ఉన్నదని పతంజలి గుర్తించకపోలేదు. 'గో' అనేది సాధుశబ్దం. తత్పర్యాయపదంగావాడే 'గవి' అనేది అసాధుశబ్దం అనివ్యాకర్తల నిర్ణయం. అయితేలోకంలో గో. గవి అనే రెండు శబ్దాలూ వ్యవ హృతాలపుతూనే ఉన్నాయి. భాషనువాడే వారి దృష్టిలో సాధ్వసాధు

భేదాలకు తావులేదు. ఈ రెండు పదాలను వ్యవహర్త తనఅభిప్రాయ ప్రకటనకు అవసరమైనపుడు వాడుతూనే ఉన్నాడు. మరి 'గవి' ని అసాధువనటం ఎలా? అనే ప్రశ్నకు పతంజలి ఈ క్రిందివిధంగా సమాధానం చెప్పాడు. 'గో' మొదలయినవి ప్రాచీనాలు. వీనిని ఏనాటినుంచి వ్యవహరిస్తున్నారో చెప్పలేం. ఆ కారణంచే అవి సాధుశబ్దాలనీ వాని నుచ్చరింప బాలురు, వృద్ధులు అంగవైకల్యం ముఖయంత్రంలో లోపంగలవారు, బలహీనులు, భయకంపితులు మొదలైనవారు 'గో' మొదలైనవిప్రాత శబ్దాలయినందున సాధు శబ్దాలుగా పరిగణితాలైన వాటిని పలుకుటలో పైకారణాలవల్ల మరో విధంగా పలుకబడుతాయి. అశక్తి, ప్రమాద, అలసతవల్ల వచ్చే దోషాలు పదాలకన్యథాత్వాన్ని గల్గిస్తాయని అవే అపశబ్దాలని వ్యాకరణం చెబుతుంది. ఇవి పదునాల్గు విధాలని కొందరు (ధ్మాత, ఏణీకృత, అంబూకృత, అర్ధక, గ్రస్త, నిరస్త, ప్రగీత, ఉపగీత, క్ష్విణ్ణ, రోమశ, అవలంబిత, నిర్హత, సందష్ట, వికీర్ణ) అశక్తి ప్రమాదకృతాలైన ఈ దోషాలకు అంతులేదని మరికొందరు తలంచారు. ఈ అపశబ్దం వినబడినపుడు శ్రోతకు సుశబ్దం స్ఫురణకు వస్తుంది. అలారావటంవల్ల ఆ అపశబ్దం ( సుశబ్ద స్ఫోరకమై ) అర్థవంతమవుతుంది, ఎపుడైనా సుశబ్దం శ్రోతస్ఫురణకురాకుంటే అప్పుడది అర్థవంతంగాదు. 'గవి' అనేదాన్ని విన్నశ్రోతకు 'గో' శబ్దం జ్ఞప్తికివస్తుంది. అందువల్ల 'గవి' అంటే 'సాస్నాలాంగూల కకుదఖుర విషాణములు గల చతుష్పాదమైన జంతువుయొక్క మూర్తి స్ఫురణకు వస్తుందని పతంజలినిర్ణయము (స్మారయంతశ్చతేసాధూనర్థధీహేతవ స్మృతాః)

ఏవి సాధు శబ్దములనే విషయంలో పాణిని ఎలానిర్ణయం చేయ గలిగాడు? అని మరోప్రశ్నను పతంజలి వేసుకొంటాడు. తనకు మునుపున్న ఆపిశలి అనేవ్యాకరణకర్త ఏపదాలను సాధువులుగా గుర్తించాడో వాటినే సాధువులని పాణినిపరిగ్రహించాడనేది సమాధానం కాని ఇదికూడ పూర్వపక్షమేగాని సిద్ధాంతంగాదు. తనకు మునుపున్న వ్యాకరణకర్త గుర్తింపుగాంచిన పదాలను ఆపిశలి గ్రహించాడనేది

మరో పూర్వపక్షం. ప్రాచీనత సాధుత్వానికి ఎలా మూలమైందనటంలో పూర్వపూర్వవ్యాకర్తలను మూలంగా గ్రహించటం నిర్హేతుక మయినందున ఈమార్గం అంధపరంపరా న్యాయంగా ఉందని పతంజలి గుర్తించాడు. ఈఅంధపారంపరిక కాంతిమంతము, నిర్దుష్టముఅయిన ప్రమాణముకాజాలదు. ఇందులోగల దోషపరిహారణకు పతంజలి ఒకమార్గాన్ని సూచించాడు. పాణిని, ఆపిశలి అంతకు మునుపున్న వ్యాకరణకర్తలు అందరూ తమ తమకాలంలో 'గవి' మొదలగు అపశబ్దాలకు సుదూరంగా 'గో' మొదలైన సాధుశబ్దాలుండటాన్ని గుర్తించారు. అంతేగాక. ఇరువదియొక్క విభాగాలుగల ఋగ్వేదమూ, నూరుశాఖలుగల యజుర్వేదమూ, వేయివిభాగాలుగల సామవేదమూ, తొమ్మిది అధ్యాయాలుగల అధర్వవేదమూ, వేదాంగములారూ, న్యాయమీమాంసాశాస్త్రాలూ, పదునెనిమిది పురాణాలూ, స్మృతులూ, అసంఖ్యాకంగా పరిఢవిల్లిన ఉపపురాణాలూ, ఉపస్మృతులూ రామాయణ మహాభారతాది ఇతిహాసాలూ, ధనుర్వేద, ఆయుర్వేదాలూ సంగీత అర్థశాస్త్రాలూ, దృశ్యశ్రవ్యకావ్యాలూ మొదలగునవి - ఇంతటి పరిధిగల వాఙ్మయంలో సాధుశబ్దాలు ప్రయుక్తాలై కనబడుతున్నాయి, ఇందలి పదాలను బట్టి అనిదం ప్రధానమై మేలయిన శబ్దాలను నిర్ణయం చేయగలం అని పతంజలి తలంపు. ఈవిధంగా అనిదం ప్రథమతనే సాధుత్వానికి హేతువుగా పతంజలి సిద్ధాంతీకరించాడు.

ప్రాతశబ్దాతే సాధువులైతే ఈనాడుభావప్రకటన కవసరమైనపుడు వక్తసృష్టించి ప్రయోగించిన శబ్దాలు పాతవిగానందున (ఇదం ప్రథమములయినందున) అసాధు శబ్దాలవుతాయా? అనే సందేహాన్ని పతంజలి లేవనెత్తి దానికీవిధంగా పరిహారాన్ని సూచించాడు. శక్తివైకల్యాది దోషాలవల్ల పదస్వరూపంలో గలిగే దోషాలకు నిలయంగానందున అధునికాలైనా ఆశబ్దాలను మనం సాధువులుగా గుర్తించాలి అని పతంజలి తీర్మానము. వ్యాకరణంయొక్క ధ్యేయం సాధుశబ్దాలను తెలియజేయటం, ఈ విధంగా సాధుశబ్దపరిజ్ఞానంవల్ల ఏమిటి పరమార్థం? అంటే మరేంలేదు, జ్ఞానమే ప్రయోజనం అంతేగాక ఎవడైతేభాషను పదస్వరూపాన్ని ( తదక్షరక్రమాన్ని స్వరాన్ని

తప్పకుండ) గ్రహించియుండునో అతడు ఋత్విక్కుతో సమాన మైనవాడు. ఆయనతాను గూర్చున్న పంక్తిలోని తక్కినవారికి పావనతను గల్పించగలడు. ఈ యర్థాన్ని క్రిందిశ్లోకం చెబుతుంది.

యశ్చవ్యాకురుతేవాచం - యశ్చమీమాంసతేఽధ్వరమ్
తావుభౌ పుణ్యకర్మాణౌ - పంక్తిపావనపావనౌ
శబ్దబ్రహ్మణి నిష్ణాతః - పరం బ్రహ్మాధిగచ్ఛతి
నిరుక్తస్యచ యో వేద - సర్వపాపైర్విముచ్యతే

సాధుశబ్దముల యొక్క ప్రకృతి ప్రత్యయవిభాగాన్ని ఎఱుంగుటయే పురుషార్థము. ఈ పరిజ్ఞానంలో సంక్షేపాత్మకమగునుపాయం వ్యాకరణమేగాని తదన్యమేదియు నీవిషయమునందు సహకరించునది లేనేలేదు. ప్రకృతి ప్రత్యయవిభాగ పరిజ్ఞానశూన్యమైనపద పరిజ్ఞానము ఎండిన కట్టెను నిప్పులేని ప్రదేశమునందుంచిన రీతిని ప్రజరిల్లనేరదు.

''ఏకశ్శబ్దః సమ్యక్ జ్ఞాతః సుష్ఠుప్రయుక్తః స్వర్గేలోకేకామదుగ్భవతి'' అంతేగాక ఎవడైతే తననాటి వ్యవహారకాలమునగల శబ్దములనే విధమగు ధ్వన్యాదులలోపంలేకుండ వ్యవహరించునో వాడు అనంతమగు జయమును పరలోకము నందుగాంచును. ధ్వని స్వరాదులకు భంగం గలిగించే ప్రయోగం తత్ప్రయోక్తకు దోషాపాదకమగుట తథ్యము.

ఇంతగా భాషలో సహజంగా వచ్చేమార్పును త్రోసిరాజనే ప్రయత్నాన్ని వీరీవిధంగా చేయటంలోగలఅంతరార్థమే మనగాఏనాడో వ్రాసిన వేదాలు కాలాంతరంలో మార్పులకులోనైన భాషను వాడేవారికి అర్థం కాకుండ పోయేప్రమాదం ఉంది. ఆ ప్రమాదాన్ని నివారింప వీరింతటి ప్రయత్నంచేశారు. ఈ ప్రయత్నమంతా మార్పును ప్రతిపాదించే ప్రవాహానికి ఎదురీదటమే అవుతుంది.

మరోమాట, వీరు గుర్తించిన సుశబ్దాలనుంచీ (అంటే 'గో' మొదలగు వాటి నుంచీ) వీరు అపశబ్దాలుగా తలంచిన గవి, గోణీ,

గోతా, గోపోతికా, గావీ మొదలయినవి ఏర్పడినాయంటారు. ఇది ఎంతవరకు సమంజసమో చెప్పటం కష్టం.

ఇంకో విషయం. శబ్దానికి అనగా అందలి ధ్వనులకుగానీ, తత్స్వరానికి భంగాన్ని గల్పించే ఉచ్చారణ ఏదైతే గలదో అదే శబ్దానృతం అంటారు. అనృతం పలుకరాదు అట్లు పలుకుట అమంగళములను గలిగించును. అమంగళముల నివారింప శబ్దానృతాదుల వారింప వలయును.

అనృతమాడనివారు అంటే శబ్దానికి అన్యధా ప్రతిపత్తి గలిగించే టట్లుండే ప్రయోగాలు లేని భాషను వాడే వాడు సజ్జనుడు. అట్టివారితోనే ప్రసంగించాలిగాని తదన్యులతో మాటాడి వారి అపశబ్దాలను వినటం అమంగళ ప్రదమౌతుందని గుర్తించాలి.

పాణిని వ్యాకరణం తరువాత సంస్కృతభాష నభ్యసించిన నేటి భారతీయభాషలవారు వారికున్న పరిచయంతో వినూత్నపదాలనే గాక అపూర్వపదబంధాలను గూడ నిర్మిస్తున్నారని నిరూపించాం.

సంస్కృతం ఆపేరుతోగాక పోయినా విభిన్న భారతీయభాషల మరుగున నిత్యనూతనంగా రూపురేఖలు దిద్దుకొంటూనే ఉంది. ఏ క్రొత్త అభిప్రాయాన్ని ప్రకటించాలన్నా సంస్కృతమే ఉపాదేయ మౌతూవుంది. ఆనాడు తెలుగులో చెలరేగిన రెండువిభిన్నదృక్పథాలకు పాత్రికేయులు సమసంఘర్షణ / నవ సంఘర్షణ సమితి అని పేర్కొనటం సంస్కృతం సజీవభాషయే అనే అంశానికి నిదర్శకం.

నేటి తెలుగులో శిష్టుల వ్యవహారంతో తెలుగు పదాలను త్రోసి రాజని సంస్కృతపదాలను ప్రయోగించటం గలదని తిండి / బువ్వ కూడు మొదలగు తెలుగుపదాల వాడుకను గ్రామప్రాంతాల్లోని నిరక్షరాస్యులకుత్రోసివేసి అక్షరాస్యులు నగరవాసులందరు సంస్కృత పదాలైన అన్నం / భోజనం ఇత్యాది పదాలను ప్రయోగించటంవల్ల సువిదిత మౌతుంది.

సంస్కృతాంధ్రముల సంబంధము :

తెలుగులో నన్నయకు మునుపు నుంచీ సంస్కృభాషాప్రాబల్యం ఉంది. ఆంధ్రదేశానికి పాలకులుగా ఉన్న శాతవాహన చక్రవర్తి అయిన హాలునికథవల్ల నాడు దేశంలో సంస్కృతాంధ్రాలు తుల్య ప్రాధాన్యాన్ని గలిగి ఉన్నాయని తెలుస్తుంది. జలక్రీడా సందర్భంలో హాలుని రాణి సంస్కృతభాషలో పలికిన (రాజన్ః మోదకైస్తాడయ) పలుకును ప్రాకృతభాషలో పాండిత్యము సంస్కృతంలో అస్తవ్యస్తము అసమగ్రము అయిన పరిచయంగల చక్రవర్తి కవగతంకాక పది మందిలో నగుబాటుపాలై తరువాత సంస్కృతభాషను అర్ధసంవత్సరంలో నేర్పగల పండితునికై ప్రయత్నములు చేయుట మొదలగు కథవల్ల మనకు సువ్యక్తమవుతుంది. ప్రాకృత భాషనాదరించిన వారు జైన బౌద్ధమతాలవారు. వారు తెలుగుదేశంలో కొంతకాలం తమ మత ప్రచారం సాగించటమేగాక తమ చిహ్నాలైన ఆరామ, స్తూపాదులను నెలకొల్పారనటం సర్వజనవిదితం. ఇదంతా తెలుగు తన రూపుదిద్దుకోటానికి మునుపు జరిగింది. అందువల్ల తెలుగునుడిలో ప్రాకృత పదజాలం స్థిరపడలేదు. అరవంలో సంస్కృతపదాలు మార్పులతోనై ప్రవేశించాయి.

| | | |
|---|---|---|
| తేజస్ | = | తేసు |
| దృఢ | = | దిడం |
| అస్త్రం | = | అత్తిరం |

ఆంధ్రం గ్రంథస్థదశకు వచ్చేనాటికి సంస్కృత భాషాప్రభావం అత్యధికమైంది. అంటే తక్కిన తమిళాది ద్రావిడభాషల కంటే ఆంధ్రం సంస్కృతవిధేయంగా రూపుదాల్చింది. మనకుండే తద్భవాలు కేవలం ప్రాకృతసమాలుగాదు. తెలుగువారు ద్రావిడీయుల ప్రభావానికిలోనై ఉచ్చారణలో కొన్ని మార్పులు గావించారు.

| | | | |
|---|---|---|---|
| | రాజన్ | — | అరసు |
| తెలుగులో— | రథము | — | అరదము |

అరదమ్ అనే ప్రాకృతంలో లేదు. అరవంలోనైనా ఈ రూపం గలదా అనే అంశంలో మనం ఏమీ చెప్పలేం.

ప్రాకృతాల ప్రభావం హిందీ, వంగ, మరాఠీ మొదలగు భాషల్లో గలదు. <బ్రహ్మర్షి బ్రహ్మరిషి మొదలగు రూపాలూ బహువచన ప్రత్యయ విరహితాలైన ద్వంద్వసమాసాలూ కహత్, టూటత్ మొదలగు శత్రంతాలు కథతి, జానతి, మొదలగు తిఙంత రూపాలూ హిందీలో ఉన్నాయి. తెలుగువారు సంస్కృత విధేయమతులు. It is Telugu which maintains original form of Sanskrit. సంస్కృతభాషనధ్యయనం గావించి అందున్న పదజాలంలో గలవైవిధ్యాన్ని గుర్తించి ఆశ్చర్య చకితులైనవారు తెలుగు కవి పండితులు. అంతటితో ఆగక విభిన్న సంస్కృత పదాలకు తుల్యార్థకాలైన పదాలను నిర్మించి తమ భాషను సుసంపన్నం చేయాలనే సత్సంకల్పం తెలుగు పండితులకు గలిగింది. ఈ యంశాన్ని అధర్వణాచార్యుడు తన వికృతివివేకంలో స్ఫుటం గావించియున్నాడు. ఈ క్రింది శ్లోకాన్ని పరిశీలించండి.

> శబ్దా మేచ సముత్పన్నా ఆద్యాయా మత్ర తేఽఖిలాః
>
> కథితా వైకృతైశ్శబ్దైర్భవంతి సదనుగ్రహాత్

మనకు నన్నయాదులు రచించిన ఆంధ్రశబ్దచింతామణి మొదలగు వ్యాకరణాలు సంస్కృత పదజాలానికితుల్యములైన తెలుగు పదనిర్మాణం కోసముద్దిష్టమైనవని తెలుస్తుంది. ఈ యంశాన్ని వివరించుటకు వ్యాకరణములందు దసంఖ్యాకములైన ఉదాహరణాలు లభిస్తాయి,

> తృవర్ణకార్ధంబునకు దెడు, యెడి వన్నియలగు
>
> (బాల. క్రియా. 44)
>
> దానికి లోపంబు బహుళంబుగానగు
>
> (బాల. క్రియా. 45)

ప్రహరించెడివాడు |
ప్రహరించెడు వాడు |
ప్రహరించువాడు | అనే ఈ మూడు 'ప్రహర్త

అనే సంస్కృత నామానికి తుల్యం అని చెబుతాడు. ఈ ప్రహర్త అనేది 'ప్రహర్తృ' అనే సంస్కృత నామానికి అత్వ ప్రవృత్తిర్బహులం ( బాల. తత్సమ. 52 ) రాగా ఏర్పడిన రూపం అంటే ప్రహర్+త్+ఋ అనే ఈ ప్రాతిపదికకు అంతంలో 'అ' ఆదేశ మయినందున ప్రహర్+త్+అ =ప్రహర్త అని అయినది. ఇక్కడ "ఋ" స్థానంలో తెలుగు భాషకు చెందిన "అ" వచ్చిందని గుర్తించాలి. అలాకాక దాన్ని సంస్కృత "అ" అనుకుంటే "ఋ" స్థానంలో వచ్చే "అ" అంత్యలో రేఫను గలిగి "అర్" గా రావలసి ఉంటుంది. (ఉరణ్ రపరః 1-1-51)

ఈ సందర్భంలో "ప్రహర్తృ" అనే దానిలో 'ప్ర' అనేది ఉపసర్గ, హృ అనేది ధాతువు. ఈధాతువుకు ణ్వుక్ తృచౌ 3-1-133 అనే సూత్రంచే తృచ్ అనే ప్రత్యయం చేరగా పూర్వమందున్న 'హృ' అనే ధాతువులోని "ఋ" అనే అచ్చునకు గుణసంధి వల్ల "అ" రాగా ఉరణ్ రపరః (1-1-51) అనే సూత్రం చేత ఆ అకారం అంతంలో "అర్" ను గలిగి ఉంటుంది కాబట్టి "ప్రహర్త" అని ఏర్పడినట్లు గ్రహించగలం.

సమాన కర్తృకయోః పూర్వకాలే 3.4-21

సమాసే అనఞ్ పూర్వేక్త్వోల్యప్ 7-1-37

(హ్రస్వస్య పితి కృతి తుక్. 6-1-71)

కృత్వా. అలంకృత్య మొదలైనవి ఉదాహరణములు.
క్త్వా మరియు ల్యప్ అనే ఈ రెండింటికి అర్థం సమానం కాని, ధాతువు ఉపసర్గాది అయితే ల్యప్ ఉపసర్గవిరహితమైతే క్త్వా వస్తాయి. ఒకే కర్త ఒకటికన్న ఎక్కువ క్రియా వ్యాపార నిర్వాహకుడైన

యెడల ముందుగా నిర్వర్తితమైన క్రియావ్యాపారానికి క్త్వా / ల్యప్ చేరుతాయి. అనంతర నిర్వర్తిత క్రియా వ్యాపారాన్ని తిజంతం పేర్కొంటుంది.

తెలుగు వ్యాకరణాలు సంస్కృతవిధేయంగా సూత్రరచన గావించారు. కాని, ఇక్కడ తప్ప తక్కిన సందర్భాల్లో ఆ విధేయత కుదిరి పోయింది. ఇక్కడ మాత్రం సమానకర్తృకత కుదరదు. తెలుగులో అందువల్ల సమాన కర్తృకం అని మూలసూత్రంలో ఉండగా దాన్ని మార్చి స్వతంత్రించి తాను 'సమానాశ్రయ' అనే పదాన్ని ప్రయోగించానని చెబుతాడు. వ్యాకరణ నిర్మాణంలో తెలుగువారి ధ్యేయం ఈ యంశం వల్ల సువ్యక్తమవుతుంది.

[ఇక్కడ అధికప్రసంగం అనుకోకుండా ఉంటే తెలుగు సంస్కృత వాక్యాలకు గల భేదాన్నీ సందర్భంలో వివరించటం తప్పు గాదని తలుస్తాను. మడియు- కొట్టు అని రెండు క్రియలున్నాయి కొట్టినవాడు (కొట్టు ధాతువుకు కర్త చైత్రుడు.) మడియు ధాతు వ్యాపార నిర్వహకుడయినందున రెండో ధాతువుకు కర్త మైత్రుడు మైత్రుడు కొట్టు ధాతువుకు మడియు ధాతువుకు ఫలాన్ననుభవించాడు. కాబట్టి ఈతడిని ధాతుద్వయాశ్రయంగా తెలుగువారు తలంచి ఈ సందర్భంలో గూడ క్త్వాకు పర్యాయమైన ఇకారాన్ని ప్రతిపాదించారు.]

పై యంశాన్ని బట్టి పరిశీలిస్తే తెలుగు భాషకు నన్నయ మొదలు చిన్నయసూరి వరకు నిర్మితాలైన వ్యాకరణ సౌధాలకు పునాదిరాళ్లేగాక పైపూతకు వాడిన రంగులతో సహా అంతా సంస్కృత విధేయమని తెలుస్తుంది.

ఆద్య ప్రకృతిః ప్రకృతిశ్చాద్యే — ఏషా తయోర్భవేద్వికృతిః" అని నన్నయ్య సంస్కృత ప్రాకృతాలకు వికారరూపమే తెలుగని నిర్ధారించినట్లు తెలుస్తుంది. నన్నయ రచనకు సువిపులమైన వ్యాఖ్యను వ్రాసిన అహోబలుడు తన వ్యాఖ్యలోగానీ నన్నయ సూత్రాల్లోగానీ

తెలుగుకు సంబంధించిన ఏ వ్యాకరణాంశమైనా అప్రసక్తముగ నిలిచి పోయిన యెడల 'అనుక్తమన్యతో గ్రాహ్యమ్' అని నుడువును. అట్టి సందర్భాల్లో నన్నయ ఆ విషయం చెప్పదలంచియుండలేదని గ్రహించాలి. అంతేగాక అట్టి సందర్భాల్లో అన్య వ్యాకరణమైన సంస్కృత వ్యాకరణానికి ఎలాటి నియమం గలదో తత్సదృశస్థితిని తెలుగులో ఊహించుకోవాలని చెప్పాడని గ్రహించాలి. ఇదంతా సంస్కృత జన్యమయిన భాషగా తెలుగు పరిగణింపదగుననే నమ్మకం గలవారు చేసిన నియమమని వేరుగా చెప్పనవసరము లేదు.

ఇంతేగాక తెలుగు భాషకు వ్యాకరణాలయిన ఆంధ్ర శబ్దచింతామణి, అధర్వకారికావాళి వీటిపై సువిపుల వ్యాఖ్యానమైన అహోబల పండితీయము సంస్కృత భాషలో విరచితాలు గాదడం గమనింపదగిన యంశం. వ్యాకరణ కర్తలగునీ మువ్వురు అచార్యులు గాను నన్నయకు ప్రథమస్థానము అహోబలునకు తృతీయ స్థానము, అథర్వణాచార్యునకు ద్వితీయస్థానము నొసంగబడియుండుట గమనింపవగును. పాణిని ప్రతిపాదిత వ్యాకరణ పరంపరలో అచార్యత్రయంగా పరిగణితులైన పాణిని, కాత్యాయన, పతంజలి అనే మహామునీపుల కోవకు చెందినవారు వై ఆంధ్ర పండితత్రయము. గాలి నరసయ్యా అనే తన పేరును సంస్కృతీకరించుకొని అహోబల పండితుడైనాడు తత్పండితీయ కర్త. ఇక, అధర్వణాచార్యుడు —

> ఆద్యా మహార్హాసామూలం – సర్వస్యేతి నిగద్యతే
>
> తదసక్తస్య కార్యస్య – వక్తాభవతి పాణినిః ॥

అని తెలుగు వ్యాకరణంతో పాణిని కవినాభావ సంబంధమును గలిగించినాడు. కేతనయు —

> "తల్లి సంస్కృతంబె
>
> యెల్ల బాసలకును దాని వలన కొంతగానబడియె"

అని తెలుగుతో సంస్కృతానికి గల సంబంధాన్ని వివరించాడు.

అంతేగాక, మన వ్యాకరణాలన్నీ సంస్కృత ప్రాకృత భాషలకు చెందిన వర్ణసమామ్నాయంతో ప్రారంభమయినాయి.

ప్రాకృతానికన్న సంస్కృత భాషా ప్రభావం తెలుగులో అధికం అందువల్ల సంస్కృత ధ్వనులన్నీ తెలుగులో చేరాయని చెప్పటమేగాక సంస్కృత సంధి సమాస, కారక కృత్తద్ధితాదులు తెలుగులో చోటుచేసుకొన్నాయి.

తెలుగు కవులందరూ సంస్కృతంలో పాండిత్యం గలవారు. వారు గ్రంథారంభంలో ముందుగ సంస్కృత కవులను ప్రశంసించారు. అనంతరం తెలుగుకవుల ప్రసంగం కొంత వచ్చింది. ప్రాకృత కవుల ప్రశంసాత్మక ప్రసంగం లేదు ప్రాకృతభాష సిరిని ప్రభావితం చేయలేదు. బ్రాహ్మణేతర మతాలు ప్రాకృతవాఙ్మయ మాలంబనం గానటమే గాక ప్రాకృతపదాలు సంస్కృతం దృష్ట్యా అపశబ్దాలుగా మహాభాష్యాదులు నిర్ధరించాయి. అందువల్ల తెలుగువారికి అపశబ్దభూయిష్ఠమైన ప్రాకృత భాషలుగానీ అందలి వాఙ్మయం గానీ ఉపాదేయం కాక పోవటమే గాక వర్జ్యములయినాయి.

నన్నయకు ముందు ఆంధ్రదేశంలో తెలుగు శాసనాలే గాక సంస్కృత శాసనాలు కూడ కొన్ని కనబడుతున్నాయి. కాని ప్రాకృత భాషాత్మకమైన శాసనం ఒక్కటి గూడ తెలుగువారు తమ దానాదికములను తెలుప వాడినట్లు గానరాదు. నన్నయకాలం నాటి నందంపూడి శాసనం సంస్కృతభాషలో ఉంది. నన్నయ ప్రాకృత పండితుడని పై శాసనం స్పష్టీకరించింది. కాని, ప్రాకృతభాషా కవుల ప్రభావం నన్నయపై ఏ విధంగానూ తెలియరాదు.

విస్మృతికోటుపెట్టిన సంస్కృతానికి లేని యతిప్రాసలు తెలుగుకున్నాయని చెప్పినా తెలుగు కావ్యాలపై ఆదరంగాని, తత్కవులపై అభిమానంగాని ఆయన కాలంనాటికి లేదని తెలుస్తుంది. 'తెలుగంచుం వెలిపెట్టరాదు' అని ఆనాటి రాజుల్లో, రసజ్ఞుల్లో, పండితుల్లో ఉందన్నమాట. అటువంటి భావాలను నివారింపజేయు నాటి ఆంధ్రకవులు

తమ రచనలను సంస్కృతవిధేయంగా తీర్చిదిద్ద ప్రయత్నించారు. తత్ఫలితంగా తెలుగులో యాదృచ్ఛికంగా గాక ప్రయత్నపూర్వకంగా సంస్కృతం ప్రవేశించిందని తలంపనగును.

నన్నయ మొదటి తెలుగుకవి. ఆయన ఆంధ్రమహాభారతాన్ని సంస్కృత శ్లోకంతో శ్రీకారంచుట్టాడు. తిక్కన నిర్వచనోత్తర రామాయణంలో మొదటిపద్యం సంస్కృతం. గ్రంథారంభంలో గాక మధ్యలో ముఖ్యంగా దండకాలను చాలమంది తెలుగు కవులు సంస్కృతంలో వ్రాశారు. శృంగారనైషధంలో సరస్వతీదండకాన్ని శ్రీనాథుడు దక్షతతో నిర్వహించాడు.

ప్రబంధే కేవలాద్యస్య – ప్రయోగస్తున దోషకృత్ అని అథర్వణాచార్యుని నిర్ణయం. ప్రౌఢమైన ప్రబంధరచనలో ఎడనెడ సంస్కృతరచన దోషంగాదని నిర్ణయం. ఇలాంటి అవకాశం ప్రాకృత భాషకు లేనేలేదు.

తెలుగు వ్యాకరణకర్తలు సూత్రరచనలో సంస్కృత వ్యాకరణాన్ని అన్నివిధాల అనుసరించటమే గాక ప్రసంగవశాత్తు వచ్చే సూత్ర వివరణలో సంస్కృత విధేయరచననాదరించారు. 'కచటతప' లు అనటానికి కగటతపాః అనిన్నీ, 'గజడదబ' అనటానికి గజడదబాః అని సంస్కృత సుబంతాలను కల్పించి ప్రయోగించారు. అందర్వాదులు, అల్యాగమ మొదలగు సందర్భాల్లో అందఱు, అలి మొదలగునవి అజాది సంస్కృతపదాలు పరంగాగా సంస్కృతసంధిని ప్రవర్తింపజేయటమే గాక తెలుగుపదాల మధ్య సంస్కృతసంధిని ప్రవర్తింపజేశారు. 'అంద్వింందు నాస్తు సప్తమీ' (ఆంధ్రశబ్దచింతామణి సంజ్ఞా –) అనే సూత్రంలో అందు+ఇందు అనేవి రెండు తెలుగు మాటలు ఇక్కడ యణాదేశసంధి ప్రవర్తించటం గమనింపదగిన యంశం. 'అంద్వింందున' అనేవానికి ప్రథమాబహువచన సంస్కృ ప్రత్యయం చేరినందున నిష్పన్నమైన రూపం 'అంద్వింందు నాస్తు సప్తమీ' అనే నన్నయ సూత్రంలో గలదు,

## విద్యార్థులు — కావలసిన సంస్కృతం

తెలుగు విద్యార్థి నేర్వవలసిన సంస్కృతం ఏది? అనేది ప్రశ్న. అయితే ఎన్నివిధాలైన సంస్కృతాలున్నాయనే యంశాన్ని వివరించవలసి ఉంటుంది. వైదిక, లౌకిక భేదాలతో సంస్కృతం ద్విధాపరిగణితమైయుండటం అందరికీ తెలిసిన విషయమే. వేద శబ్దం 'విద్' ధాతు జన్యమైనా 'విద్' అనే ధాతువు పలువిధాలైన అర్థాలను గలిగి ఉందని మనం ఇతఃపూర్వం గ్రహించాం. వేదాల్లోగల సంస్కృతం వైదిక సంస్కృతం. ఈ భాష స్వరప్రధానంగా ఉండి. లౌకిక సంస్కృతం పద స్వరూపంలో, ఉచ్చారణలో చాల మార్పులకు లోనైనది. వాల్మీకి మొదలగు మహాకవుల నుండి నేటివరకు ఈ సంస్కృతాన్నే వాడుతున్నారు. దీన్నే కావ్యభాష అని కూడ అంటారు

సంస్కృతం ఈ భారతదేశంలో జనవ్యవహారంలో ఉన్నట్లు కొందరూహిస్తారు. దీనికి ఊహ తప్ప వేరే ఆధారాలు లేనందున ఈ యంశం విశ్వసింపదగినది కాదని కొందరి మతం. వ్యవహారంలో ఉండే దీన్ని వ్యావహారికం అనవచ్చు. దీనికాధారాలు మనకీనాడు లభించవు. సంస్కృత కావ్యాల్లో సంభాషణాత్మకంగాగల సంస్కృతంనుండి ఒక రకమైన భాషను నిర్మించి దాన్నే వ్యావహారిక సంస్కృతమనటం గలదు. అందులో పాత్రలు సాంఘిక ప్రతిపత్తిని బట్టి సంస్కృతం వాడినా చాలమంది మహారాణులతో సహా (సీతాదులు) ప్రాకృతాన్నే వాడాలనే నియమం ప్రాచీనరూపకాల్లో గలదు. దీనివల్ల సంస్కృతం ఉన్నత వర్గాలవారు వాడుతునే భాషేగాని సామాన్యజన వ్యవహారభాష గాదని కొందరనటం గలదు.

నాటికీ, నేటికీ యజ్ఞాదుల్లో, వివాహాదుల్లో జరిగే క్రతువుల్లో సంస్కృతభాషనే వాడటం గలదు, అనేక కావ్యాల్లో గూడ సంస్కృతం వాడుతారు,

ఎంతటి నిష్ఠాగరిష్ఠులైనా, పండిత ప్రకాండులైనా సంస్కృతాన్ని వ్యాకరణసంప్రదాయానుగుణంగా వాడుకచేయుటం కష్టసాధ్య

మనే దీనికి ఎంతో పరిశ్రమతో బాటు నిత్యానుష్ఠానాదులవసరమని ఈ క్రింది అంశం తెలుపుతుంది. ఒక చోట యజ్ఞం జరుగుతుంది హోతలు 'ఇదమింద్రాయ నేదం మమ' ఇత్యాదిగ పఠిస్తూ అగ్నిలో ఆజ్యాది ద్రవ్యాలను వ్రేలుస్తున్నారు. "దధిన్" అనేది నకారాంత నపుంసకలింగం. పెరుగుతో హోమం చేస్తున్నాడు. అనే అంశాన్ని సంస్కృతంలో చెప్పాలి. హోత హోమం చేస్తున్నాడంటే 'జుహోతి' అనేది పెరుగుతో అనడానికి 'దధిన్' అనేదాని తృతీయా ఏకవచన రూపం గావాలి. తృతీయావిభక్తి ఏకవచనంలో ఏరూపం వ్యాకరణ సమ్మతమో హోతకు తెలియలేదు. ఆలాగా రూపత్రయం దధినా. దధ్నా స్ఫురిస్తున్నాయి. మరి, అపశబ్దం వాడితే క్రతువుకు భంగం వాటిల్లుతుంది. అందువల్ల హోత 'దధి' శబ్దమునకు తృతీయా విభక్త్యంత మేదో 'దధిశబ్దస్యయత్ తృతీయాతంతేన జుహోతి' అని చెప్పాడట। సంస్కృత భాషాస్వరూపం కూలంకషంగా ఎవరికి గూడ అవగతం గాదని దీనివల్ల మనం గ్రహించగలం. ఇంతటి కష్టమైన భాషతో పరిచయం మనకు కావాలి, అది వైదికం కాదు. వ్యావహారికం కాదు. కావ్యభాష కావ్యాల నర్థం చేసుకోవటానికి అవసరమైన భాష. ఈభాష తెలుగువారికి చెప్పేందుకు కొంతసౌలభ్యం ఉంది. సంస్కృత ధ్వని విశేషాలు (తెలుగులో తత్సమాల ద్వారా ప్రవేశించేవి) తెలుగు విద్యార్థికి సుపరిచితాలు. సంస్కృత సంధులు తెలుగు విద్యార్థి బాల్యంనుంచే నేర్చుకుంటాడు. చాలావరకు సంధులు, సమాసాలు, కృత్తద్ధితాంతాలకు సంబంధించిన వివరాలు చాల భాగం తెలుగువిద్యార్థికే సుగమంగా ఉంటుంది. ఇంకపోతే సుబంత రూప నిష్పత్తితో ప్రారంభించవచ్చు.

## సుబంతరూపనిష్పత్తి

'సుప్' అనేదానికి 'అంత' అనే పదం చేరినందున ఏర్పడిండీ సుబంతమనేమాట 'సుప్' అంటే ఏమిటనేది ప్రశ్న. సంస్కృత నామాలపై ఏడు విభక్తులనూ మూడువచనాలనూ (7x3=21) తెలియజేసే ప్రత్యయాల కిరవై ఒకటికి ఆవ్యాకరణం గల్పించినపేరిది.

వ్యాకరణం శాస్త్రమయినందున శాస్త్రంలో పారిభాషికపదాలు తప్పని సరిగా ఉంటాయి. అలాంటి పారిభాషికాల్లో ఇదొకటి. ఇదొక ప్రత్యాహారం. ప్రత్యాహారమంటే ప్రతిదాన్నీ ఆహరించేదని చెప్పవచ్చు. ప్రతిదాన్నీ అంటే పై యిరవైఒక్క ప్రత్యయాలనూ వాటికి ఆదేశంగా విధింపబడే అనేక ఇతర ప్రత్యయాలను శబ్దాంతాన్ని బట్టీ (అతో భిస్ ఐస్) శబ్దలింగాన్ని బట్టి ఈ ప్రత్యయాలకు అనేకానేక ఆదేశాలు విహితాలవుతాయి. వాటన్నింటినీ ఒక్కదాన్ని గూడ విడువకుండా గ్రహించేశక్తిగలది ప్రత్యాహారం. దీనికి సుప్ అనే నామకరణం చేయటంలో వ్యాకరణం ఈక్రింది విధానాన్ని పాటించింది. సంస్కృత విభక్తి ప్రత్యయాల నీ క్రింద విభక్తివచన వివరణాత్మకంగా యిస్తున్నాను.

| విభక్తి | | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|---|
| ప్రథమావిభక్తి | — | సు | ఔ | జస్ |
| ద్వితీయావిభక్తి | — | అమ్ | ఔట్ | శస్ |
| తృతీయావిభక్తి | — | టా | భ్యామ్ | భిస్ |
| చతుర్థీ విభక్తి | — | ఙే | భ్యామ్ | భ్యస్ |
| పంచమీ విభక్తి | — | ఙస్ | భ్యామ్ | భ్యస్ |
| షష్ఠీ విభక్తి | — | ఙస్ | ఓస్ | ఆమ్ |
| సప్తమీ విభక్తి | — | ఙి | ఓస్ | సుప్ |

అనేవి ప్రత్యయాలు. ప్రథమైకవచన ప్రత్యయం 'సు' అనేది సప్తమీబహువచన ప్రత్యయమైన "సుప్" లోచివర ఉన్న హల్మాత్ర పరమైన పకారంతో చేరినందున 'సుప్' అనే ప్రత్యాహారం నిష్పన్నమయినది. 'సు' నుంచి "ప్" వరకుగల ప్రత్యయాలను ఇరవైయింటినీ మరియు ప్రత్యయాదిలోగల 'ఙ్' అనేదాన్ని అంటే మొత్తం ఇరవైయొక్క ప్రత్యయాలను ఒక్కదాన్ని గూడా విడువకుండా ఈ "సుప్" గ్రహింపజాలియుండటం మనం గ్రహించాలి.

ప్రత్యాహారాన్ని విధించేటందుకు గూడ పాణిని వ్యాకరణంలో సూత్రం 'ఆదిరంత్యేన సహేతా' (1-1-71) అనేది. ఈ సూత్రార్థాన్ని వివరించే వృత్తి —

"అంత్యేనేతా సహితః ఆదిర్మధ్యగానాం స్వస్యచ సంజ్ఞాస్యాత్"

ఈ ప్రత్యాహారసంజ్ఞ అక్షరాలను (అచ్ హల్ మొదలగునవి) గ్రహించటానికి ఏర్పాటయినాయి. కాని, ప్రత్యయాలను గూడ గ్రహింప వీలు గలిగించాయి. ''తిఙ్'' అనేది క్రియాపదాలపై చేరే కాలపురుషవచన బోధకాలనన్నింటినీ గ్రహిస్తుంది.

అంత్యేన = చివరనున్న. ఇతా = ఇత్సంజ్ఞకములో. సహితః = కూడిన. ఆదిః = ప్రత్యాహారంలోని ఆది ధ్వని లేదా ప్రత్యయము. మధ్యగానాం = (ఆద్యంతములకు) మధ్యలోగల వాటినన్నింటిని మరియు స్వస్యచ = తనకు (ఆద్యక్షరమునకు) సంజ్ఞా = పేరు, స్యాత్ = అవుతుంది.

ప్రత్యాహారాదిలో గల ధ్వని లేదా ప్రత్యయము అక్కడనుంచి ప్రక్యాహారాంతంలో గల ఇత్సంజ్ఞకమయిన ధ్వని పర్యంతము గల ధ్వనుల నన్నింటిని గ్రహించటమేగాక ప్రత్యాహారాది యందలి ధ్వని లేదా ప్రత్యయాన్ని గూడ గ్రహిస్తుందని అర్థం.

అంటే సుప్ అనే ఈ ప్రత్యాహారం ప్రథమైకవచన ప్రత్యయం తరువాత (ప్రథమావిభక్తి ద్వివచనం ఔ మొదలుకొని) గల ప్రత్యయాల నన్నింటిని ''ప్'' అనే (సుప్ లో ఇత్సంజ్ఞకం) ఇత్సంజ్ఞక పర్యంతం గల వాటిని అంటే యిరవై ప్రత్యయాలను గ్రహిస్తుంది. అంతేగాక ప్రత్యాహారం ఆదిలోగల 'సు' అనే ప్రథమైక వచన ప్రత్యయాన్ని గూడ గ్రహిస్తుందిగాబట్టి మొత్తం యిరవై ఒక్క ప్రత్యయాలకీ పరిభాష సంక్షిప్తీకరణమైన గుర్తు.

నామము లేదా ప్రాతిపదికల అంతంలోగల స్వరాల లేదా వ్యంజనాలయొక్క మార్పును పురస్కరించుకొని రః ప్రత్యయాలకు

ఆదేశాలు విహితాలవుతుంటాయి. అంతేగాక ప్రాతిపదిక అంతంలో మార్పులేకున్న ఆప్రాతిపదిక లింగాన్ని బట్టి కూడ ఈవిధంగా పై ప్రత్యయాలకు వివిధములైన ఆదేశాలను వ్యాకరణం విధిస్తుంది. ఉదాహరణకు ఈ క్రింది వాటిని చూడండి.

అకారాంతాలకు చతుర్థీబహువచన ప్రత్యయమైన "భిస్" అనే దానికి "ఐస్" అనేది ఆదేశం (7-1-9) అవుతుంది. కాబట్టి రామ + భిస్ = రామాభిః కావలసియుండగా అలాగాక ఐస్ ఆదేశం అయినందున రామ + ఐః = రామైః అని అవుతుంది. ఐస్ అనే దాన్ని గూడ మనం సుప్‌లో చేర్చుకోవాలి.

## సుప్‌కు ఆదేశాలు

సర్వనామాలకు పరంగా ఉన్న బహువచన ప్రత్యయమైన జస్ అనే దానికి సర్వాదేశంగా "ఈ" కారం (7-1-17) వస్తుంది. కాబట్టి సర్వ + ఈ = సర్వే అని సర్వ శబ్దానికిది ప్రథమావిభక్తి బహువచన రూపం. అంటే యీ "ఈ"కారం కూడ "సుప్" లో గతార్థమవుతుందని గుర్తించాలి. సర్వనామాలకు చతుర్థివిభక్తి ఏకవచనంలో గల "ఙే" కి "స్మై (7-1-14) వస్తుంది. కాబట్టి సర్వస్మై అనే రూపం ఏర్పడుతుంది. ఈ "స్మై" అనేదాన్ని గూడ "సుప్" లో చేర్చవలసి ఉంటుంది. సర్వనామ శబ్దాలకు పరంగా ఉన్న పంచమీ సప్తమీవిభక్తి ప్రత్యయాలైన "ఙసి" "ఙి" అనేవానికి క్రమంగా (7-1-15) స్మాత్, స్మిన్ అనేవి వస్తాయి. ఇవి పుం నపుం సకలింగ రూపాలకు మాత్రమే పరిమితం. కాబట్టి సర్వస్మాత్, సర్వస్మిన్ అనే రూపాలేర్పడుతాయి. స్మాత్, స్మిన్ అనే వాటిని గూడ "సుప్" అనేపారిభాషికంలో చేర్చవలసి ఉంటుంది.

లింగభేదం వల్ల ప్రత్యయాలకు మార్పును సంస్కృత వ్యాకరణం ప్రతిపాదించింది. పుంలింగాలైన రామ మొదలగు అకారాంతాలకు

ప్రథమ ద్వితీయా విభక్తి ద్వివచనంలో వచ్చే "ఔ" అనే దాని ఆకారాంత స్త్రీలింగంలో (7-1-18) "ఈ" అనేది సర్వాదేశంగా విహితమైనది. అందువల్ల రమా + ఈ (సంధి) "రమే" అని ఈ శబ్దానికి ప్రథమ ద్వితీయా ద్వివచనరూపాలు. ఈవిధంగా 'ఈ' అనేదాన్ని గూడ "సుప్" అనేదాని పరిధిలో చేరవలసి ఉంటుంది

నపుంసకలింగమైన ఆకారాంతాలకు ప్రథమ ద్వితీయా ఏకవచనం లో "అమ్" అనేది (7-1-24) వస్తుంది. అనంతరం అమిపూర్వః (6-1-107) అనే సూత్రంచే సవర్ణదీర్ఘం నివారితమై పూర్వరూపం ఏకాదేశమైనందున "జ్ఞానమ్" అనేరూపం ఏర్పడుతుంది ఈ "అమ్" అనేది గూడ "సుప్" లో గతార్థమయినట్లు మనము గుర్తింపవలసియుండును,

ఇంకా ఎన్నో ఆగమాలు ఈ ప్రత్యయాల కవుతాయి. వాటన్నింటినీ గ్రహించాలి గాబట్టి సుప్‌ను ప్రత్యాహారం అని చెప్పుచున్నారు.

## సుప్‌కు బదులుగా అవ్యయాలు

అంతేగాక ఈ ప్రత్యయాలకు కొన్ని సందర్భాల్లో ఆదేశాలుగా వచ్చేవి అవ్యయాలుగా గుర్తించదగి ఉన్నాయి. వీనికి ప్రత్యయార్థమే గాని లింగవచన బోధకతాశక్తి లేదు.

తద్ధిత ప్రత్యయాంతాల్లో విభక్తిసంకాలనే ప్రత్యేక ప్రకరణం పాణినీయంలో గలదు. పంచమీ విభక్తిలో సర్వనామాలకు 'తసిల్' అనే ఆదేశాన్ని (5-3-7) విధించింది. "తసిల్" తః గా ప్రక్రియ దశలో ఉంటుంది. యస్మాత్, తస్మాత్ మొదలైనవానికి బదులుగా యతః, తతః అనేవీ, కస్మాత్ అనేదానికి (7-2-104) కుతః అనేది వస్తాయి. పరి, అభి అనే అవ్యయాలకు గూడ (5-3-9) తసిల్ విధింపబడినందున పరితః, అభితః మొదలగు రూపాలు నిష్పన్నాలవుతుంటాయి సర్వనామాలకు సప్తమీవిభక్తి ప్రత్యయానికి మారుగ

"త్రల్" (5-3-10) అనే ప్రత్యయం వస్తుంది. కాబట్టి తత్ర యత్ర యత్ర బహుత్ర మొదలైన రూపాలేర్పడుతాయి. తత్ర అనే వానికి మూలరూపమైన సర్వనామాలు తత్, కిమ్ మొదలగు వీనికి లింగత్రయంలో, పుంలింగం — సః

స్త్రీలింగం — సా

నపుంసకలింగం — తత్

అనీ, "కిం" శబ్దానికైతే కః, కా, కిమ్ ఇత్యాదిగ రూపాలుంటాయి. కుతః, తతః మొదలైన రూపాలకు లింగవచన బోధకత లేనందున వీటిని అవ్యయాలుగ గుర్తించదగును.

## (విభక్తికి) సుప్‌కు సమాసాల్లో అవ్యయం

అవ్యయీభావసమాసంలో పూర్వోత్తర పదాల నవ్వయాలు కాని సమాసం [2-1-6] అవ్యయంగా మారుతుంది. అవ్యయేతర ఘటిత సమాసం అవ్యయంగా మారటం వల్లనే దీనికి (అనవ్యయాః అవ్యయీభూతాః ఇతి) అవ్యయీభావసమాసమనే నామకరణం సుసంగతమయినది. హరౌ అనే దానికి అలౌకిక విగ్రహం అంటే వివరణ అనగా పదాంశ విభాగం (Morphemic analysis) హరి + ఙి అని ఉంటుంది. ఈ "ఙి" కి 'అధి' అనేది ఆదేశంగా వచ్చి అవ్యయమైన "అధి" ఈ సమాస రూప నిష్పత్తిలోగల్ల సామాన్యధర్మాన్ని ఆధారం చేసికొని ప్రథమ పదవిని పొందగా "అధిహరి" అని ఏర్పడింది. "హరౌ" అంటే ఎంత అర్థమో "అధిహరి" అంటే గూడ అంతే అర్థం స్త్రీషు, కుమారీషు మొదలగు సప్తమ్యంతాలకు స్త్రీ + సు, కుమారీ + సు అని వివరణాత్మకమైన విగ్రహం. రెండింట విభక్తి ప్రత్యయానికి ఆదేశంగా 'అధి' వచ్చి ఆ "అధి" అవ్యయమైనందున అవ్యయీ భావ సమాసంలో మొదటి స్థానాన్ని ఆక్రమించి అధిస్త్రీ, అధి కుమారీ అనికాగా. "గోస్త్రియో రుపసర్జనస్య" (1-2-48) అనే సూత్రంచే అంత్యస్వరానికి హ్రస్వ

మాదేశమయినందున 'అధిస్త్రీ' అధికుమారి అనే రూపాలేర్పడినాయి ఇవి లింగబోధకతా శక్తి (స్త్రీకుమార పదాలున్నందున) కలిగి ఉన్నా వచనాన్ని తెలిపే శక్తి కోల్పోయాయి. యదాగమ న్యాయం చేత (యదాగమాస్తద్గుణీ భూతాస్తద్గ్రహణేన గృహ్యన్తే) 'అధి' మొదలైన సమాస పూర్వపదాలు కూడ సుప్ లో చేరవలసి ఉంది.

సుప్ అనే ప్రత్యాహారంలో చేరిన ఏదో ఒక ప్రత్యయం నామాలకే గాక తద్ధిత కృత్ ప్రత్యయాంతాలకూ సమాసాలకు అంతంలో చేరవలసి ఉంది. అవి లోపించినా లోపించవచ్చు. సూత్ర విహితమై అనంతరం లోపించినా సమస్య కాదు. అలా ప్రత్యయ విహితంగాని నామాలుగానీ, కృత్తద్ధితాంతాలు గానీ, సమాసాలుగానీ పదమనే పేరును పొందవు. ఆపేరు పొందని వానికి ప్రయోగంనిషిద్ధం. ''సుప్తిఙంతం పదమ్'' (1-4-14) 'అపదం న ప్రయుంజీత' అనే నియమం ఈ భాషలో ఉన్నందున లింగ విభక్తివచన విరహితాలయిన అవ్యయాలకు కూడ పదత్వసిద్ధికై ఏదో ఒక ప్రత్యయాన్ని విధించి తరువాత దానికి లోపాన్ని ప్రతిపాదించి పదత్వసిద్దిని పొందింపజేయటం సంస్కృత వ్యాకరణంలో గలదు. దీని ప్రభావం తెలుగు వ్యాకరణంలో గూడ చోటుచేసుకున్నట్లు మనం గుర్తించగలం

పైన పేర్కొన్న సుప్ ప్రత్యయాలు ప్రక్రియాదశలో కొన్ని లోపాలవల్ల మార్పుపొందుతాయి. ప్రత్యయాంతంలోగల హల్లులు విభక్తి ప్రత్యయాలకంతంలో గల తవర్గ సకార మకారాలు (న విభక్తౌ తుస్మాః 1-3-4) తప్ప మిగిలినవి ఇత్సంజ్ఞకములయినందున లోపిస్తాయి. ప్రత్యయాదిలో గల సకారం మినహా మిగతాహల్లులన్నీ లోపిస్తాయి. అందువల్ల ఈ ప్రత్యయాలు చాలవరకు అజాదులుగా (పరివర్గాక్షరాలు గాక) అజంతాలుగా 'న్' మరియు. మ్. అనే హల్లు తప్ప ఉంటాయి ప్రక్రియాదశలో ఉండే ఈ ప్రత్యయాలను మనము క్రిందగుర్తించ గలము.

| విభక్తి | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమావిభక్తి | — | ఔ | అః |
| ద్వితీయావిభక్తి | అమ్ | ఔ | అః |
| తృతీయావిభక్తి | ఆ | భ్యామ్ | భిః |
| చతుర్థీ విభక్తి | ఏ | భ్యామ్ | భ్యః |
| పంచమీ విభక్తి | అః | భ్యామ్ | భ్యః |
| షష్ఠీ విభక్తి | అః | ఓః | ఆమ్ |
| సప్తమీ విభక్తి | ఇ | ఓః | సు |

హలంత శబ్దాల్లో నామాన్ని మాత్రం మినహాయిస్తే ఈ ప్రత్యయాలు పై విభక్తి వచనాల్లో మిగుల్తాయి. అలా మినహాయింపు చేసి ఈ విధంగా ప్రత్యయాలను వింగడింపు చేసి విద్యార్థులకు సులభపద్ధతిలో సంంస్కృతాన్ని నేర్పే ప్రయత్నాన్ని నేను గడచిన ముప్పై (1961 నుంచి) సంవత్సరాల నుంచీ చేస్తున్నాను.

సూరి విరచిత బాలవ్యాకరణం తత్సమ పరిచ్ఛేదం 67వ సూత్రంలో సంస్కృత హలంతాలకు ఆ భాషలో ప్రథమా విభక్త్యంత రూపమే (ప్రత్యయ సహితమే) తెలుగులోకి ప్రాతిపదికగా వస్తుందని చెప్పిరుక్, రాట్, మరుత్, వీరుత్ మొదలగు సంస్కృత హలంతాల ప్రథమైకవచన రూపాలను ఉదాహరణగా యిచ్చాడు. రుక్ అంటే దీప్తి, వెలుగు అని అర్థం. ఇందులో సంస్కృతనామం 'రుచ్' అనే చకారాంతం 'రాట్' అనేది రాజపర్యాయము. దీనిలో నామం రాజ్ అనే జకారాంతం మరుత్ లో సంస్కృతనామం 'మరుత్' అనేదే. దీనికి ప్రథమైక వచన ప్రత్యయం చేరి లోపించిదని పాణిన్యాదులంటారు. నా విభజనలో ప్రథమావిభక్తి ఏకవచన ప్రత్యయం లేనందున ప్రాతిపధిక విభక్త్యంతముగా ప్రయుక్తమయినట్లు గ్రహిగం

చగలం- ఋచ్, - రాజ్ అనే వాటిల్లో మాత్రం తుది హల్లులు (చ < క) (జ < ట) మార్పు చెందాయి.

మరుత్ శబ్దానికి పై ప్రత్యయాల్లో అజాది ప్రత్యయాలు చేరితే మార్పేం రాదు. అంటే ఆ ప్రత్యయాలు చేరుతుండగా లింగము నామమున కభిన్నంగా ఏ మార్పులు లేకుండ ఉంటుంది. ప్రత్యయ స్వరూపంలో భేదం లేకుండ ఒకే ప్రత్యయం విభిన్న విభక్తి వచనాల్లో రావటం సంస్కృతంలో గలదు. 4 అః అనే ప్రత్యయం ప్రథమ ద్వితీయ బహువచనాల్లోనూ పంచమీ షష్ఠీ ఏకవచనంలోనూ వస్తుంది. 3 ఔ అనేది ప్రథమ ద్వితీయ ద్వివచనంలోనూ, 2 ఓః అనేది షష్ఠీ సప్తమీ ద్వివచనంలోనూ, వస్తుంటవి. అమ్, ఆహో (1+1+1+1=4) అనేవి క్రమంగా ద్వితీయా తృతీయా చతుర్థీ సప్తమీ ఏక వచన ప్రత్యయాలు. 1 ఆమ్ షష్ఠీ బహువచన ప్రత్యయం. ఈ పన్నెండు ప్రత్యయాలే గాక ఏ ప్రత్యయమూ లేని ప్రథమైక వచనం లోను 'సు' అనే షష్ఠీబహువచన ప్రత్యయంపరంగా ఉన్నపుడు అంగం "మరుత్" అని ప్రాతిపదికతో తుల్యంగా ఉంటుంది. ఈ ప్రత్యయాలు అజాద్యులైనా జస్త్వం రాదు. అందువల్ల మరుతః 4 మరుతౌ 2 మరుతోః 2 మరుతమ్ 1 మరుతా 1 మరుతే 1 మరుతి 1 మరుతామ్ 1 మరుత్ 1 మరుత్సు 1 పదిహేను ప్రత్యయాలు పరంగా ఉండగా మరుత్ అంగంగా ఉంటుంది. 21 (7X3)—15 పోగా మిగిలిన 6 ప్రత్యయాల్లో (భ్యామ్3, భ్యః2, భిః1 =6) నాదాక్షరం ఆదియందున్నందున "మరుత్" లోని తుది తకారానికి నాదత్వవచ్చి "మరుద్" అని అవుతుంది. కాబట్టి మరుద్ భ్యామ్3, మరుద్భిః, మరుద్భ్యః2 అవి రూపాలేర్పడుతాయి.

మరుత్ + 15, మరుద్ + 6 అని గుర్తిస్తే ఈ శబ్ద రూపాలన్నీ మనం కంఠస్థం చేయకుండానే మన హస్తగతాలవుతాయి.

ఇంద్రజిత్ మొదలైన ప్రాతిపదికలూ, జుహ్వత్, బిభ్యత్, దరిద్రత్, చకాసత్ మొదలైన జుహోత్యాదుల పై నిష్పన్నాలైన శత్రంతాలూ, శాసత్, మొదలుగా అదాదివర్గం పైనుంచి ఏర్పడిన

శ(త్రంతాలూ, ఈవిధంగానే తమ వివిధ విభక్తివచన బోధకాలతో చేరి సుబంతరూపాలు (అనగా పదాలు) నిష్పన్నాలవుతాయి.

| | | | |
|---|---|---|---|
| ఇంద్రజిత్ | — 15 | ఇంద్రజిద్ | — 6 |
| బిభ్యత్ | — 15 | బిభ్యద్ | — 6 |

అభ్యాసం :— అలాగే "బిభ్యత్" అనే అంగంపై చేరే ప్రత్యయాలను వ్రాయండి.

ఏయే ప్రత్యయాలు పరంగా ఉన్నపుడు అంగం బిభ్యద్ అని మారుతుందో చెప్పండి. భకారాది ప్రత్యయాలేవి? సప్తమీ బహువచన ప్రత్యయం ఏది? సప్తమీ బహువచన ప్రత్యయం పరంకాగా అంగం ఎలా ఉంటుంది? మరుతః అనేది ఏఏ విభక్తివచనాల్లో వచ్చేరూపము? మరుత్‌కు ద్వితీయా బహువచనరూపం ఏది? మరుతః అనే దానికి గల అర్థాలను వివరించండి. "గాలిచేత" అనేమాటకు సంస్కృత రూపం వ్రాయండి. మరుతి అంటే అర్థం ఏమి? ఇది ఏ విభక్తి? ఏవచచము? మరుతమ్‌లో ప్రత్యయాన్ని గుర్తించండి?

శాసతి అనేది ఏవిభక్తి? ఏ వచనము? 'శాసత్'కు షష్ఠీ బహువచనాన్ని చెప్పండి? 'శాసతా' అనే దానికర్థం? శాసత్‌కు ప్రథమ ఏకవచన రూపం ఏది? శాసతః ఏయే విభక్తి వచనాల్లో వస్తుంది? శాసతః అనేదాని కర్థం చెప్పండి. శాసత్‌కు చతుర్థీ ఏకవచనం చెప్పండి? శాసత్‌కు ఏయే ప్రత్యయాలు పరంగాఉంటే ఏయే అంగాలు వస్తాయో వివరించండి? 'అమ్' అనేది ఏవిభక్తి వచన ప్రత్యయం? 'భిః' పరంగా ఉంటే అంగంలో ఎలాంటి మార్పువస్తుంది? శాసత్‌లో పదాంశాలను విడదీయండి, 'శాసతి' ఆనేది ఏ విభక్తి? ఏవచనం? ఏమని అర్థం? "పృథివీం శాసతః తస్య" అనే ప్రయోగంలో 'శాసతః' ఏ విభక్తి వచనరూపం? శాసతామ్‌ను పదాంశ విభజన చేయండి? శాసత్ + ఓః కలిపి వ్రాయండి? ఈరూపం ఏయే విభక్తి వచన సంబంధి? దీనికర్థమేమి? 'శాసతమ్' విడదీయండి. ఇది ఏ విభక్తి వచన

రూపం? అర్థం వ్రాయండి. 'శాసకుని వలన' దీన్ని సంస్కృతీకరించండి. 'వలన'కు సరియగు సంస్కృత ప్రత్యయం ఏది? మరుతామ్ అనేదానిలో అంగ ప్రత్యయాల విభాగాన్ని చూపండి? ఇందులో ప్రాతిపదిక ఏది? ప్రత్యయమేది? అంగం ఏది? తెలుపండి మరుతామ్‌కు అర్థం వ్రాయండి. మరుత్‌కు ద్వితీయా, తృతీయా విభక్తుల్లో బహువచన రూపాలు వ్రాయండి. మరుత్‌కు షష్ఠి విభక్తి బహువచనరూపం వ్రాయండి. మరుత్‌కు సప్తమీ ఏకవచనరూపం వ్రాయండి. మరుతోః అనేది ఏ విభక్తి ఏ వచన రూపం?

## Type of Exercises

(a) 1. Union 2. disunion 3. meaning
(b) 1. Union of a case 2, Union of a case in full
(c) Translation of Telugu words into Sanskrit and Vice Versa

పై వర్గానికి చెందిన జుహ్వత్ అనేదానికి రెండే అంగాలుంటాయి. అవి ఏవనగా ప్రాతిపదికతో అభిన్నమైన జుహ్వత్ అనేదొకటి. 15 ప్రత్యయాలు పరంకాగా ఈ యంగం ఉంటుంది. మిగిలిన 6 ప్రత్యయాల్లో ఆదియందు నాదాక్షరమున్నందున ప్రాతిపదికాంతంలో గల త్=ద్‌గా మారుతుంది. కాబట్టి 'జుహ్వద్' అని అవుతుంది.

ఇంద్రజిత్, సోమసుత్ మొదలగు ప్రాతిపదికలేగాక ద్వితీయ తృతీయ వర్గ గణిత ధాతు జన్యాలైన శత్రంతాలకు శాసత్, జుహ్వత్ మొదలైనవానికి రూపక్రమ మిట్లే.

ద్వితీయ వర్గ గణిత ధాతువులకే అదాదులని మరోపేరు. అద్ మొదలగునవి అని దీనికర్థం. మిగిలిన ధాతువులందు వలె రః వర్గ గణిత ధాతువులకు అర్ధ దాతుకం (లట్, లోట్, లఙ్, విధిలిఙ్) పరంకాగా వికరణ ప్రత్యయంరాదు. తృతీయ వర్గ గణిత ధాతువులకు కూడ పై విధముగా వికరణ ప్రత్యయం రాదుగాని, ఈ సందర్భంలో (సార్వధాతుకాల్లో) ధాతువునకుద్విత్వం గలుగుతుంది. హు + = హు హుహు, జుహు + అత్ = జుహ్వత్ (సంధి).

'శాస్' అనే ద్వితీయ వర్గ గణితాల్లో శాస్+అత్=శాసత్ అని అవుతుంది. అత్ అనేది శతృ అనే ప్రత్యయంలో ఆదిహల్లు అంత్య అచ్చు ఇత్సంజ్ఞక మయినందున లోపింపగా మిగిలిన భాగము.

తకారాంతములు (ద్వితీయ వర్గం)

ఈ రెండు వర్గాలకు చెందిన ధాతువులు పోగా మిగిలిన ధాతు గణం ఎనిమిది విభాగాలను గలిగి ఉంటుంది. ఈగణ పరిగణితాలకు సార్వధాతుకం అంటే లట్ మొదలగు లకారాదేశాలైన ప్రత్యయాలూ మరియు శతృ మొదలైన ప్రత్యయాలూ పరంగా ఉన్నపుడు (ధాతు ప్రత్యయాలకు నడుమ) వికరణ ప్రత్యయం వస్తుంది.

| క్రమ సంఖ్య | గణ నామము | వికరణప్రత్యయము | ఇతరవివరాలు |
|---|---|---|---|
| ప్రథమ గణము | భ్వాదులు | అ < అ | |
| చతుర్థగణము | దివాదులు | య < య | Roo + Vowel కు గుణాభావం |
| పంచమగణము | స్వాదులు | శ్ను < ను | — ,, — |
| షష్ఠగణము | తుదాదులు | శ < అ | — ,, — |
| సప్తమగణము | రుధాదులు | శ్న < న | అచ్చుకు పరంగా |
| అష్టమగణము | తనాదులు | ఉ < ఉ | |
| నవమగణము | క్ర్యాదులు | శ్నా < నా | గుణాభావం |
| దశమగణము | చురాదులు | ణిచ < అయ | |

ఈ ధాతువులకు శతృ ప్రత్యయం అంటే అత్ పరంగా ఉన్నందున ఈ క్రింది విధంగా శత్రంతాలు ఏర్పడుతాయి.

ప్రథమ గణం.— భూ+అ < భవ+అత్=భవత్ ఇక్కడ పరరూప సంధి. అతోగుణే 6-1-97 అపదాంత అకారానికి గుణ గణితమైన ధృ (ఇక్కడ అకారం) పరంగా ఉంటే పరస్వరైకాదేశం వస్తుంది. (ఇది సవర్ణదీర్ఘ సంధికి బాధకం).

దధ + అ + అత్ = దధత్ (దధ అనే ధాతువునకు ధారణ అని అర్థం)

దద + అ + అత్ = దదత్ (దద అనే ధాతువుకు దానం అని అర్థం)

గద + అ + అత్ = (గద అంటే వ్యక్తమయ్యేటట్లు మాట్లాడటం)

చర + అ + అత్ = చరత్ (చర అంటే గమనం, భక్షణం అర్థాలు)

ఘూర్ణ + అ + అత్ = ఘూర్ణత్ (భ్రమణార్థక మీ ధాతువు అంటే కళ్ళు మొదలగునవి తిరగటం)

మీల + అ + అత్ = మీలత్ (మీల అంటే కళ్ళు మొదలగునవి మూసుకోవటం)

ఫల + అ + అత్ = ఫలత్ (ఫల అంటే కృషి మొదలగునవి ఉపయోగానికి రావటం ఫలించటం)

జీవ + అ + అత్ = జీవత్ (బ్రదుకు)

శిక్ష + అ + అత్ = శిక్షత్ (శిక్ష అంటే విద్యోపాదనం, విద్యాదుల నేర్చుకొనటం)

నట + అ + అత్ = నటత్ (నట అంటే నృత్యం చేయటం అంగ విక్షేపం)

జ్వల + అ + అత్ = జ్వలత్ (జ్వల అంటే దీప్తి, వెలుగు)

నమ + అ + అత్ — నమత్ (వినయంచే వంగుటను నమ అంటారు)

తప + అ + అత్ = తపత్ (శరీరాదులు వేడి యెక్కుట)

త్యజ + అ + అత్ = త్యజత్ (వదలటం, విడిచివేయటం)

దహ + అ + అత్ = దహత్ (మండటం, కాలిపోవటం, బూడిద గావటం)

వహ + అ + అత్ = వహత్ (భారాదులను మోయటం)
వస + అ + అత్ = వసత్ (ఉండు, నివసించు)
భూ + అ + అత్ = అని యుండగా ధాతుగత ఊకారానికి సంధివల్ల గుణ [ఊ-ఓ] అయవాదేశం [ఓ = అవ్] వచ్చాయి. జి + అ + అత్ = జయత్ [గెలుచు అనే అర్థంగల ఈ ధాతువులోని ఇకారానికి గుణ [ఇ = ఏ] అయవాదేశాలు [ఏ = అయ్] వచ్చాయని గ్రహించాలి.]

స్మృ + అ + అత్ (తలచు అనే అర్థం గల 'స్మృ' లోని ఋకారానికి సంధివల్ల 'అర్' ఆదేశ మయినందున స్మర్ + అ + అత్ = స్మరత్‌గా ఏర్పడినది)

వృష్ + అ + అత్ = వర్షత్ (వాన కురియు అనే అర్థం గల వృష్ ధాతువులోని ఋ= అర్‌గా మారినందుననే వర్ష్ + అ + అత్ = వర్షత్ అని ఏర్పడినది.

గమ + అ + అత్ (పోవుట అనే అర్థంగల 'గమ్' ధాతువు గచ్ఛ + అ + అత్ = గచ్ఛత్ అనే రూపం ఏర్పడినదని తెలియ నగును)

మిగిలిన సప్తగణ గణితాలైన ధాతువులకున్నూ ఈవిధంగానే ధాతు ప్రత్యయాలకు (శతృ = అత్) నడుమ వికరణ ప్రత్యయం నియతంగా వస్తుంది. ఈ సందర్భంలో మరికొన్ని మార్పులు రావటమే గాక గుణాదులకు నిషేధం కొన్ని సందర్భాల్లో గుర్తింప దగును సప్తమవర్గ గణితాలైన ధాతువుల్లో వికరణ ప్రత్యయం ధాత్వంతంలో గాక అచ్చుకు పరంగా చేరుతుంది. అంటే హలంత ధాతువులైన రుధ్ మొదలగు వాటిల్లో 'రు' పై ఉకారానికి పరంగా అంటే ధాత్వంతంలో గల 'ధ్' అనే హల్లునకు ముందుగా చేరుతుంది.

పై నామాలు తకారాంతాలే. శతృ ప్రత్యయం చేరినందున ఏర్పడినవే. వీటికి సప్తమీ విభక్తి ప్రత్యయాలు పరంకాగా రూపక్రమం

కొంతవరకు ద్వితీయ తృతీయ గణితాలయిన ధాతువులనుండి ఏర్పడిన శత్రంతాలయిన శాసత్, జుహ్వత్ మొదలైన వాటినే పోలిఉంటాయి. భ్యామ్[3] భిః[1], భ్యః[2] $(3+1+2=6)$ అనే ప్రత్యయాలారు పరంగా ఉన్నపుడు ప్రాతిపదిక అంతంతోగల 'త=ద'గా మారుతుంది. అందువల్ల భవద్, గదద్, చరద్ ఇత్యాదిగ అంగాలు నిష్పన్నాలై భవద్భ్యాం భవద్భిః. భవద్భ్యః మొదలగు రీతిని రూపాలేర్పడుతాయి.

మిగిలిన పదహైదు ప్రత్యయాల్లో తుది పది ప్రత్యయాలు పరంగా ప్రాతిపదికకు అంగం అభిన్నంగా ఉంటుంది. అంటే గదత్, చరత్, మొదలగు రీతిలో అంగం ఉంటుంది. అః[3], ఆ[1], ఏ[1], ఓః[2], ఆమ్[1] ఇ[1], సు[1] $(3+1+1+2+1+1+1=10)$ అనే ప్రత్యయాలు పది పరంగా ఉన్నపుడు శాసత్ వలెనే రూపక్రమం, గదతః[3], గదతా[1], గదతే[1], గదతోః[2], గదతామ్[1]. గదతి[1], గదత్సు[1] అని రూపాలుంటాయి,

విభక్తి ప్రత్యయాల్లో మొదటి అయిదింటికి సంస్కృత సుబంత రూప నిష్పత్తిలో కొన్ని ప్రత్యేకతలను గలిగి ఉన్నాయి, వీటిని సర్వనామ స్థానాలంటారు వైయాకరణ పరిభాషలో. ఇవి పరంగా ఉన్నపుడు పూర్వమందలి ప్రాతిపదికలోని తుది అచ్చుకు పరంగా హల్మాత్రమైన నకారం చేరుతుంది. ప్రాతిపదిక హలంతమైతే తుది హల్లునకు మునుపే ఈ 'నకారం' చేరుతుంది. ఉక్ అనే ప్రత్యాహారంలో చేరే 'ఉ. ఋ. ఌ' అనే అచ్చులలో ఏ అచ్చయిన ఇత్సంజ్ఞగా గల ప్రత్యయం చేరినందున నిష్పన్నమైన ప్రాతిపదికకు మాత్రమే ఈ నకారపు పొల్లు చేరుతుంది. 'గదత్' శత్రంత్రం, శతృలో ఋకారం ఇత్సంజ్ఞకం. ఉక్ ప్రత్యాహారంలో గల 'ఋ' ఇత్సంజ్ఞగాగల ప్రత్యయం (శతృ) చేరినందున ఏర్పడిన గదత్, వర్షత్, గచ్ఛత్. జయత్. వహత్, త్యజత్ జ్వలత్ మొదలగు హలంత ప్రాతిపదికల్లో తుది హల్లునకు మునుపు పొల్లు నకారం చేరినందున అంగం గదన్త్, వర్షన్త్, గచ్ఛన్త్. జయన్త్, వహన్త్, త్యజన్త్, జ్వలన్త్ మొదలైన రీతిని అంగం ఏర్పడుతుంది. దీనిపై 'ఔ' అనే ప్రత్యయం చేరగా గదన్తౌ. వర్షన్తౌ.

గచ్ఛన్తౌ, జయన్తౌ, వహన్తౌ, ఇత్యాదిగ రూపాలూ, 'అమ్' అనేది చేరితే గదన్తమ్, గచ్ఛన్తమ్, ఇత్యాదిగ రూపాలు ప్రథమా బహువచన ప్రత్యయం అః చేరగా గదన్తః, గచ్ఛన్తః, జయన్తః, వహన్తః హసన్తః మొదలగు రూపాలు ఏర్పడుతాయి.

ప్రథమైక వచనంలో ప్రత్యయం లేనందున గచ్ఛన్త్ ఇత్యాదిగ పదాంతంలో సంయోగం నిలిచి ఉంది. 'సంయోగాన్తస్య లోపః' (8-2-23) అనే సూత్రంచేత సంయోగాంతాల్లో తుది హల్లునకు లోపం వస్తుందనే నియమాన్ని పురస్కరించుకొని తుది హల్లయిన తకారం పోతుంది, మిగిలిన నకారం పదాంతంలో ఉంది. అక్కడ సంయోగం లేనందున తుది'న' నిలుస్తుంది. కాబట్టి హసన్, గచ్ఛన్, వదన్, జయన్ వర్షన్ మొదలగు ప్రథమైక వచన రూపాలు.

సంయోగ మనగా అచ్చులలో వ్యవధానం లేక ఒకటికన్న ఎక్కువ హల్లులుండటం సంయోగం. గచ్ఛన్త్ మొదలైన పదాంతంలో నకార తకారాలు హల్లులు. ఈ రెండింటికి నడుమ అచ్చు ఏదియు లేదు. "హలోఽనంతరాస్సంయోగః" (1-1-17)

## Exercise (అభ్యాసం)

A and B

A. ధాతుగణాలు - తద్వికరణ ప్రత్యయాలు.

B. శత్రంతరూప నిష్పత్తి - తద్విభక్త్యంత రూపాలు.

గదత్ అనేదానిలో గదన్త్ అనేది ఒక అంగం,
గదన్ అనేది మరో అంగం.
గదత్ అనేది మూడో అంగం,

అంటే మరుత్‌కు రెండే అంగాలు కాగా దీనికి మరో అంగం వచ్చింది, అంటే దానికన్న ఇదికొంత ప్రత్యేకతను అందువల్ల క్లిష్టతను సంతరించు కొన్న ప్రాతిపదికం. అక్లిష్టము, సులభము అయిన వాటిని గూర్చి తెలుసుకోవటం మంచిది. అందువల్ల ఈ సంపుటంలో శబ్దాదుల పూర్వాపరతలు నిర్ణీతాలయినాయి. పాణిన్యాదులైతే ముందు అజంతా

లను తరువాత హలంతాలను పరిగ్రహించారు. వాటిలోగూడ పుం స్త్రీ నపుంసక అనే క్రమాన్ని పాటించారు.

ఈ సంపుటంలో మనం చర్చించిన ప్రాతిపదికలన్నీ పుంలింగాలే తదన్య లింగాలను గూర్చిన చర్చ తరువాత యథావకాశంగా వస్తుంది.

గదన్త్ - అనే దానితో చేరే ప్రత్యయాలు ఔ, అః, అమ్, కాబట్టి గదన్తౌ, గదన్తః, గదన్తమ్ అని రూపాలు. ప్రథమైక వచనంలో ప్రత్యయం లేనందున ప్రాతిపదిక సంయుక్తాంతమై తుది తకారం లోపించగా గదన్ అని ఉంటుంది.

నాదాక్షరం ఆదియందుగల భ్యామ్, భిః, భ్యః అనేవి పరంగా ఉండగా అంగం గదద్‌గా మారుతుంది. కాబట్టి గదద్భ్యామ్[3], గదద్భిః[1] గదద్భ్యః (6) అని రూపా లేర్పడుతాయి. ఈయారు సర్వ నామ స్థానాలు (మొదటి అయిదు) అయిదు (6+5=11) పదకొండు పోగా మిగిలిన పది ప్రత్యయాలు అంటే అః[3], ఆ[1], ఏ[1], ఓః[3], ఆమ్[1], ఇ[1], సు[2], (3+1+1+2+1+1+1=10) పరంకాగా అంగం ప్రాతి ప్రదికకు అభిన్నం. గదతః, గదతా, గదతే, గదతోః, గదతామ్, గదతి, గదత్సు అని రూపాలేర్పడుతాయి.

## Exercises (అభ్యాసం)

సంస్కృత ధాతువు లెన్ని గణాలుగా గణింపబడినని? భ్వాది ఎన్నోగణము? భ్వాది గణ ధాతువులను రెంటిని వ్రాయండి. ఆ ధాతువులకు రెంటికి శత్రంత రూపాలను చెప్పండి, ఆరెండు శత్రం తాలకు గలిగే అంగాలెన్ని? ఆ యంగాలను తెలుపండి. ఏ అంగానికి ఏయే ప్రత్యయాలు చేరుతాయి.

'చరత్' అనే దానిలో ధాతువు ఏది? ప్రత్యయం యొక్క ప్రక్రియ దశలోని రూపాన్ని గుర్తించండి. ఈ ప్రత్యయం యొక్క వైయాకరణ రూపాన్ని చెప్పండి. వైయాకరణ రూపంలో లోపించే

ధ్వనులేవి? ధాతు ప్రత్యయాలకు నడుమ వచ్చే వికరణ ప్రత్యయం చెప్పగలవా? ఈ రూపనిష్పత్తిలోగల సంధివైశిష్ట్యం నీకు తెలిసినదా? చరత్, చరన్ అనే ఈ రెండింటికి వైయాకరణం ప్రతిపాదించిన భేదాన్ని చెప్పుము? చరతి, చరతే అనే ఈ రెండింటి రూపనిష్పత్తిని వివరించుము? చరద్భిః, చరద్భ్యః వీనిలోగల భేదాన్ని చెప్పగలవా? చరన్తః, చరతః ఇవి ఏ వచన విభక్త్యంతాలు? చరతః అనేది ఏయే విభక్తి వచనాల్లో వచ్చే రూపము? 'గచ్ఛతః ఏవ స్ఖలనమ్' అనే ప్రయోగంలోగల 'గచ్ఛతః' అనే దానికిగల అర్థాన్ని నిర్ణయం చేయండి. దీన్ని ఏ విభక్తి వచనంగా గుర్తించాలి. 'కమ్ఫత్' అనే దానికి పై ప్రత్యయాన్ని కలిపిన రూపాన్ని వ్రాయండి. దహత్ అనే దానిలో ఎన్ని పదాంశాలున్నాయో చెప్పుము. వాటిని విడదీసి చూపుము. 'వహ్' ధాతువునకు శత్రంతాన్ని ఎలా నిష్పన్నం గావించాలి? శత్రంతానికి వలసిన పదాంశాలను క్రమం తప్పకుండా రాస్తావా? ఆ ప్రత్యయాలను కలపటంలో మనం గుర్తించాల్సిన సంధి విశేషం ఏది? దహత్ అనే దానికి మొదటి ప్రత్యయ పంచకం పరంకాగా అంగం ఎలా ఉంటుంది? దహత్ అనే అంగం ఏ ప్రత్యయాలు పరంగా ఉంటే వస్తుంది? నాదాక్షరమైన భకారాది ప్రత్యయాలెన్ని? అవి యేవి? ఇవి చేరేటప్పుడు దహత్ అనే ప్రాతిపదికలో ఏవిధమైన మార్పు వస్తుంది? "దహతా మనోభవమ్" అనే ప్రయోగంలో గల దహతా అనే దానికర్థం చెప్పగలవా? దహతా అనే దానిలో గల పదాంశాలను వివరించ గలవా? ఇక్కడి విశేషసంధి ఏమి? ఏ ఏ విభక్త్యంతము ఏ వచనము? తక్కిన రెండు వచనాలను (ఈ విభక్తిలో) చెప్పగలవా?

'జ్వలన్మణి' దీన్ని విడదీసి పూర్వ పదాన్ని గుర్తించ గలవా? ఇందులోగల పదాంశాలను వివరిస్తావా? ఈరూప నిష్పత్తిలో గల విశేషసంధి ఏమి? ఇందులో తుది పదాంశాన్ని వైయాకరణ రూపాన్ని నిరూపిస్తావా? ప్రక్రియా రూపంకన్న వైయాకరణ రూపంలో ఎన్ని ధ్వనులధికంగా ఉన్నవి? అందులో అచ్చు హల్లులను విభజిస్తావా?

'కర్షన్ బభూవ ప్రమదాయ పిత్రోః' అనే ప్రయోగంలో కర్షన్ అనేది ఏ విభక్తి వచనాంతము? దీని ప్రాతిపదిక ఏది? ఆ ప్రాతి పదికనుంచి ఈ రూపాన్ని సాధించ గలవా? ఈ రూపంలో గల ధాతువేది? ఈధాతువు రూపనిష్పత్తిలో ఏమార్పుకు లోనైంది? ఈ మార్పుల నేమంటారు? ఇలాంటి మార్పుగల క్రియను మరొక దానిని చెప్పగలవా? (వృష సేచనే)

ఏయే గణగణిత ధాతువులకు వికరణప్రత్యయంగా 'అ' వస్తుంది? ఆరో వర్గంలో తొలి ధాతువేది? ఈ గణంలో పఠిగణి తాలైన ధాతువులకు వికరణ ప్రత్యయం పరంకాగా గుర్తించాల్సిన ప్రత్యేకత ఏది?

(గుణస్య అప్రవృత్తిః)

ద్వ్యక్షర వంతమైన వికరణ ప్రత్యయం (ప్రక్రియాదశలో) ఏ గణ గణితాలైన ధాతువులకు వస్తుంది.

దీర్ఘమంతమైన వికరణ ప్రత్యయం వచ్చేగణం ఏది? ఈ వర్గంలో తొలి ధాతువుగా వ్యాకరణకర్తలు దేన్ని గుర్తించారు?

'య' అనే వికరణ ప్రత్యయం వచ్చే ధాతు గణమేది? సంస్కృతంలో కర్మణ్యర్థంలో గూడ 'య' వస్తుంది. నియతంగా కర్మణి ప్రయోగా లాత్మనే పదంలోనే ఉంటాయి.)

వికరణ ప్రత్యయ విరహిత గణమేది? 'బిభ్యత్' అనే దానిలో ధాతువేది? ప్రత్యయమేది? వికరణ ప్రత్యయం వచ్చే సందర్భంలో

ధాతువుకు ద్విరుక్తి ఏ వర్గంలో చేరినధాతువులకు కలుగుతుంది?

స్వాది ధాతువర్గ మెన్నవది? దీనికి గలిగే వికరణ ప్రత్యయం ఏది? 'శ' అనే వికరణప్రత్యయం ఏ ధాతువులకు వస్తుంది? ఇందులో ప్రక్రియాదశలో ఉండే రూపాన్ని చెప్పండి. ఈ వికరణ ప్రత్యయంలోగల వైశిష్ట్యమేమి?

[గుణసంధికి నిషేధము తుదతి అనియేగాని తోదతి అనికాదు.]

'శాసత్' అనే దానిలో ఎన్ని పదాంశాలున్నాయి?

(Unlike in other cases hare there are only two).

'ఉ' అనే వికరణ ప్రత్యయం యేవర్గగత ధాతువులకు వస్తుంది? ఈవర్గంలో మొదటి ధాతువేది? ఈ గణాన్ని ఏ సంఖ్యతో వ్యాకరణాలు గుర్తించాయి?

సంస్కృత ధాతువులను దశగణగణితంగా గుర్తించటానికి ఆధారమేమి? వికరణ ప్రత్యయాలెన్ని? వికరణ ప్రత్యయ విరహిత ధాతువులను గూర్చి వ్రాయుము? ఏయే లకారాలు పరంగా ఉంటే వికరణ ప్రత్యయాలు వస్తాయి? శతృ ప్రత్యయం పరంగా ఉండగా వికరణ ప్రత్యయ ప్రవృత్తికి కారణమేమి?

కర్తరి శప్ (3-1-68) కర్త్రర్థే సార్వధాతుకే పరే ధాతోః స్యాత్, తిఙ్ శిత్ సార్వధాతుకమ్ (3-4-113) తిఙః శితశ్చధాత్వధికారోక్తః ఏతత్సంజ్ఞాః స్యుః।

శత్రంత రూపాలు (దివాది ప్రభృతి చురాది పర్యంతం)

దివాదులు :— ఈ వర్గంలో నూట నలభై వరకు ధాతువు లున్నాయని పాణినీయంలోగల అనుబంధం వల్ల తెలుస్తుంది. గాత్ర విక్షేపాత్మకమైన నృత్ అనేదీ వర్గం లోదే.

| | |
|---|---|
| త్రసీ ఉద్వేగే | శ్లిష ఆలింగనే |
| ఇష గతౌ | ణశ అదర్శనే |
| షహ మర్షణే | ముహ వైచిత్త్యే |
| [illegible] | క్రుధ క్రోధే |
| పుష్ప పుష్టౌ | క్షమూ సహనే |
| తుష పీతౌ | కృశ తనూకరణే |

కుప్ క్రోధే హృష తుష్టౌ
క్షుభ్ సంచలనౌ

అనే ఈ పదహారు ధాతువులు సంస్కృతంలో ప్రసిద్ధాలు. తక్కిన వాటికంతగా ఆ భాషలో ప్రాచుర్యంలేదు. సంస్కృతంలో ప్రసిద్ధాలల్లో కొన్ని తెలుగులోకి తత్సమాలుగా రావచ్చు. సంస్కృతంలో అప్రసిద్ధాలు కొన్ని పరిస్థితుల్లో తెలుగులోకి రావచ్చును. కాని అలాంటివి అతి తక్కువ.

ఈ వర్గానికి చెందిన ధాతువులకు వికరణ ప్రత్యయంగా 'య' అనేది వస్తుంది. ఈ యకారం పరంగా ఉన్నపుడు దాతువులోని స్వరానికి గుణాదులు రావు. 'నృత్' అనే ధాతువునకు 'య' పరంగా ఉండగా దాతువులోని అచ్చయిన ఋకారానికి 'అర్' అనేది రాదు. కాగా నృత్ + య + అత్ అని ఉండగా పూర్వరూప సంధి వచ్చి నందున (సవర్ణ దీర్ఘం పరా స్తమై) నృత్యత్ అని సిద్ధిస్తుంది. అలాగే త్రస్యత్ (త్రసీ), ఇష్యత్ (ఇష), సహ్యత్ (సహ) జీర్యత్ (జ్యా) ఋాత ఇద్ధాతోః (7-1-100) ఉరణ్ రపరః (1-1-51).

శమూ అనే దాతువులో ఆదిహ్రస్వానికి దీర్ఘం వస్తుంది. శమామష్టా దశానాం దీర్ఘః శ్యతి (7-3-74) కృశ్ + య + అత్ = కృశ్యత్; హృష్ + య + అత్ = హృష్యత్; కుప్ + య + అత్ = కుప్యత్; క్షుభ్ + య + అత్ = క్షుభ్యత్ అని ఈ ధాతువులపైన క్రమానుసారంగా శతృ ప్రత్యయం చేరినందున ఏర్పడే రూపాలు.

పైని శత్రంతాలకు విభక్తి ప్రత్యయాలు పరంకాగా మూడు విధాలైన అంగాలుంటాయను కున్నాము. అందులో మొదటిది నృత్యద్/త్ అనేది. సర్వనామస్థానాలుగా ప్రాచీనవ్యాకరణ కర్తలు గుర్తించిన అయిదు ప్రత్యయాలూ అంటే ప్రథమా విభక్తి ప్రత్యయాలు మూడు ద్వితీయా విభక్తిలో ఏక ద్వివచన ప్రత్యయాలు రెండు అంగా (ఔ² అః¹ అమ్¹) అనేవి పరంకాగా అంగం సంయోగాంతమై ఉంటుంది. ప్రథమైక వచనంలో సంయోగాంత లోపంవల్ల నృత్యన్

అని రూపం ఏర్పడుతుంది. తరువాత ప్రత్యయా లజాదులయి నందున సంయోగత పోతుంది. ఫలితంగా రెండు హల్లులూ నిలిచి ఉంటాయి. నృత్యన్తౌ[2], నృత్యన్తః[1], నృత్యన్తమ్ అని రూపా లేర్పడుతాయి, నాదాక్షరమైన భకారాది ప్రత్యయాలారు, (భ్యామ్[3], భిః[1], భ్యః[2]) పరంకాగా నృత్యత్ అనే దానిలోని తుది 'త' అనే శ్వాసాక్షరం కూడ నాదంగా మారుతుంది, కాబట్టి అంగం దకారాంతంగా 'నృత్యద్' అని ఉంటుంది. పై ప్రత్యయాలు చేరగా నృత్యద్భ్యాం, నృత్యద్భిః, నృత్యద్భ్యః అని రూపా లేర్పడుతాయి, ఈ ప్రత్యయాలు (5+6=11) పదకొండు పోగా మిగిలిన 10 ప్రత్యయాలు (అః[3] ఆ[1] ఏ[1] ఓః[2] అమ్[1], ఇ[1], సు[1]) పరంకాగా అంగం ప్రాతిపదిక అభిన్నంగా ఉంటాయి. కాబట్టి నృత్యత్ అనే ఉంటుంది. కాబట్టి నృత్యతః[3], నృత్యతా[1], నృత్యతే[1], నృత్యతోః[3], నృత్యతామ్[1], నృత్యతి[1], నృత్యత్సు[1] ఇత్యాదిగ రూపా లేర్పడుతాయి.

## Exercise (అభ్యాసం)

చతుర్థ వర్గ గణిత ధాతువుల్లో కొన్నింటిని చెప్పండి. వాని అర్థాన్ని వివరించండి. ఈ గణంలో చేరే ధాతువుల కంతంలో చేరే వికరణ ప్రత్యయం ఏది? దాని ప్రత్యేకత ఏమి? దాన్ని ఉదాహరణము నందు చెప్పుము.

తృష్ ధాతువునకు శతృ ప్రత్యయాంతం చేరగా ఏర్పడే రూపాన్ని సప్రమాణముగా నిరూపించునది. తృష్ ధాతు జన్యమైన శతృ ప్రత్యయాంతానికి విభక్తి ప్రత్యయాలు చేరితే ఎన్ని విధాలైన అంగా లేర్పడుతాయి? ఆయంగాల నన్నింటిని చెప్పుము? ఏయే ప్రత్యయములు పరముకాగా ఏయే యంగములు వచ్చును? ఎక్కువ ప్రత్యయములు పరముగా నున్నపుడు వచ్చు అంగమేది? అతితక్కువ ప్రత్యయాలు పరంకాగా ఏ అంగం వస్తుంది? నాదాక్షరము లాదియందు గల ప్రత్యయాలేవి? ఆప్రత్యయాలు పరంకాగా ఏ యంగము వచ్చును? తుష్యద్భ్యామ్ అనేది ఏ విభక్తి ఏవచనము?

అన్నిటికన్న ఎక్కువ మార్లు వచ్చే విభక్త్యంత రూపమేది? తృష్యత్ అనే దానికి సప్తమీ విభక్తి ఏకవచన రూపాన్ని వ్రాస్తావా? తృష్యత్సు అనేదాన్ని ప్రాతిపదిక ప్రత్యయాత్మకంగా విభజించి చూపగలవా? తృష్యత్ అనేదానిలో ఎన్ని పదాంశాలున్నాయో వివరించుము? తృష్యన్ అనేరూపం ఏవిభక్తి ఏవచనము? పొల్లు నకారము నృత్యత్ అనే ప్రాతిపదికలో ఎక్కడ వచ్చును? ఏయే ప్రత్యయములు పరముకాగా ఈ యాగమము వస్తుంది? ఈ ప్రత్యయాలకు ప్రత్యేకించి వ్యాకరణం ఎలాంటి నామకరణం చేసింది? తృష్యతః అనేది ఏయే విభక్తి వచనాల్లోవస్తుంది? తృష్యతః, తృష్యన్తః ఈ రెండింటికి భేదమేమి? తృష్యతోః అనేది ఏ విభక్తివచన రూపము? ఇది ఎన్ని మార్లు ఏర్పడు తుంది.

తృష్యత్ అనే దానికి ద్వితీయ బహువచన రూపాన్ని చెప్పుము? 'దప్పిక గొన్నవాని వలన' అనే దానికి తుల్యార్థకమైన సంస్కృత పదాన్ని వ్రాయుము. తృష్యన్తౌ అనేదానికి సమానార్థకాలైన తెలుగు పదాలను వ్రాయండి. తృష్యతే అంటే అర్థమేమి? తృష్యతా అనేది ఏ విభక్తివచనరూపము. తృష్యతా అనే దానికి బహువచన రూపాన్ని వ్రాయండి.

'నృత్యత ఏవస్థలనమ్' అనే వాక్యంలో గల నృత్యతః అనేది ఏవిభక్త్యంతము? ఏవచనము? దీనికి తెలుగులో సమానార్థకాన్ని వ్రాయండి.

తస్యత్ అనేదానికి త్రస్యన్త్, త్రస్యద్, త్రస్యత్ అనేవి ఏ అంగ త్రయము. అలాగే ఇష్యత్ గతౌ అనేదానికి ఏర్పడే అంగత్రయాన్ని చెప్పండి.

సహ్యత్, జీర్యత్, క్లిష్యత్, నశ్యత్, ముహ్యత్, క్రుధ్యత్, క్షామ్యత్ (7-3-74) కృశ్యత్, హృష్యత్, కుప్యత్, క్షుభ్యత్ మొదలగు

శత్రంతాలకు అంగత్రయం ఏర్పాటు చేసుకున్న తరువాత నిర్ణీత ప్రత్యయాలనుచేర్చి సుబంత రూపాలను నిష్పన్నంగావించాలి.

Exercise :—

సహ్యత్ అనేదానికి తృతీయావిభక్తి వ్రాయండి. క్షమ్యత్ అనే దానికి షష్ఠీవిభక్తి వ్రాయండి.

శ్లిష్యత్ అనే దానికి ప్రథమావిభక్తి వ్రాయండి.

ముహ్యత్ అనే దానికి చతుర్థీవిభక్తి వ్రాయండి.

హృష్యత్ అనే దానికి సప్తమీవిభక్తి వ్రాయండి.

కుప్యత్ అనే దానికి పంచమీవిభక్తి వ్రాయండి.

నశ్యత్, జీర్యత్, ముహ్యత్, క్షుభ్యత్, అనే ప్రాతిపదికలకు ఏడు విభక్తుల్లో మూడువచనాల్లో ఏర్పడే రూపాలను క్రమానుసారంగా వ్రాయండి.

అయిదో వర్గం (స్వాదిగణం)

ఈ వర్గంలో ఉన్న ధాతువుల సంఖ్య మూడు పదుల కన్న ఎక్కువ లేవు. అందులో ఆచ్ఛాదనార్థకమై షుఞ్, చయన (సంచయ్యార్థకమైన) చిఞ్. వృఞ్ (వరణార్థకం) ధుఞ్ (కంపనం) దు (ఉపతాప) పృ (ప్రీతి) వ్యాప్త్యర్థకమైన ఆప్లు శక్త్యర్థకమైన శక్లు, అనేవి ప్రసిద్ధాలుగా గుర్తింపదగి ఉన్నాయి.

ఈ ధాతువులకు శతృ మొదలగు ప్రత్యయాలు పరంగా ఉన్నపుడు 'ను' అనే వికరణప్రత్యయం చేరుతుంది. స్వాదిభ్యశ్నుః

(3-1-73) ఈ ప్రత్యయం పరంగా ఉండగా ధాతువులోని అచ్చులకు గుణాదిసంధి కార్యాలు రావు. కాబట్టి 'సు' కు 'ను' పరంగా ఉన్నప్పటికీ ధాతువులో ఉకారం 'ఓ' గా మారదు.

'సు' అనేదానికి శతృప్రత్యయం చేరగా (అత్) నడుమ వికరణ ప్రత్యయం (ను) వస్తుంది గాబట్టి సు+ను+అత్ అని ఏర్పడుతుంది. ధాతువులోని స్వరానికి (ఉ < ఓ) గుణం రాదుగాని వికరణ ప్రత్యయమైన 'ను' లోని ఉకారానికి (అత్ లోని) అకారం పరంగా ఉన్నందున యణాదేశం వస్తుంది. కాబట్టి సున్వత్ అనేది 'సు' అనే ధాతువునకు శతృప్రత్యయాంతరూపము. దీనికి సున్వన్త్, సున్వద్, సున్వత్ అనే అంగాలుంటాయి. మొదటి అయిదు ప్రత్యయాలు పరంకాగా సున్వన్త్ అనేది అంగము. ఔ చేరితే సున్వన్తౌ అనీ, అః చేరితే సున్వన్తఃఅనీ, అమ్ చేరితే సున్వన్తమ్ అనీ రూపాలు ఏర్పడుతాయి. ప్రథమైకవచనంలో సంయోగాంతం లోని 'త్' కారం లోపించినందున 'సున్వన్' అనే రూపం ఏర్పడుతుంది.

నాదాక్షరా లాదియందుగల ప్రత్యయాలు పరంగా ఉండగా ప్రాతిపదికలోని అంత్యహల్లు (త్ < ద్) లో మార్పురాగా అంగం సున్వద్ అని అవుతుంది. దీనిపై భ్యామ్ మొదలగునవి చేరగా సున్వద్భ్యామ్ మొదలయిన రీతిని రూపాలుంటాయి. ఈ (5+6=11) పదకొండు ప్రత్యయాలు పోగా మిగిలిన పది ప్రత్యయాలు పరమైనపుడు అంగం ప్రాతిపదిక కన్న అభిన్నం. సున్వత్+అః= సున్వతః

సున్వతా[1], సున్వతౌ[1] సున్వతోః[2], సున్వతామ్[1], సున్వతి[1], సున్వత్సు[1] అని రూపక్రమం.

మిగిలిన శత్రంత రూపాలీ క్రింది విధంగా ఉంటాయి.

చి+ను+అత్ = చిన్వత్
వృ+ను+అత్ = వృణ్వత్
ధు+ను+అత్ = ధున్వత్

దు+ను+అత్ = దున్వత్

పృ+ను+అత్ = పృణ్వత్

అద్ +ను+ అత్ అని ఉండగా యణాదేశం నివారితమై అచిశ్నుధాతు భ్రువాంయ్వోరియఙువఙౌ (6-477) ఉవఙాదేశమయినందున 'అప్నువత్' అనే రూపం ఏర్పడుతుంది.

వీనికి విధంగా అంగత్రయం [మూడంగాలు] ఉంటుంది.

| శత్రంతం | అంగం I | అంగంII | అంగంIII |
|---|---|---|---|
| చిన్వత్ | చిన్వన్త్ | చిన్వద్ | చిన్వత్ |
| వృణ్వత్ | వృణ్వన్త్ | వృణ్వద్ | వృణ్వత్ |
| ధున్వత్ | ధున్వన్త్ | ధున్వద్ | ధున్వత్ |
| పృణ్వత్ | పృణ్వన్త్ | పృణ్వద్ | పృణ్వత్ |
| అప్నువత్ | అప్నువన్త్. | అప్నువద్ | అప్నువత్ |

సర్వనామస్థానాలు గుర్తింపబడిన మొదటి అయిదు ప్రత్యయాలు (ఔ, అః, అమ్) పరమైతే మొదటి అంగం వస్తుంది. కాబట్టి చిన్వన్, చిన్వన్తౌ, చిన్వన్తః, చిన్వన్తమ్ అని రూపక్రమం. నాదాక్షరమైన భకారాది ప్రత్యయాలు (భ్యాం, భిః భ్యః) పరం అయితే రెండో అంగం వస్తుంది. కాబట్టి చిన్వద్భ్యామ్[3], చిన్వద్భిః[1], చిన్వద్భ్యః[2], అని రూపాలు, తక్కిన ప్రత్యయాలు (అః[3] ఆ[1] ఏ[1] ఓః[2] ఆమ్ ఇ[1], సు[1],) పది పరం అయితే అంగం ప్రత్యయంతో సమానంగా ఉంటుంది, ఏ ధ్వని యందు ఎలాంటి మార్పు లేక అంగం ప్రాతిపదిక కఠిన్నంగా ఉంటుంది.

చిన్వతః[3], చిన్వతా[1], చిన్వతే[1], చిన్వతో[2], చిన్వతామ్[1], చిన్వతి[1], చిన్వత్సు[1], అని రూపాలుంటాయి.

అభ్యాసం :—

'చిన్వత్' అనేదాన్ని పదాంశాత్మకంగా వివరించండి. 'దు' అనే ధాతువునుండి శత్రంత రూపాన్ని నిర్మించండి. 'ఆప్నువత్' అనే శత్రంత రూప నిష్పత్తిలో గల ప్రత్యేకతను వివరించండి. వృణ్వత్ అనే శత్రంతానికి అన్ని విభక్తివచన రూపాలను క్రమం దప్పకుండ వ్రాయండి. 'ఆప్నువత్' అనే శత్రంతానికి ద్వితీయా ఏకవచనం మొదలుకొని సప్తమీ ఏకవచనం వరకు ఏర్పడే రూపాలను క్రమం తప్పకుండ వ్రాయండి. 'వృణ్వత్' అనేదానికి షష్ఠీవిభక్తి రూపాలూ, ద్వితీయావిభక్తి రూపాలూ మరియు పంచమీవిభక్తి రూపాలూ వ్రాయండి.

షష్ఠ వర్గం (తుదాదులు)

ఈ వర్గంలో నూటయాభైకి పైగా ధాతువులున్నాయి. ఈ ధాతువులకు వికరణ ప్రత్యయం 'శ' అనేది. ఇందులో ఆద్యవయవమైన శకారంలోపిస్తుంది. కాబట్టి 'అ' కారం మిగులుతుంది. ఈ వికరణప్రత్యయం పరంగా ఉన్నపుడు పూర్వమందలి ధాతువులోగల స్వరానికి గుణాదిసంధులు ప్రవర్తించవు. నిర్మాణమనే అర్థంగల 'సృజ్' అనే ధాతువీ వర్గంలోనిది. అంటే దీనిపైన నిర్మితాలయ్యే కృదంతాల్లో కూడ గుణాదులు ప్రవర్తించవు.

ఉపధాస్థానంలో 'ఇక్' అంటే ఇ-ఉ-ఋ-ఌ అనే అచ్చుల చతుష్టయం ఉంటే 'క' అనే ప్రత్యయం ఇగుపధ జ్ఞాప్రీకిరః కః (3-1-135) అనే సూత్రం చేత వస్తుంది. కాబట్టి క్షిపః (క్షిప్) లిఖః (లిఖ్) బుధః (బుధ్) కృశః (కృశ్) జ్ఞః (జ్ఞా) మొదలైన రూపాలేర్పడుతాయి. సృజః (సృజ్) అనేదాని నుంచి కుచః (కుచ్)

అనే ధాతువునుంచి ఏర్పడుతాయి. కాబట్టి ఈ నామాల్లోలేని గుణం తత్సమధాతువుల్లో గూడ లేదన్నమాట. కాని, చిన్నయసూరి, సృజించు, సంకోచించు అనిచెప్పి కుచధాతువులో గుణాభావాన్ని తిరస్కరించాడు.

వ్యథార్థకమయిన తుద, అతిసర్జనార్థకమైన దిశ, విలేఖనార్థకమైన కృష, లిఖ (అక్షరవిన్యాసం) మిల (సంగమం) విశ (ప్రవేశం) విద్ల (లాభం) మరియు భేదనార్థకమైన కృతీ అనేవి ఈ వర్గంలో ప్రాచుర్యాన్ని సంతరించుకున్న క్రియలు.

ఈ క్రియలపై చేరే వికరణ ప్రత్యయం 'శ' లో ఆదియందలి శకారం ఇత్సంజ్ఞకమయినందున లోపించి 'అ' మిగులుతుంది.

కాబట్టి శత్రంత రూపాలు ఈ క్రింది విధంగా ఏర్పడుతాయి.

| క్రమ సంఖ్య | ధాతువు | వికరణ ప్రత్యయం | శతృ ప్రత్యయం | శత్రంతం |
|---|---|---|---|---|
| 1 | తుద్ | అ | అత్ | తుదత్ |
| 2 | దిశ్ | అ | అత్ | దిశత్ |
| 3 | కృష్ | అ | అత్ | కృషత్ |
| 4. | లిఖ్ | అ | అత్ | లిఖత్ |
| 5 | కుచ్ | అ | అత్ | కుచత్ |
| 6 | సృజ్ | అ | అత్ | సృజత్ |
| 7 | మిల్ | అ | అత్ | మిలత్ |
| 8 | విశ్ | అ | అత్ | విశత్ |
| 9 | విద్లు | అ | అత్ | విన్దత్ |
| 10 | కృతీ | అ | అత్ | కృన్తత్ |

వికరణ ప్రత్యయానికీ శత్రంతానికీ నడుమ పరస్వరైకాదేశం 'అతో గుణా' (6-1-97) అనే సూత్రం చేత వచ్చింది. వీనికి సర్వనామస్థానాలు పరంగా ఉండగా (మొదటి అయిదు ప్రత్యయాలు) తదన్త్, దిశన్త్, కృషన్త్, లిఖన్త్, కుచన్త్, సృజన్త్, మిలన్త్, విశన్త్, ఇత్యాదిగ తుది తకారానికి ముందుగా పొల్లు (హల్మాత్రమైన) నకారం చేరి రూపాలేర్పడుతాయి. కాబట్టి కృషన్[1], కృషన్తౌ[2], కృషన్తః[1], కృషన్తమ్ ఇత్యాదిగ సుబంత రూపాలేర్పడుతాయి.

నాదాక్షరమైన తకారాది ప్రత్యయాలు ఆరు పరంగా ఉండగా ఈ ప్రాతిపదికల్లోని తుది త్ ద్ గ మారుతుంది. కాబట్టి విశద్ అను రీతిని అంగం ఏర్పడుతుంది. విశద్భ్యామ్[3], విశద్భిః[1], విశద్భ్యః[2] ఇత్యాదిగ పదాలేర్పడుతాయి. ఈ పదకొండు ప్రత్యయాలు పోగా మిగిలిన పది ప్రత్యయాలు (అః[3], ఆ[1], ఏ[1], ఓః[2], అమ్[1], ఇ[1], సు[1]) ప్రత్యయాలు పరం కాగా అంగం ప్రాతిపదికకు అభిన్నంగా ఉంటుంది. అంటే లిఖత్, మొదలగు రీతిని అంగం ఉంటుంది. కాబట్టి లిఖతః[3], లిఖతా[1], లిఖతే[1], లిఖతోః[2], లిఖతామ్[1], లిఖతి[1], లిఖత్సు[1], ఇత్యాదిగ రూపాలు నిష్పన్నాలవుతాయి.

అభ్యాసం :—

'తుదత్' అనేదానికి తృతీయా, చతుర్థి, పంచమీ విభక్త్యంత రూపాలను క్రమాను సారంగా వ్రాయండి. 'దిశత్' అనే ప్రాతిపదికకు ఏర్పడే అంగత్రయాన్ని పేర్కొనండి. ఏయే ప్రత్యయాలు ఏయే అంగాలతో చేరుతాయో వివరించండి.

కృషత్, దిశత్, కృన్తత్ అనే ప్రాతిపదికలకు అన్ని విభక్త్యంత రూపాలను వ్రాయండి. ప్రథమా బహువచన, షష్ఠీఏకవచన ప్రత్యయాలను పేర్కొనండి. ఈ ప్రత్యయాలేయే అంగాలకు చేరుతాయో నిరూపించండి. ప్రథమ, ద్వితీయ, తృతీయాంగాల్లో దేనికి

ప్రత్యయాలనుసంధింపబడుతాయో తెలుపండి.

సృజతి, కృన్తతి అనేవానిలో ధాతువు ఏది? ప్రత్యయం ఏది? వీని కాంధ్రంలో సమానార్థకమైన రూపాన్ని వ్రాయండి.

కుచత్, విశత్, విస్ధత్ అనే ప్రాతిపదికలకు సప్తమీవిభక్తి రూపాలను వ్రాయండి.

సప్తమవర్గం (రుధాదులు) :—

ఈ గణగణితాలైన ధాతువులు ఇరవైయైదు మాత్రమే. ఆవర ణార్థకమైన రుధిర్, ఖదిర్ (విదారణ), భిదిర్ (ద్వైధీకరణం) యోగార్థకమైన యుజిర్, వేష్టనార్థకమైన కృతీ. పాలనాభ్య వ్యవహా రార్థకమైన భుజ, క్లేదనార్థకమైన ఉందీ అనేది ప్రధానంగా గుర్తింప దగినవి. ప్రయోగరూఢి గాంచినందున భాషలో తరచు వినవొతాయి యీ ధాతువులూ, వీటి నుంచి నిష్పన్నాలైన కృదంతాలూను.

ఈధాతువులన్నీ ఇంచుమించుగా హలంతాలు. ఈ ధాతువుల కంతంలో చేరే వికరణప్రత్యయం తుది అచ్చునకు పరంగా చేరాలని నియమం ఒకటుంది. ఈ గణగణితాలైన ధాతువులపై 'శ్నమ్' అనే ప్రత్యయం రుదాదిభ్యః శ్నమ్ (3-1-78) వస్తుంది. శ్నమ్ లో తుది మకారం ఇత్సంజ్ఞకం. కాబట్టి మిదచోఽన్త్యాత్పరః (1-1-47) అనే సూత్రం వల్ల ఈ వికరణ ప్రత్యయం 'రుధ్ మొదలైన హలంత ధాతువులో 'రుధ్' అనే రెండింటికి నడుమ చేరుతుంది కాబట్టి 'రునధ్' అనే రీతిని వికరణ ప్రత్యయ సహిత/ యుక్త ధాతువు ఉంటుంది. రేఫప్రభావం వల్ల ఇక్కడి నకారానికి ణ ఆదేశంగా రషాభ్యాం నోణ స్సమాన పదే (8-4.1) అట్ కుప్

---

కుచ - సృజ — కుచతి, సృజతి

సృజించు, కుచ లో వివాదం (బాలవ్యాకరణం క్రియాపరిచ్ఛేదం)

వాఙ్నుమ్ వ్యవాయే ఒపి (8-4-2) వస్తుంది. కాబట్టి రుణధ్ అని అవుతుంది.

సప్తమవర్గ గణిత ధాతువులపై ఏర్పడే శత్రంతాలు :—

| క్రమ సంఖ్య | ధాతువు | వికరణ ప్రత్యయం | శత్రంత ప్రత్యయం | శత్రంతరూపం |
|---|---|---|---|---|
| 1 | రుధ్ | న | రుణధ్ | రుణధత్ |
| 2 | ఖిదిర్ | న | ఖినద్ | ఖినదత్ |
| 3 | చిధిర్ | న | చినద్ | చినదత్ |
| 4 | యుజిర్ | న | యున్జ్ | యునజత్ |
| 5 | కృతీ | న | కృనత్ | కృణతత్ |
| 6 | భుజ్ | న | భునజ్ | భునజత్ |
| 7 | ఉందీ | న | ఉనద్ | ఉనదత్ |

ఈ విధంగా రూపనిష్పత్తియయిన తరువాత శ్నసోరల్లోపః (6-4-111) అనే సూత్రంచే వికరణప్రత్యయ సంబంధి అకారానికి శతృ అనగా (ఏకారేత్సంజ్ఞకంగాని డిజిత్) ఙకారేత్సంజ్ఞకం పరం కాగా లోపం విహితమైనది. కాబట్టి దీనిపైన అత్ చేరితే ఖిన్దత్, రున్ధత్, యుఞ్జత్, కృన్తత్, భున్దత్, ఉన్దత్, మొదలగు ప్రాతిపదిక లేర్పడుతాయి. పది ప్రత్యయాలు (అః3, ఆ1, ఏ1, ఓః2, అమ్1, ఇ1, సు1) పరంగా ఉన్నపుడు ప్రాతిపదికతో సమానరూపంగల రున్ధత్ అనేదే అంగంగాపున రున్ధతః3, రున్ధతా1, రున్ధతే1, రున్ధతోః2, రున్ధతామ్1, రున్ధతి1, రున్ధత్సు1. అని రూపక్రమం. భ్యామ్, భిః, భ్యః పరమైనపుడు త < ద అపుతుంది.

కాబట్టి రున్ధద్భ్యామ్, రున్ధద్భిః, రున్ధద్భ్యః అని రూపాలు. సర్వ నామస్థానాలు (మొదటి అయిదు ప్రత్యయాలు) పరంకాగా తుది హల్లునకు ముందుగా పొల్లునకారం చేరుతుంది. కాబట్టి రున్ధన్త్ అని అవుతుంది. కాబట్టి రున్ధన్తౌ, రున్ధన్తః, రున్ధతమ్ అని రూపాలు. ప్రథమైకవచనంలో సంయోగాంత లోపం వస్తుంది. కాబట్టి రున్ధన్ అనే రూపం ఏర్పడుతుంది.

అభ్యాసం :—

యుఞ్జత్, కృన్తత్, భుఞ్జత్, ఛిన్దత్ అనేవానికి అంగత్రయాన్ని (మూడు అంగాలను) వ్రాయండి.

యుఞ్జత్, అనేదానికి ప్రథమా ఏకవచన బహువచన రూపాలు వ్రాయండి.

కృన్తత్ అనేదానికి చతుర్థీవిభక్తి వ్రాయండి.

భుఞ్జత్ అనేదానికి సప్తమీవిభక్తి వ్రాయండి.

ఛిన్దత్ అనేదానికి ఏడు విభక్తుల్లో మూడువచనాల్లో నిష్పన్నమయ్యే రూపాలను క్రమాన్ని పాటించి వ్రాయండి.

రున్ధతః, రున్ధద్భ్యామ్, రున్ధతోః, రున్ధతా అనే శబ్దరూపాలే యే విభక్తివచనాంతాలో వివరించండి.

రున్ధతా, రున్ధతే, రున్ధతి, రున్ధత్సు అనే వీనిలో గల పదాంశా లను వేరువేరుగా నిరూపించండి.

## అష్టమవర్గం (తనాదులు)

ఈ వర్గంలో పరిగణితాలైన ధాతువులు పది మాత్రమే. విస్తారార్థకమైన తనుకరణార్థకమై కృఞ్ చాల ఎక్కువ ప్రాచుర్యాన్ని పొందినధాతువు. అవబోధనార్థకమైన మను అనేది కూడ ప్రసిద్ధమే.

వీనిలో తన్, మన్ అనేవి తను, మను అనే ఉకారాంతాలకు ప్రక్రియాదశలో నిష్పన్నాలయ్యే ధాతువులు. 'కృ' అనేది మాత్రం అజంతం. తక్కిన రెండు (తన్, మను) హలంతధాతువులు. ఈ ధాతువులపై చేరే వికరణప్రత్యయం 'ఉ' అనేది.

| క్రమ సంఖ్య | ధాతువు | వికరణ ప్రత్యయం | శతృ ప్రత్యయం | శత్రంత రూపం |
|---|---|---|---|---|
| 1 | తన్ | ఉ | అత్ | తన్వత్ |
| 2 | మన్ | ఉ | అత్ | మన్వత్ |
| 3 | కృ < కుర్ | ఉ | అత్ | కుర్వత్ |

తను (తన్ + ఉ), మను, కురు. అనే ఉకారాంతాలకు అకారాది ప్రత్యయం (అత్) పరమయినందున యణాదేశ (ఉ < వ్) సంధి వచ్చినట్లు గుర్తించగలం. శతృ అనే ప్రత్యయంలో ఏకారేతరాలైన (శకార ఋకారాదులు) ఇత్సంజ్ఞకాలుగా ఉన్నాయి. పకారేతర ఇత్సంజ్ఞకం జిత్ గ పరిగణిత మవుతుంది. శకారేత్సంజ్ఞకం సార్వధాతుకం. సార్వధాతుకానికి సంబంధించిన జకారేత్సంజ్ఞకం అంటే పరంగా ఈ సందర్భంలో అత్ పరంగా ఉన్నపుడు కృఞ్ లోని అకారానికి ఉకారం ఆదేశంగా వస్తుందని ''అతః ఉత్సార్వ

ధాతుకే'' (6-4-110) అనే సూత్రం ప్రతిపాదించింది. అయితే ఇక్కడ కృ సహజంగా ఋకారాంతం. కాని, ''ఉ'' పరమయి నందున గుణం వచ్చి కర్ అని అకార వంతమయింది. ఈ అకారానికి పై సూత్రంచే 'ఉ' రాగా 'కుర్' అని అవుతుందని గ్రహించాలి.

అభ్యాసం :—

ప్రాతిపదికతో భేదం లేని అంగం తన్వత్, కుర్వత్ మొదలైనవి. పది ప్రత్యయాలు పరం కాగా ఉంటుంది. సర్వనామస్థానాల్లో మొదటి అయిదు పత్యయాలు పరంకాగా పొల్లు నకార యుక్తమైన తన్వన్త్ అనేది ఈ నాదాక్షరమగు భకారాది ప్రత్యయాలారు పరమయినప్పుడు ప్రాతిపదిక అంతం లోని 'త్' కారం 'ద్' గా మారుతుంది. ఇంతకు మించిన మార్పులేమియు లేనందున తన్వత్, మన్వత్, కుర్వత్, అనే మూడు వచనాల్లోను రూపాలను క్రమానుసారంగా వ్రాయండి.

కుర్వత్ అనే శత్రంతరూపంలో గల పదాంశాలను వివరించి ఆ పదాంశాలు ప్రాతిపదికగా మారటంలో గుర్తింపదగిన మార్పును గూర్చి వ్రాయండి.

తన్వతః అనేది ఏయే విభక్తివచనాల్లో వస్తుందో వివరించునది. మన్వతామ్ అనేదానిలో గల పదాంశాలను నిరూపించండి. కుర్వత్సు అనేది ఏ విభక్తివచనం?

నవమవర్గం (క్ర్యాదులు).—

ఈ గణంలో అరవై పైగా ధాతువులు నమోదై ఉన్నాయి. క్రీ (క్రయం), ధూ (కంపనం), జ్యా (వయోహాని), జ్ఞా

(ఏరుగుట), బన్ధ (బంధనం) క్షుభ్ (సంచలనం), పుష్ (పోషణ) అనేవి ప్రధానగణ్యాలు. వీనిపై శతృంతరూపాలీ క్రింది విధంగా ఏర్పాటవుతాయి.

| క్రమ సంఖ్య | ధాతువు | వికరణ ప్రత్యయం | శతృ ప్రత్యయం | శత్రంతం |
|---|---|---|---|---|
| 1 | క్రీ | నా | అత్ | క్రీణత్ |
| 2 | ధూ | నా | అత్ | ధూనత్ |
| 3 | జ్యా | నా | అత్ | జ్యాణత్ |
| 4 | జ్ఞా | నా | అత్ | జానత్ |
| 5 | బన్ధ | నా | అత్ | బధ్నత్ |
| 6 | క్షుభ్ | నా | అత్ | క్షుభ్నత్ |
| 7 | పుష్ | నా | అత్ | పుష్ణత్ |

షకారంతో కలిసియున్నందున వికరణప్రత్యయమగు 'న' 'ణ' గా మారింది. జ్యా లో ఋకారానికి పరంగా ఉన్నందున నకారం (వికరణ ప్రత్యయ సంబంధి)ణకారంగా మార్పు చెందింది.

శతృ ప్రత్యయాన్ని ఙకారేత్సంజ్ఞకంగా [సార్వధాతుక మపిత్ 1-2-4] గుర్తించినందున ఈ సందర్భంలో 'శ్నా' అనే వికరణ ప్రత్యయ సంబంధి 'నా' అనేదానిలో దీర్ఘమైన 'ఆ' కారం లోపించి నందున క్రీన్ + అత్ = క్రీణత్ (ణత్వం) ధూనత్, జృణత్, జానత్ మొదలగు రూపాలేర్పడుతాయని తెలియనగును. క్రీ అనే ధాతువునకు ద్రవ్య వినిమయం అర్థం. నాణాలు, డబ్బు లేని

కాలంనాటి వినిమయాన్ని తెలియజేసేదీ ధాతువు. నేడు ధనం నాణేలున్నందున అమ్మకం సాధ్యమయింది.

అభ్యాసం:—

"క్రీణత్" అనే శత్రంతంపై నిష్పన్నమయ్యే "క్రీణన్" అంటే అమ్మేవాడు, వర్తకుడు అని అర్థం. 'ఇద్దరు వర్తకులు/ ఇద్దరువర్తకులను' అంటే 'క్రీణన్తౌ' అని చెప్పితే సరిపోతుంది. వర్తకులు, వర్తకులను, వర్తకుల వలన, వర్తకులయొక్క, వర్తకుని యందు అనేవానికి సరైన సంస్కృత పదాలను వ్రాయండి.

'ధూనత్' అంటే 'కదిలే' అని అర్థం. కదలుచున్నవారు., కదలుచున్న వారి కొరకు, కదలుచున్నవారి వలన, కదలుచున్న వానిని, కదలుచున్న వారి యందు, అనేవానికి సమానార్థకాలైన సంస్కృత పదాలను వ్రాసి చూపండి.

జానత్, పుష్ణత్, జ్యాణత్ అనే వానికి ఏడు వచనాల్లో మూడు విభక్తుల్లో ఏర్పడే రూపాలను క్రమం తప్పకుండా వ్రాయండి.

దశమ గణ గణితములు (చురాదులు)

ఈ వర్గానికి చెందిన ధాతువులు నాల్గునూర్లకు పైన పది ఉన్నాయి. భ్వాది వర్గం తరువాత (1035) ఈ గణంలో పరిగణితాలైన ధాతువుల సంఖ్య అధికం. అన్ని గణగణితాలకు ప్రథమ వర్గంలో గతార్థమైన భ్వాదులకు వచ్చే 'శప్' వస్తుంది. దానికి తృతీయగణంలో 'శ్లు' వస్తుంది. చతుర్థాది గణాల్లో 'య' మొదలగునవి 'శప్' కు ఆదేశాలవుతాయి. దివాదిభ్యఃశ్యన్ (3-1-69) శపోఽపవాదః కాని, దశమగణగణితంలో ణిచ్, శప్‌కు ఆదేశంగా కాక ఆగమంగా (3-1-25) వస్తుంది. ప్రథమ గణంలో వచ్చే శప్ (అ) కూడ ఉంటుంది కాబట్టి వికరణప్రత్యయం 'అయ' (ఇ+అ) అని ఉంటుంది.

| క్రమ సంఖ్య | ధాతువు | వికరణ ప్రత్యయం | శత్రంత ప్రత్యయం | శత్రంతరూపం |
|---|---|---|---|---|
| 1 | చుర్ | అయ | అత్ | చోరయత్ |
| 2 | భక్ష | అయ | అత్ | భక్షయత్ |
| 3 | వర్ణ | అయ | అత్ | వర్ణయత్ |
| 4 | తడ | అయ | అత్ | తాడయత్ |
| 5 | మడి | అయ | అత్ | మండయర్ |
| 6 | కథ | అయ | అత్ | కథయత్ |
| 7 | భూష | అయ | అత్ | భూషయత్ |

ఉపధాస్థానంలో లఘువు గల చుర్ లోని ఉకారానికి 'పుగంత లఘూపథస్య చ' (7-3-86) అనే సూత్రంచే గుణం ప్రాప్తించింది. భూష్ అనే ధాతువులో ఉపధాస్థానంలో లఘువుగాక గురువు అంటే (దీర్ఘం) ఉన్నందున గుణానికి ప్రాప్తిలేదు. వికరణప్రత్యయ సంబంధి అకారానికి (అయ లో తుది అకారం) శతృ ప్రత్యయాది అకారానికి అతోగుణే (6-1-97) అనే సూత్రం చేత పూర్వరూపం ఏకాదేశంగా వచ్చిందని గుర్తించాలి.

అభ్యాసం :—

'చోరయత్' అనేదాన్ని పదాంశాలుగా విడదీయండి. ఉపధా గుణం భూష్ అనే ధాతువులో రాక పోవటానికి కారణం ఏమి? "అయ" అనే వికరణ ప్రత్యయంలో గల పదాంశాలను వివరించండి.

చోరయత్ అనే దానికి ఏర్పడే అంగత్రయాన్ని వ్రాయండి.

దొంగిలించు వానికి, దొంగిలించు వానిని, దొంగిలించు వాడు, దొంగిలించు వారి యందు, దొంగిలించువారివలన అనే ఈ పదబంధాలను సంస్కృతంలో (చోరయత్) చెప్పండి.

కథయత్, మండయత్, తాడయత్, అనే వానికి ఏడు విభక్తుల్లో మూడు వచనాల్లో ఏర్పడే రూపాలను క్రమనుసారంగా వ్రాయండి.

## శత్రంతాల్లో సప్తమ్యేకవచనం

దశగణ గణితాలైన ధాతువులనుండి ఏర్పడిన శత్రంతాలకు, ఇకారం చేరినందున సప్తమీ ఏకవచనరూపం ఏర్పడుతుంది.

భ్వాది (ప్రథమగణం) లో భవత్, గచ్ఛత్, పిబత్ మొదలగు శత్రంతాలపై 'ఇ' చేరి నందున భవతి, గచ్ఛతి, పిబతి మొదలగు సప్తమీ ఏక వచన రూపాలేర్పడుతాయి.

అదాది (ద్వితీయ) గణగణితాలైన శాస్, అస్, మొదలగు ధాతువులపై శతృప్రత్యయం చేరినందున శాసత్, సత్ ఇత్యాదిగ శత్రంతాలేర్పడుతాయి. వీటిపై సప్తమీ ఏకవచన ప్రత్యయం చేరి నందున శాసతి, సతి మొదలుగసప్తమ్యంతాలేర్పడుతాయి.

తృతీయ (జుహోత్యాది) గణగణితాలైన ధాతువులపై ఏర్పడే శత్రంతరూపాలైన జుహ్వత్, బిభ్యత్ మొదలైనవి అంతంలో ఇకారాన్ని గ్రహించి జుహ్వతి, భిభ్యతి మొదలైన రీతిగా సప్తమీ విభక్తి ఏకవచన ప్రత్యయాంతా లేర్పడుతున్నాయి.

నాలుగో (దివాదులు) వర్గపరిగణితాలైన ధాతువులపై నుండి నృత్యత్, సహ్యత్, మొదలగు శత్రంతాలపై ఇకారం చేరి నందున నృత్యతి, సహ్యతి మొదలగు సప్తమీ ఏకవచన రూపా లేర్పడుతాయి.

అయిదో వర్గానికి చెందిన షు, చి, ధు మొదలగు వాటి నుంచి ఏర్పడే సున్వత్, చిన్వత్, ధున్వత్ మొదలగు శత్రంతాలకు సప్తమీ విభక్తి ఏకవచనంలో సున్వతి, చిన్వతి, ధున్వతి మొదలగు రూపాలేర్పడుతాయి.

తుద, దిశ, లిఖ మొదలగు షష్ఠ గణగణిత ధాతువులకు తుదత్, దిశత్, లిఖత్ ఇత్యాదిగ శత్రంతరూపాలూ, తుదతి, దిశతి, లిఖతి మొదలగు రీతిని సప్తమీ ఏకవచన రూపాలూ ఏర్పడుతాయి.

రుధ్, యజ్ మొదలగు సప్తమ గణగణితాలపై శత్రంతాలు రున్ధత్, యున్జత్ అనే రీతిని ఏర్పడుతాయి. కాబట్టి వీటికి సప్తమీ ఏకవచనం రున్ధతి, యున్జతి, ఇత్యాదిగ ఏర్పడుతాయి.

అష్టమ గణగణితాలైన తన, కృ మొదలగు వానిపై కుర్వత్ తన్వత్ ఇత్యాదిగ శత్రంతాలూ కుర్వతి, తన్వతి అని సప్తమీ ఏకవచన రూపాలేర్పడుతాయి.

తొమ్మిదో వర్గానికి చెందిన క్రీ, జ్ఞా మొదలగు ధాతువుల నుండి క్రీణత్, జానత్, అని శత్రంతాలూ, క్రీణతి, జానతి ఇత్యాదిగ సప్తమీఏకవచన ప్రత్యయాంతాలు ఏర్పడుతాయి.

చుర్, కథ్ మొదలగు వాటికి శత్రంతాలు చోరయత్, కథయత్ ఇత్యాదిగాను సప్తమీ ఏకవచన రూపాలు చోరయతి, కథయతి అని ఏర్పడుతాయి.

శత్రంత సప్తమీ ఏకవచన రూపాల నుండి క్రియా పదాలు

ప్రథమ, చతుర్థీ, షష్ఠ మరియు దశమగణగణితాలైన ధాతువుల నుండి ఏర్పడిన శత్రంతాలకు సప్తమీ ఏకవచన రూపమే ఆధాతువులకు వర్తమానార్థక (లట్) ప్రథమపురుష ఏకవచన రూపాలు. దీన్నే వ్యాకర్తలు Structural ambiguity అంటారు.

## GROUP — I

భవతి, నృత్యతి, తుదతి, చోరయతి మొదలైనవి సుబంతాలా తిజంతాలా అనే విషయంలో అస్పష్టత వస్తుంది. ప్రయోగాల కర్థం సందర్భానుసారంగా ఉంటుంది. గాబట్టి ఈ యస్పష్టత తొలగిపోతుంది.

## GROUP — II

అయిదు, ఏడు, ఎనిమిది మరియు తొమ్మిదో గణగణితాలైన ధాతువుల నుండి ఏర్పడిన శత్రంతరూపాల సప్తమీఏకవచన ప్రత్యయాలల్లో తుది 'తి' కి మునుపు పొల్లునకారం చేరినంత మాత్రాన సున్వతి < సున్వన్తి, రున్ధతి < రున్ధన్తి, కుర్వతి < కుర్వన్తి, క్రీణతి < క్రీణన్తి అనే జంటల్లో మొదటిది శత్రంతానికి సప్తమీ ఏకవచన రూపం. రెండోది (నకార యుక్తం) ఆ ధాతువుకు లట్ ప్రథమావిభక్తి బహువచన రూపం.

అస ధాతువు అసతి సప్తమీవిభక్తి ఏకవచన రూపంలో 'న్' కలిపితే అసన్తి. తద్ధాతువు లట్ ప్రథమావిభక్తి బహువచన రూపం.

## GROUP — III

రెండు మూడు వర్గాలకు చెందిన ధాతువులపై ఏర్పడిన శత్రంత రూపాలు తద్ధాతుజన్య "లట్" ప్రథమావిభక్తి బహు వచన రూపాలతో తుల్యంగా ఉంటాయి. శాసతి = శాసతి బిభ్యతి = బిభ్యతి అంటే శత్రంత ప్రాతిపదిక సప్తమీవిభక్తి ఏకవచన రూపం తద్ధాతువునకు లట్ ప్రథమావిభక్తి బహువచన రూపంతో అభిన్నతను సమీకరణ సూచక (=) మైనగుర్తు తెలియ జేస్తుంది.

# PART - IV

## క్రియారూప నిష్పత్తి

లట్ పరస్మైపదం :—

సంస్కృతంలో పరస్మైపద ధాతువులపైన మాత్రమే శతృ ప్రత్యయం చేరుతుంది. ఆత్మనే పదాలపైన శానచ్ (ఆన) చేరుతుంది. మోదమాన, వందమాన మొదలగు ఉదాహరణాలు. ధాతువు ఉభయపదం అయితే రెండు చేరుతాయి. రమత్, రమమాణ మొదలగునవి ఉదాహరణాలు.

మనమింతవరకు పరస్మైపద ధాతువులను గూర్చియే నేర్చుకుంటున్నామని గ్రహించాలి. పైన మనం గుర్తించిన లట్ రూపాలు గూడ పరస్మైపదాలని గ్రహించాలి.

పరస్మై పదధాతువులపై లట్ లో చేరే ప్రత్యయాలీ క్రింద గమనించండి.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమ పురుష | తి | తః | అన్తి |
| మధ్యమ పురుష | సి | థః | థ |
| ఉత్తమ పురుష | -మి | -వః | -మః |

ప్రక్రియాదశలో గుర్తింపదగిన ప్రత్యయాలివి ప్రత్యయాది మకార వకారాలు పరంగా ఉంటే, అతో దీర్ఘోయఞి (7-3-101) అనే సూత్రంచే యఞ్ ప్రత్యాహారాక్షరములయిన 'మ', 'వ' అనేవి పరంకాగా అకారాంతమైన అంగంలోని తుది స్వరానికి దీరం వస్తుంది.

ప్రథమ దశగణగణితాలైన శత్రంతాల సప్తమీవిభక్తి ఏక వచనప్రత్యయాంతం ఆయా ధాతువులకు 'లట్' ప్రథమావిభక్తి ఏక వచన రూపంగా గుర్తించాం. భవతి, చోరయతి మొదలగునవి ఏక వచనాంతాలు. ఏకవచన ప్రత్యయమైన 'తి' అనే దాన్ని వీటి నుంచి తొలగిస్తే భవ, చోరయ ఇత్యాదిగ అంగాలుంటాయి. వాటికి పై ప్రత్యయాలను చేర్చగా ఈ ధాతుజన్యాలయిన లడ్రూపా లను మనం కల్పించ గలుగుతాం.

## GROUP — I

భవతి, నృత్యతి, తుదతి, చోరయతి అనే క్రియారూపాల్లో తుది -'తి' పురుషవచన ప్రత్యయం. దీన్ని తొలగించినంత మాత్రాన అంగం భవ, నృత్య, తుద, చోరయ అని పరిశేషి స్తాయి, [భవతి - తి = భవ and so on) భవ అనే అంగం పై తః చేరినందున 'భవతః' అని సిద్ధిస్తుంది. దీనిపై 'అన్తి' అనే ప్రత్యయం చేరినందున పరరూపం వచ్చి 'భవన్తి' అని ఏర్పడుతుంది.

అలాగే మధ్యమపురుష ప్రత్యయాలు సి, థః, థ అనేవి చేరగా భవసి, భవథః, భవథ అని అవుతుంది, ఉత్తమపురుష ప్రత్యయాలు పరంకాగా అంగం తుదిస్వరం దీర్ఘమవుతుంది. కాబట్టి 'భవా' అని ఉంటుంది. దీనిపై 'మి' చేరగా 'భవామి' 'వః' చేరినందున భవావః, మః చేరినందున భవామః అని రూపాలేర్పడుతాయి.

అలాగే తక్కిన నృత్య -తి, తుద -తి, చోరయ -తి మొదలగునవి.

| అంగాలు | | | | |
|---|---|---|---|---|
| | నృత్య | నృత్యతి | నృత్యతః | నృత్యన్తి |
| | | నృత్యసి | నృత్యథః | నృత్యథ |
| | నృత్యా | నృత్యామి | నృత్యావః | నృత్యామః |
| | తుద | తుదతి | తుదతః | తుదన్తి |
| | | తుదసి | తుదథః | తుదథ |
| | తుదా | తుదామి | తుదావః | తుదామః |
| | చోరయ | చోరయతి | చోరయతః | చోరయన్తి |
| | | చోరయసి | చోరయథః | చోరయథ |
| | చోరయా | చోరయామి | చోరయావః | చోరయామః |

అభ్యాసం:—

ఈ క్రింది ప్రథమగణగణితాలైన కొన్ని ధాతువుల నిచ్చి యుంటిని. వానికి శత్రంత రూపాన్ని వ్రాయండి.

గద, చల, ఘూర్ణ, మీల, ఫల, జీవ, ధ్వన, నమ, శిక్ష, నట, జ్వల, సహ, స్మృ, త్యజ, తప, వహ, దహ. ఉదాహరణ కు ధాతువు గద్ అనేది హలంతం. దీన్ని అజంతంగా గ్రహించినా

(గద) తప్పుగాదు. ప్రథమగణంలో చేరే వికరణప్రత్యయం అకారం. దీనివల్ల పూర్వాచ్చుకు గుణాదులు వస్తాయి. కాబట్టి గద్+అ+ అత్ అని ఏర్పడిన యనంతరం పూర్వరూపం ఏకాదేశ మయినందున 'గదత్' అని రూపం ఏర్పడుతుంది.

'శతృ' అనే ప్రత్యయం ఆదిలో శ్ కారం, అంత్యంలో గల ఋకారం ఇత్సంజ్ఞకము లయినందున లోపిస్తాయి, కాబట్టి ఈ ప్రత్యయం ప్రక్రియాదశలో 'అత్' అని మిగులు తుందని మనం ఇంతకుముందే గ్రహించాం.

అభ్యాసం:—

ఈ విధంగా ఏర్పడిన శత్రంతాలకు సప్తమీ ఏకవచన ప్రత్యయ సహిత రూపాన్ని వ్రాయండి. గదత్ మొదలగు హలంతవర్గాలకు చెందిన ప్రాతిపదికలకు సప్తమీవిభక్తి ఏకవచనంలో వచ్చే ప్రత్యయం "ఇ" అనేది. ఈ ప్రత్యయం పరంకాగా ప్రాతిపదిక అంతంలో ఎలాంటి మార్పు రానందున రూపం గదత్ + ఇ = గదతి ఇత్యాదిగ తయారవుతుంది.

ఈ గదతి అనే సప్తమ్యంతం 'గద్' అనే ఈధాతువునకు లట్ ప్రథమపురుష ఏకవచనంలో ఏర్పడే రూపంతో అభిన్నం. గదతి. బహ్వర్థకంగాకున్నా ద్వ్యర్థకం. గద్ + అ + అత్ = గదత్ అనేదానిపై ''ఇ'' చేరినందున 'గదతి' అనే సప్తమీవిభక్తి ఏకవచన ప్రత్యయాంతం ఏర్పడింది. 'చెప్పు' లేదా 'పలుకుచున్న వానియందు' అని దీనికర్థం,

రెండోది గద్ + అ + తి అనేపదాంశ ఘటితం. మొదటి రెండు పదాంశాలు తుల్యార్థకాలే సుబంతంలో నాల్గు పదాంశా లుండగా తిఙంతంలో మూడే పదాంశాలున్నాయి, శత్రంతంలో

చివరి తకారం విభక్తి ప్రత్యయమైన 'ఇ' తో చేరినందున మొదటి పదంలో 'తి' విడదీయరాదు. అందది ఒక పదాంశం కానేకాదు.

రెండోదానిలో 'తి' ఒక పదాంశం. దీన్ని విధంగా విడదీయ వచ్చును. ఈ విధంగా నిర్మాణంలో వైవిధ్యం ఉంది. అర్థం విషయంలో భేదం ఉంది. అంతేగాక, రూపం విషయంలో భేదమేమాత్రము లేదు. ఇలాంటి వాటిని ambiguity అని పేర్కొనటం గలదు. ఈ అస్పష్టతకు పద నిర్మాణం కారణమయినందున దీన్ని నిర్మాణాత్మక అస్పష్టత (Structural ambiguity) అంటారు.

ఈ యస్పష్టత సుబంతాల మూలంగా తిజంత రూపాల నిష్పత్తిని నేర్చుకోవటంలో మనకు తోడ్పడుతుంది. 'గదతి' అనే క్రియాపదంలో 'తి' ఒక పదాంశం. ప్రథమ పురుష ఏకవచనం. ఈ పదాంశం చెప్పగలిగి ఉంది.

"The real sense of this term referring to a word or sentence which express more than one meaning" 1

సుబంతమైన 'గదతి' చెప్పుచున్నవాని యందనే అర్థాన్నియ జాలి ఉంది. తిజంతమైన 'గదతి' కి చెప్పుచున్నాడు అనే అర్థం సిద్ధిస్తుంది. తిజంతంలో గద-తి అని భాగం. ఇక్కడ అంగం "గద" అనేది. ఉత్తమ పురుష ప్రత్యయాలు మూడు పరం అయినవుడు అంగం 'గదా' అని దీర్ఘాంతంగా ఉంటోంది. తక్కిన ప్రత్యయాలు ఆరు పరంకాగా అంగం 'గద' అనేది.

గద + తి = గదతి. గద + తః = గదతః. గద + అన్తి = గదన్తి (పూర్వరూపం వచ్చినందున) గద + సి = గదసి, గద + థః = గదథః. గద + థ = గదథ అని రూపాలు.

---

1. Linguistics and Phonetics — David Crystal (P. 15)

ఉత్తమపురుష రూపాలైన మి, వః, మః, అనేవి పరం అయినప్పుడు అంగం దీర్ఘాంతమవుతుంది. కాబట్టి గదామి, గదావః గదామః అని రూపక్రమం.

అభ్యాసం :—

నేను, నన్ను మొదలైన (అహంభావనతో) మాటలతో వ్యక్తి సృష్టినర్థం చేసుకో ప్రయత్నిస్తాడు. అంతేగాక ఆంగ్లాది సంప్రదాయంలో ఉత్తమపురుష (first person) తరువాతనే మధ్యమ, ప్రథమాదుల సంగతి. Bhandarkar ఇత్యాది పండితులు తమ తమ సంస్కృతభాషాబోధినిలో ఉత్తమ, మధ్యమ, ప్రథమ పురుషలను యిచ్చారు. ప్రాచీన పండితులంతా ప్రథమ, మధ్యమ, ఉత్తమ క్రమాన్ని తమ వ్యాకరణాదుల్లో పాటించారు. ఇందులో గూడ అనూచానమైన ఆ పద్ధతియే పాటించబడినట్లు గుర్తించగలరు.

పై ధాతువుల కన్నింటికి ఈ విధముగ అంగద్వయమును గుర్తించి పరినిష్ఠిత ప్రత్యయములను చేర్చి పురుషవచన క్రమంలో రూపాలను వ్రాయండి.

చతుర్థ గణగణితములైన ధాతువులకు శత్రంత రూపం నృత్యత్ (నృత్ + య + అత్) ఇత్యాదిగ అవుతుంది. కాబట్టి దీనికి సప్తమీ ఏకవచన ప్రత్యయాంతం (నృత్యత్ + ఇ = నృత్యతి)అని ఉంటుంది. ఇదే లట్ ప్రథమ ఏకవచన ప్రత్యయాంతం. దీనిలో 'తి' ని వేరుచేస్తే లట్ లో అంగం 'నృత్య' అని ఆరు ప్రత్యయాలు పరంకాగా మిగిలిన ప్రత్యయత్రయం పరమైనపుడు అంగం 'నృత్యా' అని దీర్ఘాంతంగా ఉంటుంది.

ఈ క్రింది చతుర్థగణగణిత ధాతువులకు శత్రంతరూపాలన్నీ అనంతరం సప్తమీఏకవచన రూపాన్నీ వ్రాసిదానిలోని తుది 'తి' అనేదాన్ని వేరుచేసి 'లట్' ప్రథమ, మధ్యమ పురుష ప్రత్యయాలు

పరం అయినపుడు వచ్చే అంగాన్ని (నృత్య మొ॥) దాని కంత్య స్వరదీర్ఘంగల (నృత్యా మొ॥) గల్పించి నిర్దిష్ట ప్రత్యయాలను చేర్చి క్రియారూపాలను పురుషవచన క్రమంలో వ్రాయండి.

చతుర్థగణ గణితధాతువులు :—

త్రసీ (త్రస్), ఇష్, సహ్, పుష్, తృష్, శ్లిష్, నశ్, ముహ్, క్రుధ్, క్షమ్, కృశ్, హృష్, కుప్, క్షుభ్

షష్ఠ గణగణితాలు :—

'తుద' మొదలగు ఈగణంలో చేరే ధాతువులు దీనిపై శత్రంతరూపం తుదత్ (తుద + అ + అత్) అని ఏర్పడుతుంది. దీనికి సప్తమీవిభక్తి ఏకవచనరూపం 'తుదతి' అని అవుతుంది. ఈసుబంతానికి 'బాధపడుచున్నవారి యందు' అని అర్థం. ఇదే రూపం ఈధాతుజన్యమైన లట్ ప్రథమావిభక్తి ఏకవచనరూపంగా కూడ ఉంటుంది. తుదతిఅనే తిజంతానికి 'బాధపడు చున్నవాడు' అని యర్థం, ఇందులో తుద—తి పురుషవచనబోధకం. దీన్ని తొలగించగా 'తుద' అనే అంగం ఒకటి (ప్రథమ మధ్యమ పురుషల్లోను) దీర్ఘాంతమైన తుదా- అనేది ఉత్తమ పురుషలోను ఉంటుంది. కాబట్టి రూపక్రమాన్ని పురుషవచన వివరణాత్మకంగా మనం నిష్పన్నం చేయగలం.

ఈ వర్గానికి చెందిన ఈ క్రింది ధాతువులకు పురుషవచన క్రమానుసారంగా అన్ని (తొమ్మిది) రూపాలను వ్రాయండి.

గమనిక :—

అంగం నిర్ణయంగాకపోతే ముందుగా శత్రంతాన్ని అనంతరం

దాని సప్తమీ ఏకవచనరూపాన్నీ నిర్మించుకుని అనంతరం ధాత్వంగద్వైవిధ్యాన్ని గుర్తించండి

దశమ గణమ్ :—

చుర్, భక్ష, వర్ణ, తడ (తా), మడి (మండ్) కథ్ ఘుష్ అనేవి దశమగణగణితాలైన ధాతువుల్లో ప్రసిద్ధాలు. వీనికి శత్రంత రూపాధులను వాని సప్తమీఏకవచన ప్రత్యయాంతాన్ని కల్పించి ఆ రూపంతో అభిన్నమైన లట్ ప్రథమ ఏకవచనప్రత్యయ సహితాన్ని గుర్తించి యందలి (తుద - తి) పురుషవచన బాధకాన్ని వేరు చేసి మొదటి యంగాన్ని (ఆరు ప్రత్యయాలుండగా) ఆ యంగం అంత్యస్వర దీర్ఘంతో రెండో (మూడు ప్రత్యయాలు) అంగాన్నీ కల్పించి పై ధాతువులకు లట్ రూపాలను పురుషవచన క్రమంలో వ్రాయండి.

చుర్ + అ + అత్ = చోరయత్

చోరయత్ + ఇ = చోరయతి

ఇందలి పురుషవచన బోధకమైన "తి" ని మినహాయించగా చోరయ అనే అంగం (ఆరు ప్రత్యయాలు) అంత్యస్వరం దీర్ఘత వల్ల చోరయా (మూడు ప్రత్యయాలు) అనే రెండో అంగం సిద్ధిస్తాయి. ఈ క్రమం వల్ల నిర్దిష్టరూపాలను సులువుగా వ్రాయగలం.

ద్వితీయ, తృతీయ, పంచమ, సప్తమ, అష్టమ, మరియు నవమ, గణప్రగణితాలైన ధాతువుల శత్రంత రూపాల సప్తమీ ఏక వచన ప్రత్యయాంతంలో ద్విషతి, జుహ్వతి, సున్వతి, రున్ధతి, కుర్వతి, క్రీణతి, అనే వానికి అంతంలో గల 'తి' కి మునుపు పొల్లు నకారాన్ని చేర్చినందున ఏర్పడే ద్విషన్తి, జుహ్వన్తి, సున్వన్తి, రున్ధన్తి, కుర్వన్తి, క్రీణన్తి అనేవి ఆయా ధాతువునకు లట్ ప్రథమ పురుష బహువచన రూపాలు. వీటిల్లో నుంచి బహువచనప్రత్యయ

మైన 'అన్తి ని' తీసివేయగా అంగం ఈ క్రింది విధంగా నిష్పన్న మవుతుంది. యాన్తి — అన్తి = యా; జుహ్వాన్తి – అన్తి = జుహు, సున్వన్తి - అన్తి = సును, రున్ధన్తి – అన్తి = రున్ధ్ కుర్వన్తి — అన్తి = కురు, క్రీణన్తి -అన్తి = క్రీణ

ద్వితీయగణగణితాలు .—

అంగము యా. వా, స్నా. ఈ గణంలో చేరే అంగాలకు రూప ద్విర్భావం లేదు. ఇవి సహజంగా దీర్ఘాంతాలయినందున పురుష వచన బోధక ప్రత్యయాలు (లట్) చేరినపుడు వీనిపై రూపనిష్పత్తి సులభము.

| | | |
|---|---|---|
| యాతి | యాతః | యాన్తి |
| యాసి | యాథః | యాథ |
| యామి | యావః | యామః |

అభ్యాసం:—

వా, స్నా, లా, రా, శ్రా మొదలైన (దీర్ఘాంతాలైన) ద్వితీయ గణగణితాలకు వర్తమానకాలబోధకప్రత్యయాలను చేర్చి రూపాలను యథాక్రమంగా వ్రాయండి.

స్తోత్రార్థకమైన 'ను' మరియు "స్తు" అనే ధాతువులు 'కు' (శబ్దార్థకం) అనేది గూడ ద్వితీయగణగణితాలే. వీటికి (ప్రథమ, ఉత్తమ, మధ్యమ) మూడు పురుషల్లో ఏకవచనరూపం పరం కాగా ధాతువులోని ఉ = ఔగా మారుతుంది. దీన్ని వృద్ధి అంటారు. ప్రథమా బహువచనంలో పరం కాగా 'ఉవ్' ఆగమంగా వస్తుంది. 'కౌ' 'కు' అని రెండు అంగాలు.

| కౌతి | కుతః | కువన్తి |
|---|---|---|
| కౌషి | కుథః | కుథ |
| కౌమి | కువః | కుమః |

మధ్యమ పురుషైక వచనమైన సి, కి, షి ఆదేశంగా వచ్చింది. అకారము తప్ప మిగిలిన అచ్చులకు పరంగా ఉన్న స, ష అవుతుందనే నియమం వల్ల ఈ మార్పు వచ్చింది. ఉత్తమ పురుష ద్వి బహువచనాల్లో వ కార మకారాది ప్రత్యయాలు పరంగా ఉండగా పూర్వమందలి హ్రస్వానికి దీర్ఘంరాదు. హ్రస్వమైన (అతో దీర్ఘో యఞి 7-3-101) అకారానికి (అంగసంబంధి) మాత్రమే దీర్ఘమును విధించినందున తదితరమగు ('కు' లోని ఉకారానికి) అచ్చుకు ఈ సందర్భంలో దీర్ఘంరాలేదు.

అభ్యాసం:—
ను మరియు స్తు అనే ధాతువులకు పై విధంగా రూపక్రమాన్ని వ్రాయండి.

ద్వితీయ గణగణితాలైన ధాతువులో ఉపధాస్థానంలో అచ్చు (ఇ) గలిగి హలంతాలైన ఇణ్, ద్విష్, విద్ మొదలగు ధాతువులు కొన్ని ఉన్నాయి. ఇందులో ఒకటి అజాది మిగిలినవి రెండు హలాదులు, ఈ భేదం రూపనిష్పత్తిలో ఏవిధమైన ప్రత్యేకతను కలిగియుండలేదు. ఈ ధాతువులకు పురుషత్రయంలో గల ఏకవచన ప్రత్యయాలు పరమైతే గుణంవల్ల ధాత్వాది స్వరమయిన 'ఇ' 'ఏ' గా మారుతుంది. కాబట్టి —

| వేత్తి | విత్తః | విదన్తి |
|---|---|---|
| వేత్సి | విద్థః | విద |
| వేద్మి | విద్వః | విద్మః |

అని రూపాలేర్పడుతాయి. ప్రథమపురుష ఏక ద్వివచనాల్లో ప్రత్యయ సంబంధి'త' కారానికి ధాతుగత 'ద్' కారంలోనైంది. (ఖరిచ 8-4-55) వేద్మి. విద్మః అనే సందర్భంలో దకార మపదాంతమై నందున అనునాసికసంధి (యరో ఽ నునాసికే ఽ నునాసికోవా 8-4-45) రాలేదు.

అధ్యాసం :—

ఇణ్ మరియు ద్విష్ అనేవానికి లట్ రూపాలను వ్రాయండి.

గమనిక:—

ఇణ్ ణకార మిత్సంజ్ఞకం. ద్విష్‌లో షకార మట్లుగాదు.

శ్వస్, అన్- జక్ష్ అనేవి గూఢ ద్వితీయ గణగణతాలే. వీనికి వికరణప్రత్యయం లేదు గాని వీనికి మాత్రం 'ఇ' వస్తుంది. (రుదాదిభ్యస్సార్వధాతుకే) (7-2-76) అల్ ప్రత్యహారాక్షర మాది యందు గల సార్వధాతుకాలకే ఈ యాగమం పరిమితం. (మధ్యమ
'సి=హి) (ఆదేశంగా హి < స్వేర్హ్యపిచ్చ
చేత వస్తుంది. ఈ "హి" పరంగా ఉండే
పలు రావు) It is operative in case
only.

| | |
|---|---|
| శ్వసితః | శ్వసన్తి |
| శ్వసిథః | శ్వసిథ |
| శ్వసివః | శ్వసిమః |

'అన్తి' అనే దానికాదిలో వల్
వని ఆది యందు లేనందున "ఇ"

అకారేతరాచ్ఛయినందున మకారాలు పరంగా ఉండగా "శ్వసి - మి" ఇత్యాదుల్లో దీర్ఘంరాలేదు.

అభ్యాసం:—

అన్. జక్ అనే ద్వితీయ గణగణిత ధాతువుల కీవిధముగ రూపములను తొమ్మిదింటిని యథాక్రమముగ వ్రాయునది.

తృతీయ గణగణితములు:—

హు, భృ, హా, దా అనేవీ వర్గంలో గణింపదగినవి. వీనికి ద్విత్వం వస్తుంది కాబట్టి జుహు, బిభృ, జహా, దదా అని ధాతువు లుంటవి. జుహు అనేదానికి మూడు పురుషల్లో ఏకవచన రూపాలు పరంకాగా గుణంవల్ల 'హు' లో ఉ = ఓ గా మారుతుంది. 'జుహో' అని ఒక అంగం. అభ్యాసం వచ్చిన తరువాత ఏర్పడిన జుహు కు పరంగా ఉన్న 'ఝి' కి 'అన్తి' గా 'అత్' ఆదేశమవుతుందని (అదభ్యస్తాత్ 7-1-4) అనే సూత్రం ప్రతిపాదించింది.

| | | |
|---|---|---|
| జుహోతి | జుహుతః | జుహ్వతి |
| జుహోసి | జుహుథః | జుహుథ |
| జుహోమి | జుహువః | జుహుమః |

అని రూపాలు. ప్రథమ బహువచనంలో యణాదేశం. అలాగే 'హా' కు—

| | | |
|---|---|---|
| జహాతి | జహితః<br>జహీతః | జహతి |
| జహాసి | జహిథః<br>జహీథః | జహిథ |

| జహామి | జహివః | జహిమః |
|---|---|---|
| | జహీవః | జహీమః |

అభ్యాసం :– భృ, దా అనే ధాతువులకు లట్ రూపాలను వ్రాయండి.

స్వాది తనాది ధాతురూపాలు :—

అయిదు మరియు ఎనిమిదో గణ పఠితాలైన ధాతువులకు వికరణ ప్రత్యయం 'ఉ' కారం. కాబట్టి అంగం ఉకారాంతంగా ఉంటుంది. సు + ను; తన్ + ఉ = తను. ఈ రెండు వర్గాలకు చెందినధాతువులకు శతృప్రత్యయాంతం సును + అత్ తను + అత్ (యణాదేశం) సున్వత్, తన్వత్ అని ఉంటుంది. వీనిపైన సప్తమీవిభక్తి ఏకవచన ప్రత్యయమైన ఇకారం చేరగా సున్వతి, తన్వతి అని సప్తమీ ఏకవచన ప్రత్యయాంతాలు ఏర్పాటవుతాయి. ఈ రెండు వర్గాల ధాతుజన్యాలైన పై సుబంతాల్లో తుది 'తి' అనే దానికి ముందు పొల్లునకారాన్ని చేర్చగా ఏర్పడిన సున్వన్తి, తన్వన్తి అనేవి ఆయాధాతువులకు కర్త్రర్థకం వర్తమానంలో ప్రథమ బహువచన రూపాలు. ఇందులో 'అన్తి' అనేది ప్రథమ బహువచన ప్రత్యయం గాబట్టి దాన్ని తొలగించివేస్తే సును, తను, అనేవి మిగుల్తాయి. ఈ యంగాలకు (ధాతు + వికరణప్రత్యయం) మూడు పురుషల్లో ఏకవచన ప్రత్యయాలు పరం కాగా (తి, సి) (షత్వ అకారేతరాచ్చుకు పరం అయినందున) 'మి' పరం కాగా పూర్వమందలి ఉకారానికి గుణం వల్ల 'ఓ' కారం ఆదేశమవుతుంది. కాబట్టి సునోతి, సునోషి, సునోమి, తనోతి, తనోషి, తనోమి ఇత్యాదిగ రూపాలు. తక్కిన ప్రత్యయాలు పరంకాగా మార్పులే ఉండవు.

| | పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచన |
|---|---|---|---|---|
| సు | ప్రథమ | సునోతి | సునుతః | సున్వన్తి |
| | మధ్యమ | సునోషి | సునుథః | సునుథ |
| | ఉత్తమ | సునోమి | సునువః<br>సున్వః | సునుమః<br>సున్మః |

| | పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|---|
| తన్ | ప్రథమ | తనోతి | తనుతః | తన్వన్తి |
| | మధ్యమ | తనోషి | తనుథః | తనుథ |
| | ఉత్తమ | తనోమి | తనువః<br>తన్వః | తనుమః<br>తన్మః |

అభ్యాసం :---

చి, వృ, ధు, దు, పృ, ఆప్, శక్ అనే పంచమవర్గ పరిగణితాలైన ధాతువులకు లట్ అనే లకారాంత రూపాలను పురుషవచన క్రమానుసారంగా వ్రాయండి.

తన్, కృ, మన్, తృణ్, క్షిణ్, అనే అష్టమగణగణితాలైన ధాతువులపై నిష్పన్నమయ్యే వర్తమానార్థక (లట్) క్రియా రూపాలను యథా క్రమముగ వ్రాయండి.

నవమగణ పఠితాలు :—

క్రీ, ప్రీ, గంథ్, క్షుభ్, పుష్, ముష్, గ్రహ (గృహ్) మొదలగు ఈ గణ పరిగణితాలలో ప్రధానములు. క్రీ + నా + అత్ = క్రీణత్ అని ఈ ధాతువుపై ఏర్పడే శత్రంత రూపం దీనికి సప్తమీ ఏకవచనంలో 'ఇ' చేరుతుంది కాబట్టి క్రీణతి అని ఏర్పడుతుంది. ఇందులో తుది 'త' అనే అక్షరానికి ముందు 'న' కార పొల్లు చేరిస్తే ఈ ధాతుజన్యమయిన వర్తమానార్థ ప్రథమా బహువచన రూపం క్రీణన్తి ఏర్పడుతుంది. క్రీ + ణా + అన్తి అని యుండగా (శ్నాభ్యస్తయోరాతః) (6-4-112) 'అ' కార లోపం ప్రాప్తించి నందున క్రీణన్తి' అని ఏర్పడినదని గ్రహింపవగును. ఏకవచన ప్రత్యయాలు మూడు పరంకాగా అంగంలో గుణాది సంధుల

కవకారము లేని 'క్రీణా'కి అని ఆకారాంతమంగము యినందువ మార్పు రాలేదు. ఏకవచన ప్రత్యయాలు ప్రథమా బహువచన ప్రత్యయము గాక మిగిలిన అయిదు ప్రత్యయాలు పరంకాగా 'ఈహల్యఘోః' (6-4-113) అనే సూత్రంచే ఈ కారం ఏకాదేశమైనందున అంగం ''క్రీణీ' అని ఉంటుంది.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | క్రీణాతి | క్రీణీతః | క్రీణన్తి |
| మధ్యమపురుష | క్రీణాసి | క్రీణీథః | క్రీణీథ |
| ఉత్తమపురుష | క్రీణామి | క్రీణీవః | క్రీణీమః |

అభ్యాసం :—

ప్రీ. గంధ్. క్షుభ్. పుష్. ముష్. గ్రహ్ (గృహ్) ఇత్యాది నవమ గణగణితాలైన ధాతువులకు వర్తమానార్థక రూపాలను తొమ్మిదింటిని పురుషవచన క్రమానుసారంగా వ్రాయండి.

సప్తమ గణగణితాలు :—

రుధిర్, ఛిదిర్, ఛిదిర్, కృత్, విద్, భుజ, అనే ధాతువులీ గణగణితాలల్లో ప్రసిద్ధాలు. వికరణ ప్రత్యయంలోని అకారం పురుష త్రయంలోను ఏకవచనంలో మాత్రం ఉంటుంది. 'ఇరత్రశ్నపోర ల్లోపః (6-4-111) అనే సూత్రం చేత లోపిస్తుంది. దీనిపై శత్రంత రూపం 'రున్ధత్' అనేది. దాని సప్తమ్యేకవచనం 'రున్ధతి'. దీనిలో ''తి'' కి మునుపు పొల్లునకారం చేరిన రూపం-ప్రథమ పురుష బహువచన వర్తమానార్థక రూపం- ''రున్ధన్తి''.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | రుణద్ధి | రున్ధః | రున్ధన్తి |
| మధ్యమ పురుష | రుణత్సి | రున్ధః | రున్ధ |
| ఉత్తమ పురుష | రుణద్మి | రున్ధ్వః | రున్ధ్మః |

అభ్యాసం :- ఛిదిర్ (ఛినద్) చినద్, కృనత్, వినద్, భునజ్ అనే వానికి క్రమంలో రూపాలను వ్రాయండి.

## NUCLEUS OF THE APPROACH

శస్త్రతంత్రాల్లో సప్తమీ విభక్తి ప్రత్యయాంతాల నుంచి వర్తమానార్థకాలైన క్రియారూప నిష్పత్తికి చేరుకున్నాం. వర్తమానార్థక క్రియా రూపనిష్పత్తిలో అంగాలే (క్రియా రూప నిష్పత్తి) లట్, లఙ్, విధిలిఙ్ అనే లకారాంతాలైన క్రియారూపాలను గుర్తించటానికి తోడ్పడుతాయి. వాటినీ క్రింద గ్రహించగలం.

లోట్ రూపాలు :—( I, IV, VI మరియు X )

ఇంత వరకు మనం దశవిధ ధాతువులకు లట్ (పరస్మైపద) రూపాలెలా ఏర్పడుతాయో గుర్తించాం. లట్ వర్తమానార్థ బోధకం. అంటే లడ్రూపాలు వర్తమాన కాలాన్ని తెలియజేస్తాయి. 'వర్తమానే లట్' (3-3-123) అనే సూత్రం ఈ యంశాన్నే తెలియజేస్తుంది. వర్తమాన మనగా క్రియా వ్యాపార నిర్వహణ మారంభమై ఉండాలి' అప్పటికి ముగియరాదు,

విధి మొదలైన అంశాలను లోట్ అనే లకారం తెలియజేస్తుంది. లోట్చ (3-3-162) ఈ లకారాన్ని గూర్చి వివరాల నిస్తుంది. విధి-నిమంత్రణ - ఆమంత్రణ - అధీష్ట - సంప్రశ్న - ప్రార్థనాదులు

'లోట్' అనే లకారాంత రూపాలకు సంక్రమిస్తవి. ఈ లకారాంతాలు కాలబోధకాలు కావు. విధిలిజ్ అనే లకారం అర్థం విషయంలో 'లట్' ను పోలినది. ఈ క్రింది ప్రత్యయాలు 'లోట్' అనే లకార స్థానంలో వచ్చే పురుషవచన బోధకాలు. ఇవన్నీ పరస్మై పద ధాతువులపై చేరేవే.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమ పురుష | తు.తాత్ | తామ్ | అన్తు |
| మధ్యమ పురుష | హి-తాత్ | తమ్ | త |
| ఉత్తమ పురుష | ని | వ | మ |

ప్రథమ, చతుర్థ, షష్ఠ మరియు దశమ గణగణితాలైన ధాతువులకు లట్ లో రెండంగాలను ( భవ, భవా ) గుర్తించాం. 'లోట్' లో కూడ అంగములు రెండే, దీర్ఘాంతమయిన అంగం ఉత్తమ పురుషలో. ఇతరత్ర హ్రస్వాంతము. ప్రథమపురుష బహువచనంలో పరస్వరం (అతో గుణే 6-1-97) ఏకాదేశంగా వస్తుంది. మధ్యమ పురుష ఏకవచనంలోని (హి) అనే ప్రత్యయం అకారాంతాల తరువాత నియతంగా లోపిస్తుందని అతోహేః (6-4-105) అనే సూత్రం చెబుతుంది.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | భవతు - భవతాత్ | భవతామ్ | భవన్తు |
| మధ్యమపురుష | భవ-భవతాత్ | భవతమ్ | భవత |
| ఉత్తమపురుష | భవాని | భవావ | భవామ |

లఙ్లే నృత్య, తుద, చోరయ అనే చతుర్థ, షష్ఠ, దశమ గణ గణితాలకు రూపక్రమం. అంగద్వయం వీటన్నింటికీ సమానం. మొదటిది హ్రస్వాంతం. రెండోది దీర్ఘాంతం. రెండింట నృత్య - నృత్యా ఇత్యాదిగ తుది అచ్చు అకారమే.

(1) గద, చర, జి, కంప, ఘూర్ణ, మీల, ఫల, నట, జ్వాల అనే ప్రథమ గణ గణితాలైన ధాతువులకు 'లోట్' రూపాలను పురుష వచన క్రమానుసారంగా వ్రాయండి.

(2) త్రస్, ఇష్, వహ్, శ్లిష్, నశ్, కుప్, హృష్, క్షుభ్ అనే చతుర్థ గణ పఠితాలైన ధాతువులకు లోట్ అనే లకారాని కా దేశంగా వచ్చే పురుషవచన బోధక ప్రత్యయ సహిత రూపాలను క్రమాను సారంగా వ్రాయండి.

(3) దిశ, కృష, లిఖ, కుచ, సృజ, మిల, విశ అనే షష్ఠ గణ గణితాలకు లోడ్రూపాలను క్రమానుసారంగా వ్రాయండి.

(4) భక్ష, వర్ణ, కథ, భూష, మండ అనే దశమ గణ గణితాలకు లోడ్రూపాలను యథాక్రమంగా వ్రాయండి.

విధిలిఙ్ .— (I, IV, VI and X)

సంస్కృతంలో 'విధి' మొదలైన అర్థాలను చెప్పటానికి, ఆశీస్సును చెప్పటానికి లిఙ్ ను విధిలిఙ్, ఆశీర్లిఙ్ అని ప్రత్యేకించి ప్రయోగిస్తారు. ఈ రెంటిలో విధిలిఙ్ ప్రస్తుతం లట్, లోట్ అనే క్రమంలో చేరుతుంది. వీటిని సార్వధాతుకం (తిఙ్ శిత్ సార్వధాతుకమ్ 3-4-113) గా గుర్తించారు. ఆశీర్లిఙ్ అర్ధ ధాతుకంలో (ఆర్ధధాతుకం శేషః 3-4-114) గతార్థమవుతుంది. విధి-నిమంత్రణ-ఆమంత్రణ-అభీష్ట-సంప్రశ్న-ప్రార్థనేషు లిఙ్ (3-3-161) అనే సూత్రం లిఙంతాలకు గల అర్థాలను వివరించింది.

లట్, లోట్ అనే లకారాలు పరం కాగా హ్రస్వ దీర్ఘ అకా రాంతంగా ఉండే ధాత్వంగం విధిలిఙ్ లో ఏకారాంతంగా ఉంటుంది. సంస్కృతంలో హ్రస్వ ఏకారం నిరవకాశంబు గావున సర్వదా దీర్ఘమే అంతంలో ఉంటుందని గుర్తించాలి. అంటే — భవే, నృత్యే, తుదే, చోరయే ఇత్యాదిగ ప్రథమ చతుర్థ, షష్ఠి, దశమ గణగణితాలగు ధాతువులకు విధిలిఙ్ పరంగా ఉన్నపుడు సిద్ధించే అంగము. ఈ లకార స్థానంలో వచ్చే పురుషవచన బోధక ప్రత్యయాలన్నీ హలాదులే కాబట్టి ఈ యంగప్రత్యయాల కలయికలో సంధి విశేషాలేవియు ప్రవర్తించవు. కావున విధిలఙ్ రూపనిష్పత్తి క్లిష్టంగా ఉంటుంది. విధిలిఙ్ ప్రత్యయాలు —

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | త్ | తామ్ | యుః |
| మధ్యమపురుష | ః | తమ్ | త |
| ఉత్తమపురుష | యమ్ | వ | మ |

లట్, లోట్ లలో అకారాంతాంగాలు గల ప్రథమ, చతుర్థ, షష్ఠ, దశమ గణగణిత ధాతువుల అంగాలు విధిలిఙ్ లో ఏకారాంతాలుగా భవే, నృత్యే, తుదే, చోరయే అనే రీతినుంటాయి. కాబట్టి వాటి విధిలిఙ్ రూపాలీ క్రమంలో ఉంటాయి.

## I భ్వాది

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | భవేత్ | భవేతామ్ | భవేయుః |
| మధ్యమ పురుష | భవేః | భవేతమ్ | భవేత |
| ఉత్తమ పురుష | భవేయమ్ | భవేవ | భవేమ |

## II దివాది

| | | | |
|---|---|---|---|
| ప్రథమపురుష | నృత్యేత్ | నృత్యేతామ్ | నృత్యేయుః |
| మధ్యమ పురుష | నృత్యేః | నృత్యేతమ్ | నృత్యేత |
| ఉత్తమపురుష | నృత్యేయమ్ | నృత్యేవ | నృత్యేమ |

## III తుదాది

| | | | |
|---|---|---|---|
| ప్రథమపురుష | తుదేత్ | తుదేతామ్ | తుదేయుః |
| మధ్యమపురుష | తుదేః | తుదేతమ్ | తుదేత |
| ఉత్తమపురుష | తుదేయమ్ | తుదేవ | తుదేమ |

## IV చురాది

| | | | |
|---|---|---|---|
| ప్రథమపురుష | చోరయేత్ | చోరయేతామ్ | చోరయేయుః |
| మధ్యమపురుష | చోరయేః | చోరయేతమ్ | చోరయేత |
| ఉత్తమపురుష | చోరయేయమ్ | చోరయేవ | చోరయేమ |

అభ్యాసం:—

ప్రథమగణ పఠితాలైన గద - చర - కంప - ఘూర్ణ - నట - శిష్ - వస - వహ అనే వానికీ. చతుర్థ గణగణితాలైన ముహ - తుష - పుష - కృధ. కుప - క్షుభ అనే వాటికీ షష్ఠ గణ పరిగణితాల లో దిశ - కృష - సృజ - కుచ - మిల - విశ - విద్ల అనే ధాతువు లకు. దశమ గణ పఠితాల్లో భక్ష, పర్ణ, తాడ్, కథ, భూష, మండ అనే వానికి విధిలిఙ్ లో ఏర్పడే రూపాలను క్రమానుసారంగా వ్రాయండి.

లఙ్ అనే లకారాంతాలు:—

(I, IV, VI మరియు X)

సంస్కృతంలో ఙకారేత్సంజ్ఞకాలైన లకారాలు (లఙ్, లుఙ్, లృఙ్ అనేవి పరంకాగా ధాత్వాదిలో అకారం చేరుతుంది. 'భవతి' క్రియారూపానికి మునుపు అకారం చేరటం తుదిస్వరమైన ఇకారానికి లోపం కలిగిస్తే ఏర్పడే అభవత్ అనేది లఙ్ లో ప్రథమ పురుష ఏకవచన రూపం. ఇందులో పొల్లు త్ కారం లఙ్ ప్రథమపురుష ఏకవచనం.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | త్ | తామ్ | అన్ |
| మధ్యమపురుష | ః | తమ్ | త |
| ఉత్తమపురుష | మ్ | వ | మ |

లఙ్ పరస్మైపద ధాతువులపై చేరే ప్రత్యయాలు ప్రథమ పురుష బహువచనంలో పరస్వరైకాదేశ రూపాత్మకమైన సంధి. ఉత్తమ పురుష ద్వితీయ బహువచన ప్రత్యయాలు పరంకాగా అంగం దీర్ఘాంతంగా ఉంటుంది.

భ్వాది గణంలో

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | అభవత్ | అభవతామ్ | అభవన్ |
| మధ్యమ పురుష | అభవః | అభవతమ్ | అభవత |
| ఉత్తమ పురుష | అభవమ్ | అభవావ | అభవామ |

దివాదుల్లో

| | | | |
|---|---|---|---|
| ప్రథమపురుష | అనృత్యత్ | అనృత్యతామ్ | అనృత్యన్ |
| మధ్యమపురుష | అనృత్యః | అనృత్యతమ్ | అనృత్యత |
| ఉత్తమపురుష | అనృత్యమ్ | అనృత్యావ | అనృత్యామ |

తుదాదుల్లో

| | | | |
|---|---|---|---|
| ప్రథమపురుష | అతుదత్ | అతుదతామ్ | అతుదన్ |
| మధ్యమపురుష | అతుదః | అతుదతామ్ | అతుదత |
| ఉత్తమపురుష | అతుదమ్ | అతుదావ | అతుదామ |

చురాదుల్లో

| | | | |
|---|---|---|---|
| ప్రథమపురుష | అకథయత్ | అకథయతామ్ | అకథయన్ |
| మధ్యమపురుష | అకథయః | అకథయతమ్ | అకథయత |
| ఉత్తమపురుష | అకథయమ్ | అకథయావ | అకథయామ |

అభ్యాసం:—

(1) ప్రథమ గణగణితాలైన గద, కంప, జి (జయ), ఘూర్ణ, మీల, నట, జ్వల, నమ, తప అనే వానికి లఙ్రూపాలను వ్రాయండి.

(2) చతుర్థ గణపరిగణితాలైన ఈ క్రింది ధాతువులకు లఙ్రూపాలను వ్రాయండి.

పుష, తుష, శ్లిష, కుప, క్షుభ

(3) ఈ క్రింది షష్ఠ గణ గణితాలకు లఙ్ లో నిష్పన్నమయ్యే రూపాలను క్రమాన్ననుసరించి వ్రాయండి.

దిశ-కృష-లిఖ-సృజ-కుచ

(4) ఈ క్రింది చురాది గణ గణితాలైన ధాతువులకు లఙ్ రూపాలను వ్రాయండి.

భక్ష-వర్ణ-తడ (తాడ)-కథ-భూష-మంద

లఙ్లకారార్థం :—

'లఙ్' అనే లకారాంత క్రియారూపాలు గడచిన, జరిగి పోయిన, గతించిన లేదా భూతకాలాన్ని బోధిస్తుంది. భూతమనగా విద్యమానధ్వంసప్రతియోగి. దేని యొక్క అభావము నేడు గలదో యది భూతకాలము. అశోకుడు నేడు లేడు, అతని యభావమున్నది. కావున అశోకుని కాలము భూతకాలము.

భూతకాలాన్ని చెప్పటానికి సంస్కృతంలో మూడు లకారాలున్నాయి. భూతకాలంలో వక్త ఎదుట (ప్రత్యక్షం) జరిగినదాన్ని ప్రత్యక్షమనీ అలా కానిదాన్ని పరోక్షమనీ అన్నారు. నేడు జరిగిన

దాన్ని అద్యతన మనీ, అట్లుకానిదాన్ని తదన్యమయినందున అనద్యతన మనీ గమనించారు.

1. అద్యతన ప్రత్యక్షము
2. అనద్యతన ప్రత్యక్షము
3. అద్యతన పరోక్షము
4. అనద్యతన పరోక్షము

అని భూతకాలంలో నాల్గు విభేదాలున్నాయి.

ప్రత్యక్షమైనా, పరోక్షమైనా ఈనాడుకు అంటే వర్తమానానికి సంబంధింపని అనద్యతనమైన భూతకాలాన్ని లఙ్ తెలియజేస్తుందని. అనద్యతనే లఙ్ (3-2-111) అనే సూత్రం వివరిస్తుంది.

లోట్ రూపాలు (తక్కిన ఆరువర్గాలకు చెందిన ధాతువులపై)

ఆదాదిగణం (ద్వితీయ)

ద్విష్‌పై లట్ రూపం ద్వేష్టి. ప్రథమ ఏకవచన రూపం. లట్‌తో ప్రత్యయం 'తి'. లోట్ - తు. అనగా వర్తమానార్థకం. ఇకారాంతం లోట్ ఉకారాంతంగా ఉంటుందని గుర్తించాలి.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | ద్వేష్టు-ద్వేష్టాత్ | ద్విష్టామ్ | ద్విషన్తు |
| మధ్యమపురుష | ద్విడ్ఢి-ద్విష్టాత్ | ద్విష్టమ్ | ద్విష్ట |
| ఉత్తమపురుష | ద్వేష్టాని | ద్వేష్టావ | ద్వేష్టామ |

'తు' పరం కాగా (ప్రథమ పురుష ఏకవచనం) గుణం వచ్చింది. తాత్ (ప్రథమ ఏకవచన రూపాంతరం) పరమయినపుడు గుణం నివారితం. మధ్యమ ఏకవచనంలో హి - తాత్ అనే రెంటికీ గుణాన్ని కలిగించే శక్తిలేదు. అందువల్ల ఆ రూపాలన్నీ (మధ్యమ పురుష) గుణరహితంగా లేదా గుణహీనంగా ఉన్నాయి.

అభ్యాసం :— దుహ్, యుదు, ను, యా, అనే ధాతువులకు లోట్రూపాలు వ్రాయండి.

జుహోత్యాదులపై లోట్

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమ పురుష | జుహోతు<br>జుహుతాత్ | జుహుతామ్ | జుహ్వతు |
| మధ్యమ పురుష | జుహుధి<br>జుహుతాత | జుహుతమ్ | జుహుధ |
| ఉత్తమ పురుష | జుహువాని | జుహువావ | జుహువామ |

ప్రథమైకవచనంలో ఉత్తమపురుషలో వచనత్రయంలో గల గుణము. ఉత్తమపురుషలో మూడు చోట్ల యణాదేశము.

గమనిక :—

ప్రథమపురుష బహువచనంలో 'ఝోన్తః' అనేదాన్ని బాధించి అదభ్యస్తాత్ 7-1-4 అనే సూత్రంచే 'అత్' వచ్చి 'ఇ' తో చేరి 'అతి' 'అతి' అయినది. 'అంతి'కాలేదు. హ్యాశ్నులోరిత యణ్ 6-4-87 ఉవజ్ నిషిద్ధమై యణాదేశం ప్రాప్తించింది.

అభ్యాసం : - భృ-హా, ధా, దా అనే తృతీయ గణ గణితాలైన ధాతువులకు లోట్ రూపాల నన్నింటిని వ్రాయండి.

లోట్ — స్వాది గణగణితాలు :—

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | సునోతు<br>సునుతాత్ | సునుతామ్ | సున్వన్తు |
| మధ్యమపురుష | సునుహి<br>సునుతాత్ | సునుతమ్ | సునుత |
| ఉత్తమపురుష | సునవాని | సునవావ | సునవామ |

ఉత్తమపురుషలో అని, అవ, అమ అనే ప్రత్యయాలు పరమయినపుడు వికరణ ప్రత్యయమైన 'ను' లోని ఉకారానికి గుణం, అయవాదేశాలు వచ్చాయి.

అభ్యాసం — పంచమ వర్గ గణితాలైన యీక్రింది ధాతువులకు లోట్రూపాలను వ్రాయండి.

చి - వృ - ధు-పృ-ఆప్ - శక్

లోట్ - అష్టమగణగణిత ధాతువులకు

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | కరోతు<br>కురుతాత్ | కురుతామ్ | కుర్వన్తు |
| మధ్యమపురుష | కురు<br>కురుతాత్ | కురుతమ్ | కురుత |
| ఉత్తమపురుష | కరవాణి | కరవావ | కరవామ |

ఉత్తమపురుషలో వికరణప్రత్యయమైన ఉకారానికి గుణ అయవాదేశ సంధులు.

అభ్యాసం:- క్షిణ్ - ఘృణ్ - తృణ్ - వన్ అనే అష్టమ గణ గణిత ధాతువులకు లోట్రూపాలను అన్నింటిని వ్రాయండి.

లోట్ - సప్తమగణగణితధాతువులు :-

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | రుణద్ధు<br>రున్ధాత్ | రున్ధామ్ | రున్ధన్తు |
| మధ్యమపురుష | రుణద్ధి<br>రున్ధాత్ | రున్ధమ్ | రున్ధ |
| ఉత్తమపురుష | రుణధాని | రుణధావ | రుణధామ |

అభ్యాసం .— భిద్, యుజ్ అనేవానికి లోట్రూపాలు వ్రాయండి.

లోట్ - నవమ గణ (క్ర్యాదులు) గణితాలకు

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | క్రీణాతు<br>క్రీణీతాత్ | క్రీణీతామ్ | క్రీణన్తు |
| మధ్యమపురుష | క్రీణీహి<br>క్రీణీతాత్ | క్రీణీతమ్ | క్రీణీత |
| ఉత్తమపురుష | క్రీణాని | క్రీణావ | క్రీణామ |

అభ్యాసం :— వ్యా, దూ, వ్యా, జ్ఞా, పుష్ అనేవానికి లిఙ్రూపాలు వ్రాయండి.

విధిలిఙ్ (2, 3, 5, 7, 8, 9, గణగణిత ధాతువులకు)

అస్ అనే ధాతువుకు 'యా' అనే ఆగమం లిఙ్ రాగా తొలి అకారం లోపించి స్యా అని అంగం అవుతుంది. కాబట్టి - ద్వితీయ గణగణితంలో –

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమ పురుష | స్యాత్ | స్యాతామ్ | స్యుః |
| మధ్యమ పురుష | స్యాః | స్యాతమ్ | స్యాత |
| ఉత్తమ పురుష | స్యామ్ | స్యావ | స్యామ |

అని రూపాలేర్పడుతాయి. శ్నసోరల్లోపః (6-4-111) యా అనే జిత్ పరమైనందున సర్వత్ర ధాత్వాది అకారానికి లోపం. ఝేర్జుస్ (3-4-108) అనే సూత్రంచే ప్రథమ పురుష బహువచన ప్రత్యయమైన 'ఝి' అనే దానికి జుస్ (ఉః) వచ్చింది. ఇ ధాతువు నుంచి –

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | ఇయాత్ | ఇయాతామ్ | ఇయుః |
| మధ్యమపురుష | ఇయాః | ఇయాతమ్ | ఇయాత |
| ఉత్తమపురుష | ఇయామ్ | ఇయావ | ఇయామ |

<u>అభ్యాసం :—</u> స్నా - యా - వా - రు - కు, అనే ధాతువులకు విధిలిఙ్ రూపాలను క్రమానుసారంగా వ్రాయండి.

<u>తృతీయ గణగణిత ధాతువులు :—</u>

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | జుహుయాత్ | జుహుయాతామ్ | జుహుయుః |
| మధ్యమపురుష | జుహుయాః | జుహుయాతమ్ | జుహుయాత |
| ఉత్తమపురుష | జుహుయామ్ | జుహుయావ | జుహుయామ |

<u>అభ్యాసం :—</u> ఛీ, దా, ధా అనే వానికి విధిలిఙ్ రూపాలు వ్రాయండి·

<u>పంచమ - అష్టమ గణగణితాలు :—</u>

ఈ రెండింట అంగం అంతంలో ను (V) - ఉ (VIII) ఉకారాన్ని గలిగి ఉంటుంది. కాబట్టి రూపనిష్పత్తిలో సామ్యం ఉంది.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | సునుయాత్ | సునుయాతామ్ | సునుయుః |
| మధ్యమపురుష | సునుయాః | సునుయాతమ్ | సునుయాత |
| ఉత్తమపురుష | సునుయామ్ | సునుయావ | సునుయామ |
| ప్రథమపురుష | తనుయాత్ | తనుయాతామ్ | తనుయుః |
| మధ్యమపురుష | తనుయాః | తనుయాతమ్ | తనుయాత |
| ఉత్తమపురుష | తనుయామ్ | తనుయావ | తనుయామ |

అభ్యాసం :- చి, దు, వృ అనే పంచమ గణ గణితాలకు కృ, మను అనే అష్టమగణ పఠితాలకు విధిలిఙ్ రూపాలు వ్రాయండి.

విధిలిఙ్ - సప్తమ గణ గణితములకు :-

యా అనేది ఙకారేత్సంజ్ఞకమయినందున సప్తమ గణగణిత 'రునధ్' మొదలగు ధాత్వంగాల్లో వికరణ ప్రత్యయమైన నకారంపై అకారానికి నియంతంగా లోపం వస్తుంది. సార్వధాతుకమైన ఙకారేత్సంజ్ఞకం పరంగా ఉన్నందున (యా) శ్నసోరల్లోపః (6-4-111) ఈ లోపం ప్రాప్తిస్తుంది. కాబట్టి విధిలిఙ్ రూపాలు ఈ విధంగా ఉంటాయి.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | రున్ధ్యాత్ | రున్ధ్యాతామ్ | రున్ధ్యుః |
| మధ్యమ పురుష | రున్ధ్యాః | రున్ధ్యాతమ్ | రున్ధ్యాత |
| ఉత్తమ పురుష | రున్ధ్యామ్ | రున్ధ్యావ | రున్ధ్యామ |

అభ్యాసం :- భిద్, ఛిద్, క్షుద్, యుజ్ అనే సప్తమ గణగణితాలైన ధాతువులకు విధిలిఙ్ రూపాలను వ్రాయండి.

విధిలిఙ్ నవమ గణగణితాలు :-

క్రీ + నా = క్రీణా అని కాగా ఙకారేత్సంజ్ఞకము హలాది సార్వధాతుకమైన యా పరమైనందున 'క్రీణా' లనే అంగంలోని 'ఆ' కారం ఈ కారంగా మార్పు పొందుతుంది. కాబట్టి ఈ హల్యఘోః (6-4-114) క్రీణీ అని ఉంటుంది.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | క్రీణీయాత్ | క్రీణీయాతామ్ | క్రీణీయుః |
| మధ్యమపురుష | క్రీణీయాః | క్రీణీయాతమ్ | క్రీణీయాత |
| ఉత్తమపురుష | క్రీణీయామ్ | క్రీణీయావ | క్రీణీయామ |

అభ్యాసం :– మీ, యు, స్త్రా, మృద్ అనే ధాతువులకు విధిలిఙ్ రూపాలను వ్రాయండి.

లఙ్ అనే అకారాంకారాంతాలు (2, 3, 5, 7, 8, 9 గణగణితాలైన ధాతువులకు)

ద్వితీయ గణం :–

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | అయాత్ | అయాతామ్ | అయాన్ |
| మధ్యమపురుష | అయాః | అయాతమ్ | అయాత |
| ఉత్తమపురుష | అయామ్ | అయావ | అయామ |

తృతీయ గణం

| | | | |
|---|---|---|---|
| ప్రథమపురుష | అదదాత్ | అదదతామ్ | అదదన్ |
| మధ్యమపురుష | అదదాః | అదదతమ్ | అదదత |
| ఉత్తమపురుష | అదదమ్ | అదదావ | అదదామ |

## పంచమ – అష్టమ గణగణితాలు – లఙ్

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | అసునోత్ | అసునుతామ్ | అసున్వన్ |
| మధ్యమపురుష | అసునోః | అసునతమ్ | అసునత |
| ఉత్తమపురుష | అసునోమ్ | అసునవ<br>అసున్వ | అసునుమ<br>అసున్మ |
| ప్రథమపురుష | అతనోత్ | అతనుతామ్ | అతన్వన్ |
| మధ్యమపురుష | అతనోః | అతనుతమ్ | అతనుత |
| ఉత్తమపురుష | అతనోమ్ | అతనువ<br>అతన్వ | అతనుమ<br>అతన్మ |

## సప్తమవర్గ – లఙ్

| | | | |
|---|---|---|---|
| ప్రథమపురుష | అరుణత్<br>అరుణద్ | అరున్ధామ్ | అరున్ధన్ |
| మధ్యమపురుష | అరుణః<br>అరుణత్<br>అరుణద | అరున్ధమ్ | అరున్ధ |
| ఉత్తమపురుష | అరుణధమ్ | అరుణధావ | అరుణధామ |

## నవమగణం - లఙ్

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమ పురుష | అక్రీణాత్ | అక్రీణీతామ్ | అక్రీణన్ |
| మధ్యమ పురుష | అక్రీణాః | అక్రీణీతమ్ | అక్రీణీత |
| ఉత్తమ పురుష | అక్రీణామ్ | అక్రీణీవ | అక్రీణీమ |

అభ్యాసం :— (2-3-5-7-8-9 గణగణితాలకు)

1) ద్వితీయ వర్గకు చెందిన ద్విష్, దుహ్, ఇణ్ అనేవానికి
2) తృతీయ గణానికి చెందిన హా - దా ధా అనే వానికి
3) పంచమ వర్గానికి చెందిన చి - వృ - ధు అనే వానికి
4) సప్తమ వర్గానికి చెందిన భిద్ - రిచ్ - క్షుద్ అనే వానికి
5) అష్టమ వర్గానికి చెందిన వను - ఋణు - ఘృణు అనేవానికి
6) నవమ వర్గానికి చెందిన ధూ - జ్ఞా - పుష్ అనేవానికి లఙ్ రూపాలను క్రమానుసారంగా వ్రాయండి.

# PART - V

## సుబంతాలు - తకారాంతాలు (మతుబంతాలు)

మరుత్ మొదలైన తకారాంత ప్రాతిపదికలు శాసత్ మొదలగు శతృ ప్రత్యయాంతాలకు వలెనే శబ్దరూపాలకు కలిగి ఉంటాయని చెప్పుకున్నాం. ఈ వర్గంలో ద్వితీయ, తృతీయ గణగణిత ధాతు జన్యాలైన శత్రంతాలే చేరులాయి.

తక్కిన ఎనిమిది వర్గల్లో (1, 4నుండి10) పరిగణితాలైన ధాతువులకు సుబంతరూపనిష్పత్తిలో పై తకారాంతాలతో కొంత పోలిక ఉన్నప్పటికి భేదం కూడ ఉందని మనం తెలుసుకున్నాం. ఈ వర్గంలో (1, 4నుండి10) పై వానియందు వలె రెండుగాక అంగాలు మూడున్నాయి. మొదటి యైదు ప్రత్యయాలకు సర్వనామ స్థానాలని వాటిల్లో నుమాగమం ప్రాతిపదికలోని తుది తకారానికీ ముందుగా పొల్లునకారం చేరటం సర్వనామస్థానాల్లో గలదని మనం తెలుసుకున్నాం.

మరోవిధమైన తకారాంతాలను గూర్చి మనం ఇప్పుడు తెలుసుకుందాం. శత్రంతాలు ధాతుజన్యాలు, వర్తమాన కాలబోధకాలు.

మతుప్ అనేదొక ప్రత్యయం. కలిగివాడు/ఆమె/అది అనే లింగత్రయాల్లో ఇది ప్రవర్తిస్తుంది సంబంధ (షష్ఠి) అధికరణ (సప్తమ్యంత) అర్థాల్లో ఈ ప్రత్యయం వస్తుంది. ఈ వక్తికి

అధికమైన గోధనం గలదనే సామాన్య సంబంధంలో (షష్ఠి) మతుప్ అనే ప్రత్యయం గోశబ్దానికి చేరి గోమత్ అనే ప్రాతిపదిక ఏర్పడింది. దీనికి (గావః అస్యసంతి) అనేది విగ్రహం. ఈ ప్రాతిపదికకు ప్రథమైక వచన ప్రత్యయాంత రూపం గోమాన్ అనేది. ఈ పర్వతంపై వృక్షాలధికంగా ఉన్నాయనే సందర్భంలో పర్వతం అధికరణం, వృక్షాలాధారాలు. ఈ సందర్భంలో వృక్ష పై 'మత్' చేరినందున 'వక్షవిత్' అని ప్రాతిపదిక. దీనికి ప్రథమ ఏకవచనరూపం వృక్షవాన్. గోధనదత్తులకు శేషసంబంధం. గోమత్ < గోమాన్ అనేది అన్యపద ప్రాధాన్యం. దేవదత్తునకు వాచకం కాబట్టి. అలాగే వృక్షపర్వతాలకు ఆధారాధికరణ సంబంధం. వృక్షవాన్ > వృక్షవత్ అనేది పర్వతవాచకం. ఇది గూడ అన్యపద ప్రాధాన్యమే. అంటే మతుబంతాలు Exocentric Construction గా గుర్తింపదగియుండును.

మతుప్ అనే ప్రత్యయం మవర్ణ అవర్ణాలకు మవర్ణావర్ణా లుపధాస్థానంలో గలవాటికి పరం అయితే ప్రత్యయాది మ < కగా మారుతుంది. కింవాన్, జ్ఞానవాన్, లక్ష్మీవాన్, యశస్వాన్ మొ॥లైనవి ఉదాహరణాలు. కిమ్ + మత్, జ్ఞాన + మత్ ఇత్యాదిగ మత్ < వత్ గ మారి కింవత్ మొదలగు ప్రాతిపదికలు ఏర్పడుతాయి. వీటిపై నిష్పన్నమయ్యే సుబంతాలు కింవాన్ మొదలగునవి.

మతుప్ కు బదులుగా 'ఇన్' అనేది తరచుగ వస్తుంది. ఈ ప్రత్యయార్థాలను వివరించే శ్లోకం క్రింద యిచ్చిన కుష్ఠీ, క్షీరిణః, ఉదరిణీ, దండీ అనేవి మతుప్‌కు బదులుగా 'ఇన్' అనే ప్రత్యయం చేరినందున ఏర్పడినవే. ఇంతేగాక ల, జ, మొదలగునవి మతుప్ బదులుగా ఆదేశాలవుతుంటాయి. మతుప్ కు వివిధార్థాలున్నాయి. ఆ యర్థాలు గల ఉదాహరణాలు

1) భూమన్ = ఆధిక్యం. అధిక సంఖ్యలో ఆవులు గల గోమాన్ అనేది ఉదాహరణం

2) నింద, ఏవగింపు గలిగించే అర్థంలో "మతుప్" కు బదులుగా ఇన్ వచ్చిన "కుష్ఠీ' అనే దర్థం. (కుష్ఠ + ఇన్)

3) ప్రశంస, పొగడ్తకు రూపవతి అనేదానికి స్త్రీ ప్రత్యయం చేరినందున ఏర్పడే రూపవత్ అనేది ఉదాహరణం ఈ విశేషణం కన్యకు వర్తిస్తుంది.

4) నిత్యయోగంలో క్షీర అనేదానిపైన వచ్చిన మతుప్ కు ఆదేశంగా ఇన్ వచ్చిన క్షీరా అనేదానికి ప్రథమ బహువచన ప్రత్యయాంతమైన క్షీరిణః (పదా పాలుగల చెట్లు) అనేది ఉదాహరణం.

5) అతిశయం. ఎక్కువ. మితిమీరిన అనే అర్థంలో మతుప్ కు బదులుగా వచ్చిన 'ఇన్' అంతంపై స్త్రీ ప్రత్యయం చేరినందున ఏర్పడే ఉదరిణీ ( ఉదర + ఇన్ + ఈ ) అనేది ఉదాహరణం. అవయవాల పొందికలేకుండా పెద్దపొట్ట గల బాలికకి విశేషణం. వర్తిస్తుంది.

6) సంసర్గ లేదా సంబంధార్థంలో దండ అనేదానిపై వచ్చిన మతుప్ అనే ప్రత్యయానికి బదులుగా వచ్చిన 'ఇన్' అంతమైన దండీ, ఛత్రీ మొదలగునవి ఉదాహరణాలు.

7) వివక్షకు అస్తిమాన్ అనేది ఉదాహరణం. మనకు మతుప్ ప్రత్యయాంతం మాత్రమే తకారాంతమైన ప్రాతిపదిక గాబట్టి వాటి శబ్దరూప నిష్పత్తియే మనకు ప్రస్తుతం మిగిలిన ఇన్, ల, ఇల వానికి అర్థసామ్యం ఉన్నప్పటికి శబ్దరూపనిష్పత్తిలో సామ్యం కన్న భేదం అధికం.

గుణవత్ అనేది శత్రంతము. సర్వనామ స్థానాల్లో (మొదటి అయిదు ప్రత్యయాలు పరంకాగా) ప్రాతిపదికలోని తుది తకారానికి ముందు పొల్లునకారం శత్రంతాలకు వలెనే ఇక్కడ కూడ చేరుతుంది. అయితే ప్రథమ ఏకవచనంలో మాత్రం ప్రాతిపదిక అంతంలోగల

అచ్చు ఉంటే 'గుణవన్త్' అనేదానిలో వకారంపై ఉన్న అకారం తుది అచ్చు (మిగిలిన న్ కార, త్ కారాలు హల్లులు) దీర్ఘం ఆదేశంగా వస్తుంది. సర్వనామస్థానాల్లో ప్రథమా ఏకవచనంలో మాత్రమే ఈ మార్పు. తక్కిన నాలుగుస్థానాలు యథా పూర్వం (శత్రంతాలకు వలెనే) గానే ఉంటాయి. గుణవన్తౌ[1], గుణవన్తః[1], గుణవన్తమ్[1] ఇత్యాదిగ ఉంటాయి. ప్రథమైక వచనంలో 'గుణవాన్' అని ఉంటుంది. అంటే సర్వనామ స్థానాల్లో ఇక్కడ రెండంగాలుంటాయి. మొదటిది- 'గుణవాన్త్' అనేదీ, రెండోది గుణవన్త్ అనేది.

'ద' అనే సరళాక్షరం పరం కాగా 'గుణవత్'లోని తకారం 'ద్' గా మారినందున గుణవద్ అని అవుతుంది. ఈ యంగం ఆరు ప్రత్యయాలు పరంగా ఉండగా వస్తుంది. సర్వనామస్థానాలైదింటితో కలసి మనం ఇంతవరకు గుణవత్ అనే మతుబంతాలకు పదకొండు ప్రత్యయాలు పరంగా రూపక్రమాన్ని గుర్తించాం. మిగిలిన ప్రత్యయ దశకం పరంకాగా అంగం ప్రాతిపదిక అభిన్నంగా ఉంటాయి. కాబట్టి గుణవత్ అనేదానికీ క్రమంలో రూపాలుంటాయి.

| విభక్తులు | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమావిభక్తి | గుణవాన్ | గుణవన్తౌ | గుణవన్తః |
| ద్వితీయావిభక్తి | గుణవన్తమ్ | గుణవన్తౌ | గుణవతః |
| తృతీయావిభక్తి | గుణవతా | గుణవద్భ్యామ్ | గుణవద్భిః |
| చతుర్థీవిభక్తి | గుణవతే | గుణవద్భ్యామ్ | గుణవద్భ్యః |
| పంచమీవిభక్తి | గుణవతః | గుణవద్భ్యామ్ | గుణవద్భ్యః |
| షష్ఠీవిభక్తి | గుణవతః | గుణవతోః | గుణవతామ్ |
| సప్తమీవిభక్తి | గుణవతి | గుణవతోః | గుణవత్సు |

అభ్యాసం :— తకారాంతాలైన మతుబంతాలకూ శత్రంతాలకూ సుబంతరూప నిష్పత్తిలో గల భేదమేమి?

సర్వనామస్థానము లనగానేమి? సర్వనామ స్థానాల్లో శత్రంత మతుబంత (తకారాంత) ప్రాతిపదికల్లో గుర్తించదగిన భేదమేమి?

మతుబంతాలకు ఎన్ని అంగాలు? ఏయే ప్రత్యయాలుండగా ఏయంగాలు వస్తాయి.

గుణవతః అనేది ఏయే విభక్తి వచనాల్లో వస్తుంది? గుణవన్తః, గుణవతః, ఈ రెండింటికి భేదమేమి? ధనవత్ అనేదానికి ఏర్పడే అంగాలను నాల్గింటిని వ్రాయండి.

బుద్ధిమత్ అనేదానికి విభక్త్యంత రూపాల నన్నింటిని క్రమానుసారంగా వ్రాయండి.

తకారాంతాలు – మహత్ శబ్దము :—

మహత్ అనే తకారాంత శబ్దం మన మింతకు మునుపు చెప్పుకున్న తకారాంతాల కన్న వేరుగా ఉంటుంది. మరుత్ మరియు రెండు మూడు గణగణితాలైన ధాతువులపై నుంచి ఏర్పడే శత్రంతాలు ఒక వర్గం. వీనికి అంగాలు రెండే ఉంటాయి. అందువల్ల వీటిని గుర్తించటం సులభం. ఆ తరువాత మూడంగాలుండే తకారాంతాలను గుర్తించాం. ద్వితీయ, తృతీయ గణగణితాలుగాని ధాతు జన్యాలైన శత్రంతాలనీ ఇందులో చేరుతాయి. తరువాతిది మతుప్ అనే ప్రత్యయాంతమయినందున తకారాంతాలుగా ఏర్పడిన నామాలు. వీనికి అంకాలు నాల్గుంటాయి. ఈ విధంగా అంగాలల్లో వైవిధ్యం క్రమంగా పెరిగిపోయింది. మహత్ అనే తకారాంతంలో మరో అంగం పెరుగుతుందని మనం అనుకోరాదు. మతుబంతాలకు వలెగాక మహత్ అనే దానికి అంగాలు మూడు ఉన్నా మహత్ శబ్దంలో ప్రథమైక వచనంలో మాత్రమేగాక సర్వనామస్థానాలైదింట ఉపధా దీర్ఘత గలుగుతుంది.

నుమాగమానసే వస్తుంది ఈ స్థాన పంచకంలో. కాబట్టి మహాన్త్ అనే అంగం సర్వనామ స్థానాలన్నింట దీర్ఘనుమాగమ సహితం. తరువాత మహత్, మహద్ అని రెండంగాలు. కాబట్టి ఇందులో మొత్తంఅంగాల సంఖ్య మూడు మాత్రమే.

| విభక్తులు | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమావిభక్తి | మహాన్ | మహాన్తౌ | మహాన్తః |
| ద్వితీయావిభక్తి | మహాన్తమ్ | మహాన్తౌ | మహతః |
| తృతీయావిభక్తి | మహతా | మహద్భ్యామ్ | మహద్భిః |
| చతుర్థీవిభక్తి | మహతే | మహద్భ్యామ్ | మహద్భ్యః |
| పంచమీవిభక్తి | మహతః | మహద్భ్యామ్ | మహద్భ్యః |
| షష్ఠీవిభక్తి | మహతః | మహతోః | మహతామ్ |
| సప్తమీవిభక్తి | మహతి | మహతోః | మహత్సు |

ఈ శబ్దం సమాసంలో పూర్వావయవంగా ఉన్నపుడు సమానాధికరణంలో (కర్మధారయ - ద్విగు మొ॥) మహా అని దీర్ఘాంతంగా 'ఆన్మహతః సమానాధికరణ జాతీయ దేశీయయోః' (6-3-46) ఉంటుంది. మహాదేవ అనే సమాసంలో మహత్ దీర్ఘాంతంగా ఉంది. దీన్ని సమానాధికరణ సమాసంగా గుర్తించదగును. 'మహత్సేవధి' అనే సందర్భంలో మహత్ వ్యధికరణ సమాసమయినందున మార్పుకు లోనుగాలేదు. సమాసంలో పూర్వావయవంలో మార్పులు రావటం అంతగా లేదుగాని ఉత్తరావయవంలో సమాసాశ్రయ ప్రత్యయాలు, సమాసాశ్రయ విధులు అనే రీతిని అనేక మార్పులను వ్యాకరణం ప్రతిపాదించి ఉన్నది. ఉదక < ఉద, పాద < పాద్ (ఉదమేఘ-గూఢపాద్) మొదలగు మార్పులనుగాంచటం వ్యాకరణ ప్రతిపాదితమే.

శబ్దరూపాలు — చకార జకారాంతాలు

వాచ్, జలముచ్, పయోముచ్, త్వచ్ మొదలగు చకారాంత ప్రాతిపదికలు స్రజ్, భిషజ్ మొదలగు జకారాంత ప్రాతిపదికలు. చకారాంతాల్లోని తుది చకారం హలాది ప్రత్యయాలు (ఎనిమిది) పరంకాగా 'క్' గా మారుతుంది. కాబట్టి వాక్ అని ఏర్పడుతుంది. నాదాక్షరాలాదియందు గల 'భ్యామ్' మొదలైనవి పరంకాగా అంగం (వాక్) లోని తుది క కారం 'గ్' కారంగా మారుతుంది. అంటే అంగం వాగ్ అని అవుతుంది. అజాది ప్రత్యయాలు పరంకాగా అంగంలో మార్పేమీరాదు.

| విభక్తులు | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమావిభక్తి | వాక్ | వాచౌ | వాచః |
| ద్వితీయావిభక్తి | వాచమ్ | వాచౌ | వాచః |
| తృతీయావిభక్తి | వాచా | వాగ్భ్యామ్ | వాగ్భిః |
| చతుర్థీవిభక్తి | వాచే | వాగ్భ్యామ్ | వాగ్భ్యః |
| పంచమీవిభక్తి | వాచః | వాగ్భ్యామ్ | వాగ్భ్యః |
| షష్ఠీవిభక్తి | వాచః | వాచోః | వాచామ్ |
| సప్తమీవిభక్తి | వాచి | వాచోః | వాక్షు |

'జలముచ్' కు జలముక్, జలముగ్, జలముచ్ అనేవి అంగాలు. పయోముచ్‌కు పయోముక్, పయోముగ్, పయోముచ్ అనేవి అంగాలు.

జకారాంతాల్లో 'జ' గకారంగా మారి నాదాక్షరాలాది యందు గల ప్రత్యయాలు పరంకాగా భిషగ్ అని గకారాంతంగా ఉంటుంది. ప్రథమైకవచన సప్తమీ బహువచన ప్రత్యయాలు పరం కాగా భిషగ్

లోని 'గ' 'క' గా మారుతుంది. భిషక్ తక్కిన పదమూడు ప్రత్యయాలు పరంకాగా భిషజ్ అని జకారాంతమే అంగం.

| విభక్తులు | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమావిభక్తి | భిషక్ | భిషజౌ | భిషజః |
| ద్వితీయావిభక్తి | భిషజమ్ | భిషజౌ | భిషజః |
| తృతీయావిభక్తి | భిషజా | భిషగ్భ్యామ్ | భిషగ్భిః |
| చతుర్థీవిభక్తి | భిషజే | భిషగ్భ్యామ్ | భిషగ్భ్యః |
| పంచమీవిభక్తి | భిషజః | భిషగ్భ్యామ్ | భిషగ్భ్యః |
| షష్ఠీవిభక్తి | భిషజః | భిషజోః | భిషజామ్ |
| సప్తమీవిభక్తి | భిషజి | భిషజోః | భిషక్షు |

వాఙ్మయము, వాక్చాతుర్యము మొదలగు సమాసాలు - సమాసాల్లో విభక్తిప్రత్యయం లోపించినందున ప్రాతిపదిక (చకారాంతం) నిలచి వాచ్మయ, వాచ్చాతుర్య ఇత్యాదిగ సమస్తరూపాలేర్పడ వలసి యుండగా ఆ విధానాన్ని బాధించి కకారాంతమయిన అంగమే సమాసములందుత్తర పదంగా నిలచి యుండటం గుర్తించదగును.

భిషజ్, స్రజ్ అనే జకారాంత ప్రాతిపదికలకు మారుగా కకారాంతమైన స్రక్, భిషక్ అనేవి సమాసాల్లో ఉత్తరపదాల్లో నిలచి ఉండటం.

స్రక్ + ధారణ = స్రగ్ధారణ; భిషక్ + ఔషధము = భిషగౌషధము మొదలగు ప్రయోగాలలో నిలచి ఉండటం గమనింపదగిన యంశము.

అభ్యాసం :— ఈ క్రింది ప్రయోగాల్లో క్రీగీతలు గల పదాలను గూర్చి వ్రాయకడి.

1) వాఙ్మయ స్తప ఉచ్యతే

2) వాచి వీర్యం ద్విజానామ్

3) వాచామాంధ్రమయీనాం యః ప్రవక్తా

4) వాక్పారుష్యము చన్నే ?

5) భద్రైషాం లక్ష్మీర్నిహితాధి వాచి

6) ఋషయో రాక్షసీ మాహుర్వాచమున్మత్తదృప్తయోః

7) మనసా వాచా కర్మణా

8) ధీరాః సూనృతాం వాచమాహుః

మతుబంబములు – నకారాంతాలు :—

పూర్వ (5-2-86), ఇష్ట (5-2-87) మొదలైనవానికి మతుప్ ప్రత్యయార్థంలో 'ఇన్' అనేది వస్తుంది. 'గుణ' అనేదానికి (5-2-95) మతుప్ వస్తే 'గుణవత్' అనీ, ఇన్ వస్తే గుణిన్ అనీ ప్రాతిపదిక లేర్పడుతాయి. 'గుణిన్' అనే నకారాంతాలకు శబ్దరూప నిష్పత్తి ఎలా ఉంటుందో మన మీ క్రింద గ్రహిస్తాం:

హలాది ప్రత్యయాలు పరంకాగా 'గుణిన్' మొదలైన నకారాంత ప్రాతిపదికల్లోని తుది నకారానికి లోపం వస్తుంది, అంటే అంగం "గుణి" అజంతంగా ఉంటుంది. భ్యామ్[1], భిః[2], భ్యః[3], సు మరియు ప్రథమైకవచనంలో (6+1+1 = 8) తుది స్వరమైన ఇకారానికి (న్ లోపించాక) దీర్ఘం వస్తుంది. తక్కిన ప్రత్యయాలు (ఔ[2], అః[4], అమ్[1], అ[1], ఏ[1], ఓః[2], ఆమ్[1], ఇ[1], (2 + 4 + 1+1+1+2+1+1 = 13) పరం కాగా అంగంలో మార్పేమియు రాదు. కాబట్టి ఈ విధంగా ఈ శబ్దానికి రూపక్రమం ఉంటుంది.

| విభక్తులు | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
| --- | --- | --- | --- |
| ప్రథమావిభక్తి | గుణీ | గుణినౌ | గుణినః |
| ద్వితీయావిభక్తి | గుణినమ్ | గుణినౌ | గుణినః |
| తృతీయావిభక్తి | గుణినా | గుణిభ్యామ్ | గుణిభిః |
| చతుర్థీవిభక్తి | గుణినే | గుణిభ్యామ్ | గుణిభ్యః |
| పంచమీవిభక్తి | గుణినః | గుణిభ్యామ్ | గుణిభ్యః |
| షష్ఠీవిభక్తి | గుణినః | గుణినోః | గుణినామ్ |
| సప్తమీవిభక్తి | గుణిని | గుణినోః | గుణిషు |

గుణవత్ అన్నా గుణిన్ అన్నా సమానమే. కాబట్టి రెండు వర్గాలకు చెందిన సుబంతాలు సమానార్థకాలుగా ఉంటాయని ప్రత్యేకించి చెప్పనవసరము లేదు. "గుణవతే కన్యాప్రదేయా" అనే ప్రయోగంలో గుణవతే అనేది చతుర్థీవిభక్తి ఏకవచన ప్రత్యయ సహిత రూపం. దీనికి తుల్యార్థకాన్ని గుణిన్ అనే దాని నుంచి కల్పించాలంటే చతుర్థీ విభక్తి ఏకవచన ప్రత్యయం "ఏ" అనేది ఈ అజాది ప్రత్యయం పరంకాగా అంగం 'గుణిన్' అని నకారాంతంగా ఉంటుంది. కాబట్టి (గుణిన్ + ఏ) గుణినే అనేది చతుర్థీ విభక్తి ఏకవచన ప్రత్యయాంతం. 'గుణవతేకి' పర్యాయపదం గుణినే అనేది.

అభ్యాసం —

గుణిషు, గుణినామ్, గుణినమ్, గుణినః (ముమ్మారు) అనే వీనికి తుల్యార్థకాలను గుణవత్ అనే ప్రాతిపదిక నుండి సుప్పన్నంగావించునది.

ధనిన్, కరిన్ అనేవి గుణిన్ శబ్దము వంటివే. ఈ రెండు ప్రాతిపదికలకు అన్ని విభక్తివచన రూపములను వ్రాయండి.

యశస్విన్ అనునది గుణిన్ శబ్దమును పోలినదే అంటే యశస్వి + 7, యశస్వీ – 1 – మిగిలిన 13 ప్రత్యయాలు పరమైనపుడు అంగం ప్రాతిపదికతో అభిన్నంగా (యశస్విన్) ఉంటుంది.

**ఆత్మన్** అనే నకారాంతం కూడ గుణిన్ మొదలైన శబ్దాలకు వలెనే రూపక్రమం కలిగి ఉంటుంది. హలాది ప్రత్యయాలు పరం కాగా తుది నకారం లోపం వల్ల అంగం ఆత్మ అని ఉంటుంది. ప్రథమైక వచనంలో గుణీ అన్నట్లు ఆత్మా అని దీర్ఘాంతత గలదు.

సర్వనామస్థానము లైదింట ఈ విధంగా ప్రాతిపదికాంతంలో దీర్ఘత గలుగుతుంది. కాబట్టి ఆత్మాన్ అని అంగం. ఆత్మానౌ2 ఆత్మానః1 ఆత్మానమ్1 అని రూపాలు. ఈ పదమూడు పోగా మిగిలిన తొమ్మిది అజాది ప్రత్యయాలు పరంకాగా అంగం ప్రాతిపదికకు అభిన్నంగా ఉంటుంది. కాబట్టి ఆత్మనః3, **ఆత్మనా**1, ఆత్మనే1, ఆత్మనోః2, ఆత్మనామ్1, ఆత్మని1 అని రూపక్రమం.

ఆత్మానః, ఆత్మనః అనేవానికి భేదం గుర్తించండి. హ్రస్వం గల ఆత్మనః ద్వితీయావిభక్తి బహువచనం, పంచమీ, షష్ఠీ ఏక వచనం లోను ఉంటుంది. దీర్ఘంగల ఆత్మానః ప్రథమ బహువచనంలో మాత్రం ఉంటుంది

యజ్వన్, పాప్మన్ మొదలగు **ఆత్మన్** శబ్దమునకు వలెనే రూపక్రమం కలిగి ఉంటవి.

రాజన్ :— సర్వనామస్థానాల్లో దీనికి **ఆత్మన్** శబ్దానికీ వలెనే అంత్యస్వరానికి దీర్ఘంవస్తుంది. కాబట్టి రాజా, రాజానౌ, రాజానః రాజానామ్ అని రూపాలు. హలాది ప్రత్యయాలేడు పరంకాగా ప్రాతిపదిక అంతంలోవి 'న్' కారానికి లోపం వస్తుంది. కాబట్టి రాజాభ్యామ్, రాజభిః, రాజభ్యః, రాజసు అని రూపక్రమం.

మిగిలిన అజాది ప్రత్యయములు (అః3, ఆ1, ఏ1, ఓః2,

ఉస్1, ఇ ,) తొమ్మిది పరమైనపుడు ప్రాతిపదికలో జకారం పై అకారానికి లోపం వస్తుంది. అందువల్ల రాజ్ + న్ అని యుండగా 'త' వర్గాక్షరమైన 'న' కారానికి చ వర్గాక్షరమైన 'జ' కారంతో యోగం కలిగినందున 'న్' స్థానంలో 'ఞ్' వస్తుంది. కాబట్టి అంగం రాజ్ఞ్ అని ఉంటుంది. రాజ్ఞః, రాజ్ఞా, రాజ్ఞేరాజ్ఞోః, రాజ్ఞామ్, రోజ్ఞి అని రూపాలేర్పడుతాయి. సప్తమీవిభక్తి ఏకవచన ప్రత్యయమైన 'ఇ' పరంగా ఉన్నపుడు రాజన్ లోని జకారంపై అకార లోపం వికల్పంగాబట్టి లోపం రానియెడల 'రాజని' అనే మరో రూపం గూడ నిష్పన్నమవుతుంది.

సుత్రామన్ . మహిమన్ మొదలగు శబ్దములు రాజన్ శబ్దము నకు వలెనే రూపక్రమము గలిగి యుండును.

అభ్యాసం :--- అజాది ప్రత్యయములు తొమ్మిది పరముగనున్నపుడు మహిమన్, సుత్రామన్ అనే ప్రాతిపదికల అంగము లెట్లేర్పడునో వివరించండి.

శ్వన్, యువన్ మఘవన్ ఈ మూడు నకారాంతాలే. వీటికి స్వరానికి దీర్ఘం ఆదేశంగా వస్తుంది. అంటే శ్వాన్. యువాన్, మఘవాన్ అని ఏర్పడుతవి. ప్రథమైకవచనంలో ప్రత్యయం లేక పోగా అంగం అంతంలోని న్ లోపిస్తుంది. కాబట్టి శ్వా, యువా, మఘవా అని రూపాలేర్పడుతాయి. ఔ, అమ్, అః మొదలగునవి పరంకాగా శ్వానౌ, శ్వానః, శ్వానమ్ ఇత్యాదిగ రూపాలు. హలాది ప్రత్యయాలు పరంకాగా తుది హల్లయిన 'న్' కారం లోపించి శ్వ, యువ, మఘవ అని రూపాలేర్పడుతాయి. వీనిపై శ్వభ్యామ్, శ్వసు ఇత్యాదిగరూపాలు. ఈ పన్నెండు (5 + 7) ప్రత్యయాలు గాక మిగిలిన తొమ్మిది ప్రత్యయాలు పరంకాగా శ్వన్, యువన్, మఘవన్ అనే ప్రాతిపదికల్లోని 'వ' కారం (అచ్చుహల్లు) 'ఉ' అనే అచ్చుగా మారుతుంది. ఇది యణాదేశానికి ఒక రకంగా విరుద్ధం. దీన్ని సంప్రసారణమంటారు. (హల్మాత్రానికి ఉకారాదులు సంప్రసారణం

సంప్రసారణానికి పరంగా ఉన్న (వకారంపై) అచ్చునకు పూర్వరూపం వస్తుంది. అని మన వ్యాకరణములు) ఈ మార్పురాగా శ్ వ్ + ఉ+న్, యు + ఉ + న్, మఘ+ఉ+న్ అని ఉన్నందున ద్వితీయ రూపంలో సవర్ణదీర్ఘ సంధి. తృతీయరూపతలో గుణసంధి వచ్చినందున శున్, యూన్; మఘోన్ అను రూపాలేర్పడుతాయి. కాబట్టి అజాది ప్రత్యయాలు తొమ్మిది పరంకాగా శునః, మఘోనః. యూనః ఇత్యాదిగ రూపాలేర్పడుతాయి.

ఈ క్రింద గీతలు గల పదములకు రూపనిష్పత్తిని ప్రకృతి ప్రత్యయ వివరణాత్మకముగ వివరించునది.

1) మఘవా బహుళమ్
2) మఘోన స్త్రిదశాన్విహాయ
3) శ్వా మఘోనా సమం స్థితిః
4) యూనోర్దేశాంతర వర్తిత్వం ప్రవాసః
5) లబ్ధ సంయోగయో ర్యూనోః సమాగమకాలాతిక్షేపః
6) శుని చైవ శ్వపాకేచ
7) యువా యుగవ్యాయత బాహురంసలః
8) యూనిలుక్

విద్వస్ :— సకారాంత - వేధస్ వలె, ఇంతేగాక సంప్రసారణం శ్వన్ మొదలగు వాటి యందువలె.

సకారాంతమయిన విద్వస్ అనేదానికి పై తొమ్మిది (అః3 ఆ[1] ఏ1 ఓః2 అమ్1 ఇ1) ప్రత్యయాలు పరం కాగా విద్వస్ లోని 'వ' ఉ' గా మారుతుంది. అకారేత రాచ్చులకు పరంగా ఉన్న స, ష గా మార్పు చెందుతుందనే నియమం వల్ల 'విదుస్' అనేది 'విదుష్' గ మార్పు చెందు తుంది. విదుషః, విదుషా, విదుషే. విదుషోః విదుషామ్, విదుషి ఇత్యాదిగ రూపములు.

హలాది ప్రత్యయములు పరంకాగా విద్వస్‌లోని తుది సకారం తకారంగా మారుతుంది. కాబట్టి అంగం విద్వత్ అని ఏర్పడుతుంది. నాదాక్షరమైన భకారాది ప్రత్యయాలు పరమైనపుడు విద్వత్‌లోని తకారం 'ద్' గ మారుతుంది. కాబట్టి అంగం విద్వద్ అని అవుతుంది. కాగా విద్వద్భ్యామ్, విద్వత్సు అని రూపక్రమము.

సర్వనామస్థానములందు విద్వస్ లోని తుది స్వరానికి దీర్ఘం రావటమేగాక తుది సకారానికి ముందు పొల్లునకారం చేరుతుంది. విద్వాన్స్ అనే అంగం ఏర్పడుతుంది. దీనికి 'ఔ' పరంకాగా విద్వాంసౌ ఇత్యాదిగ రూపాలు. సకారానికి మునుపున్న 'న్' కారానికి అనుస్వారం ఆదేశంగా వస్తుంది. ప్రథమైకవచనంలో తుది హల్లు లోపించినందున విద్వాన్ అని రూపం.

<u>అభ్యాసం :—</u>

1) విద్వానేవ విజానాతి విద్వజ్జన పరిశ్రమమ్
2) ప్రథమే విద్వాంసో వైయాకరణాః
3) అతడు గొప్ప విద్వాంసుడు
4) విద్వాన్ సర్వత్ర పూజ్యతే
5) విద్వాన్విపశ్చిద్దోషజ్ఞః
6) విదుషాలిఖ్యతే గ్రంథః
7) విదుషేదీయతే ధనమ్
8) విదుషః భయం నాస్తి

<u>వేధస్</u> :— 'సు' గాక మిగిలిన హలాది ప్రత్యయాలు పరమైనపుడు వేధస్ అనేది వేధో అని మారుతుంది. (స=ఉ తరువాత గుణసంధి) అజాది ప్రత్యయములు 'సు' అనే హలాది ప్రత్యయం పరంకాగా అంగంలో ఎట్టి మార్పును రాదు. కాబట్టి వేధసౌ వేధసా, వేధసే, వేధస్సు ఇత్యాదిగ రూపాలు. ప్రథమైకవచనంలో ఉపధా దీర్ఘం. మరియు

ప్రాతిపదికాంతంలో గల స్ కారానికి ఆగమంగా విసర్గలు. వేధాః

<u>అభ్యాసం:—</u> వేధసఃఅనేది యేయే విభక్తివచనము లందేర్పడుతుందో వివరించండి.

సు అనే ప్రత్యయం ఎలాంటి అంగంతో చేరుతుంది.? హలాది ప్రత్యయములు పరంకాగా అంగంలో ఎన్ని మార్పులను గుర్తించాలో చెప్పండి.

వేధసి ఏ విభక్తి ఏ వచన రూపము? దీనికి మిగిలిన రెండు వచన రూపాలను (అదేవిభక్తిలో) వ్రాయండి.

తేజోరాజిత రోదో వివరుండు. సమాసములం దుత్తర పదముగా ఓకారాంతముఁగ నున్న ఈపదముల ప్రాతిపదికలను గుర్తించి అచట కలిగిన మార్పును వివరించండి.

శ్రేయస్ :— సర్వనామస్థానము లందు విద్వస్ కు వలెనే ఉపధా దీర్ఘము మరియు తుదిస్వరమునకు పరముగా నకారాగమము శ్రేయాంసౌ, శ్రేయాంసః, శ్రేయాంసమ్ ఇత్యాదిగ రూపక్రమము. ప్రథమైకవచనంలో శ్రేయాన్, అనిరూపం. అంత్యంలోని సకారం లోపిస్తుంది.

హలాది ప్రత్యయాల్లో 'సు' పరంకాగా శ్రేయస్ అనే అంగము. ఇతరత్ర శ్రేయో అని అంగం. $(5+7=12)$ ప్రత్యయములు పోగా మిగిలిన అజాది ప్రత్యయాలు పరమయితే అంగంలో మార్పేమి రాదు. శ్రేయసా, శ్రేయసే ఇత్యాదిగ రూపములు.

<u>అజంత శబ్దరూపనిష్పత్తి - క్రియాపదములు</u>

<u>భవిష్యత్కాల బోధకములు :—</u>

భవిష్యత్కాలాది భేదాలను సూత్రప్రాయంగా చెప్పదలంచిన తార్కికులకే కాలనిరూపణం చిక్కు సమస్యయైనది. వర్తమానాన్ని

ఆధారం చేసికొని భూతకాలాన్నీ భవిష్యత్తునూ వారు నిరూపింప ప్రయత్నించారు. విద్యమాన లేదా వర్తమాన ధ్వంసకు విరుద్ధము విభిన్నము అయినది భూతకాలము వర్తమానమునకు లేదా ఇపుడున్న ప్రాగభావమునకు విరుద్ధమయినది భవిష్యత్తు.

తార్కికుల విభజనలో అభావాలు నాల్గువిధాలుగా ఉంటాయి. ప్రాగభావ, ప్రధ్వంసాభావ అనేవి భవిష్యత్ భూతకాల నిరూపణలో వీరు వాడుకున్నారు.

ఈకాలాన్ని చెప్పటానికి సంస్కృతంలో రెండు లకారా లున్నాయి. నేడు గాక రేపుగానీ, ఆ తరువాత గానీ క్రియా వ్యాపార నిర్వహణం జరిగితే అట్టి వ్యాపారాన్ని 'లుట్' అనే లకారం (అనద్యతనే లుట్ 3-3-15) వల్ల తెలియజేస్తారు తదితర భవిష్య త్కాలముల నన్నింటినీ అంటే అద్యతనాలను ల్పట్ (ల్పట్ శేషే చ 3-3-13) తెలియజేస్తుంది.

ల్పట్ అనే లకార స్థానంలో శతృ, శానచ్ అనే ప్రత్యయాలు చేరటం (ల్పటః సద్వా 3-3-14) గలదు. భవిష్య అనేది ఈ లకారంలో భూధాతుజన్యమైన అంగము. దీనిపైన లట్ అనే లకారం లో వచ్చే ప్రత్యయాలు వస్తాయి, కాబట్టి భవిష్య + తి=భవిష్యతి మొదలగు క్రియాపద లేర్పడుతాయి. శతృ ప్రత్యయం (అత్) చేరి నందున భవిష్య+అత్=భవిష్యత్ ఇత్యాదిగ శత్రంతాలు ఏర్పడుతాయి. భవిష్యత్కాలంలో మనం వాడుకునేదీ విధంగా నిష్పన్నమయినదే.

అయితే ఈ భవిష్య అనే అంగం ఎలా ఏర్పడుతుందనేది ప్రశ్న: ఇందులో 'భూ' అనేది ధాతువు ల్పట్ అనే లకారమూ, లఙ్ అనే లకారమూ పరముగా ఉండే (స్యతాసీ ల్పలుటోః 3-3-33) స్య అనేది వస్తుంది.

ధాతువజంతమైనప్పుడు "స్య" స్పష్టంగా గుర్తింపగలం. పా, యా, దా, స్నా మొదలయిన ఆకారాంత ధాతువులపై లుల్పట్ లో

"స్య" చేరినందున 'యాస్య' 'పాస్య' దాస్య మొదలయిన అంగా లేర్పడుతాయి. వీటిపైన పురుషవచన బోధకమైన 'తి' చేరితే యాస్యతి, స్నాస్యతి, పాస్యతి, దాస్యతి మొదలైన క్రియారూపా లేర్పడుతాయి. శతృప్రత్యయం చేరితే యాస్యత్, దాస్యత్, పాస్యత్ మొదలయిన రూపాలేర్పడుతాయి. పాస్యత్ మొదలగు పిబత్ మొదలైన శత్రంతాలకు వలెనే రూపక్రమం గలిగి ఉంటుంది. స్నాస్యతి మొదలైన క్రియాపదాలకు స్నాతి మొదలైన లట్ రూపాలకు వలెనే తక్కిన పురుషవచన బోధక రూపాలు

అభ్యాసం .– లా, యా, భా, పా, గా, స్నా, ధా అనే ఈ ధాతువులకు ల్ృట్ అనే లకారం పరంగా ఉన్నపుడు ఏర్పడే అగ మాది సహితమయిన అంగాన్ని వ్రాయండి

ఈ యంగముల నుండి ల్ృట్ అనే లకారంలో ఏర్పడే రూపముల నన్ని పురుషవచనములందును వ్రాయండి.

ఈ యంగముల నాధారంగా చేసుకొని వీనిపై శత్రంతరూపము లను నిర్మించి ఆ ప్రాతిపదికలకు అన్ని విభక్తివచనములందును రూపాలను వ్రాయండి.

ఇడాగమము :– సార్వధాతుకార్ధధాతుక విభాగము. ఆర్ధధాతుక ము లందు ధాతువు హలంతమై పరముగ హలాది పదాంశం ఉన్న యెడల ధాతువు తదంశములకు నడుమ 'ఇట్' అంటే హ్రస్వ – ఇ–కారం ఆగమంగా వస్తుంది. ఈ యాగమం కొన్నింటికి నిత్యంగా వస్తుంది. (సేట్) కొన్నింట అసలు రాదు (అనిట్). కొన్నిట వికల్పంగా వస్తుంది (లేట్) లట్, లోట్, లఙ్, విధిలిఙ్ సార్వ ధాతుకములు. శతృ, శానచ్ ప్రత్యయములును సార్వధాతుకములే. సార్వధాతుకము లందు మాత్రమే వికరణ ప్రత్యయాలకు ప్రవృత్తి.

పై నాలుగు గాక తక్కిన లకారములు, శతృ, శానచ్ మొదలైనవి గాక తక్కిన కృత్ ప్రత్యయాలు ఆర్ధధాతుకములు.

తిఙ్ శిత్సార్వ ధాతుకమ్ (3-4-113) ఆర్ధ ధాతుకం శేషః (3-4-114) అనే సూత్రాలీవి ధంగా ధాతువులను విభజింప తోడ్పడినవి.

ఆర్ధధాతుకములలో దేనికి-ఇ-నిత్యం, దేనికి వికల్పం అని చెప్పటం కష్టసాధ్యం. ప్రయోగాలను బట్టి వీటి ప్రవృత్తిని గుర్తింప వలసి ఉంటుంది.

ఈవిధంగా ఇ అనేది నిత్యంగా గానీ వికల్పంగా గానీ ధాతువు నకు ఇడాగమమైన (లృట్ అనే లకారం పరంగా ఉన్నపుడు) 'స్య' చేరుతుంది. సంస్కృతంలో అకారేతరాలయిన అచ్చుల తరువాత ఉండే (ఇణ్కోః 8-3-57) సకారం షకారంగా మారుతుంది. కాబట్టి 'స్య' ష్య గా మార్పు చెందుతుంది. అందువల్ల భూ ధాతువుకు లృట్ పరంకాగా భూ+స్య అని ఏర్పడుతుంది. తరువాత ధాతువులో ఊకారానికి గుణ, అయవాదేశాలు వస్తవి. అందువల్ల భవ్+ఇ+స్య అని అవుతుంది ఇ కారానికి పరంగా ఉన్నందున 'స్య' లోని 'స' కు 'ష' ఆదేశమవుతుంది. అందువల్ల భవ్+ఇ+ష్య= భవిష్య అని అంగం ఏర్పడుతుంది.

అభ్యాసం :— హన్, వధ్, వచ్, వస్, నృత్, కృ, తన్, చింత్ మొదలయిన ధాతువులకు లృట్ పరముగా ఉండగా ఏర్పడే అంగమును వివరించండి.

ఈయంగముల నుంచి పురుషవచన బోధక రూపాలను వ్రాయండి.

ఈయంగము నుంచి శత్రంతాలను నిష్పన్నంగా గావించండి.

ఈ శత్రంతములకన్ని విభక్తివచనములందు రూపక్రమము ను వ్రాయండి.

ఇడాగమ విరహితములు :— కొన్ని హలంతములకు 'స్య' పరం కాగా ఇడాగమం నియతంగా రాకపోవటం కొన్ని ధాతువుల విషయ

మునందు గలదు. మరి కొన్నిట ఈ యాగమం వికల్పంగా వస్తుంది. అలాంటి సందర్భాల్లో ధాత్వంగంలో గల హల్లు మీద హల్లుతో కలసి సంధివల్ల గలిగే మార్పులకు లోనౌతుంది.

'రమ్' ధాతువునకు 'ఇ' చేరితే 'రమిష్య-తి ఇత్యాది రూపములు. 'ఇ' చేరకుంటే రమ్+స్య= రంస్య ఇత్యాదిగ రూపములు. రంస్యతి, రంస్యత్ మొదలయిన రూపములు, అద్+స్యతి=అత్స్యతి.

లుట్ :- లుట్ అనే లకారానికి ప్రథమపురుషలో మూడువచనాల్లో పరస్మై మరియు ఆత్మనేపదములందు ఉభయత్ర డారౌ రసః అనేవి ఆదేశాలుగా వస్తాయి.

(ఆఔఅః) భవితా+ఆ (స్యతాసీ ల్ఌలుటోః)
(రౌ) భవితా+ఔ=భవితారౌ
(రః) భవితా+అః=భవితారః

ఇందు ఇడాగమము నియతము. అద్ మొదలైన హలంత ధాతువులకు ఇడాగమము రాదు. కాబట్టి అద్+తా—అత్తా అని రూపం ఏర్పడుతుంది

| | | | |
|---|---|---|---|
| భూ+తా+ఆ | తా | రౌ | రః |
| భూ+తారౌ | సి | స్థః | స్థ |
| భూ+తారః | స్మి | స్వః | స్మః |

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | భవితా | భవితారౌ | భవితారః |
| మధ్యమపురుష | భవితాసి | భవితాస్థః | భవితాస్థ |
| ఉత్తమపురుష | భవితాస్మి | భవితాస్వః | భవితాస్మః |

అభ్యాసం :— గమ్, హన్, వచ్, తుద్, రుద్, యా, స్నా అనే ధాతువులకు లుట్ రూపాలను వ్రాయండి.

లుట్, ల్ృట్, ఈ రెండు లకారాంతములకు అర్థం విషయంలో గల భేదసామ్యాలను వివరించండి.

1) అహ మధునాగన్తాస్మి
2) సః అద్యగమిష్యతి
3) యాస్య త్యద్య శకుంతలా
4) రాత్రిర్గమిష్యతి
5) హసిష్యతి పంకజశ్రీః
6) భాస్వానుదేష్యతి
7) సుప్రభాతం భవిష్యతి
8) పరిణేష్యతి పార్వతీయదా

పై ప్రయోగములందలి క్రియాపదములను గ్రహించి యందేవి అనద్యతన భవిష్యత్కాల బోధకముతో ఏవి తదన్యములో వివరించి ఆ క్రియాపదముల కన్నింటికి మిగిలిన పురుషవచన రూపాలను వ్రాయండి.

గమిష్యత్, అత్స్యత్, భవిష్యత్, హసిష్యత్, వదిష్యత్, కథయిష్యత్, నర్తిష్యత్, కరిష్యత్, క్రీడిష్యత్, తనిష్యత్ అనే భవిష్యత్ శత్రంతములకు వివిధ విభక్తివచన రూపాలను వ్రాయండి.

ల్ృఙ్ :— ల్ృట్ లో వలె ఈ లకారము నందును భవిష్య అనేది అంగం. లఙ్ లో వచ్చే ప్రత్యయాలు ఈ లకారంలో చేరుతాయి. అయితే ఈ అంగానికి ముందు

| అభవిష్య — | త్ | తామ్ | అన్ |
|---|---|---|---|
| | ః | -తమ్ | – త |
| | మ్ | (అ)వ | (అ)మ |

ఇ అని వీనికి రూపాలు

గమిష్యత్ నుండి ల్ృజ్ రూపాన్ని గుర్తించాలంటే త్ కారంపై ఇని చేర్చటం. మరియు అంగానికి ముందు అకారాన్ని చేర్చటం మాత్రమే.

అ + గమిష్యత్

ల్ృట్ అజంతరూపం. ల్ృజ్ మాత్రం అంతమందు హల్లును కలిగి ఉంటుంది'

లుజ్ అనే లకారము :— భూతకాలంలో వస్తుందని (లుజ్ 3.2.110) వ్యాకరణం వ్యక్తం చేసింది. అద్యతన, అనద్యతన, పరోక్ష, అపరోక్ష అనే అన్ని విధాలైన భూత కాలాలను ఈ లకారం వ్యక్తం చేయజాలి ఉంది. ఈ లకారాన్ని AORIST అని ఆంగ్లంలో వ్యవహరిస్తారు. అద్యతన పరోక్షాది హద్దులు లేనిదైనందున ఈలకారాన్ని వారట్లు వ్యవహరించినట్లు తెలియును.

లజ్ అనే లకారంలో వచ్చే ప్రత్యయాలే దీనికి కూడ వస్తుంది.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | త్ | తామ్ | అన్ |
| మధ్యమపురుష | అః | తమ్ | త |
| ఉత్తమపురుష | అమ్ | వ | మ |

భూ ధాతువునకు —

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
| --- | --- | --- | --- |
| ప్రథమ పురుష | అభూత్ | అభూతామ్ | అభూవన్ |
| మధ్యమ పురుష | అభూః | అభూతమ్ | అభూత |
| ఉత్తమ పురుష | అభూవమ్ | అభూవ | అభూమ |

ఈ లకారంలో 'ఈ' అనే ఆగమం 'నృత్' మొదలగు ధాతువుల్లో వస్తుంటుంది. అనర్తత్ మొదలైనవి ఉదాహరణము. అ+నృత్, ఈ+త్ అని ఇందు విభాగం.

దున్నిట 'సీ' అనేది ఆగమంగా (స్ + ఈ) అస్తుంది. అతేత్సీత్, అకార్షీత్ మొదలయినవి ఉదాహరణాలు.

అకారాంత ధాతువుల్లో ఆగమ విరహితత్వం లక్షణంగా గుర్తించగలం. యా, స్నా, పా, భూ మొదలైన హలంతములలో కొన్నిట ఈకారము, మరికొన్నిట సీ వచ్చును. చుర్ మొదలగు ధాతువులలో ద్విత్వం వస్తుంది. అచూచురత్ అనేదిందులో గుర్తించదగిన ఉదాహరణ.

ఆశీర్లిఙ్ :— ఇందులో వికరణప్రత్యయ ప్రవృత్తి లేదు. పరస్మైపద ధాతువుల విషయంలో 'యా' అనేది ఆగమంగా వస్తుంది. ఈ 'యా' ఉండగా ధాతువునందలి అచ్చునకు గుణాది సంధులు రావు. భూ+యా. విధిలిఙ్ నందువలెనే ఇందును పురుషవచన బోధక ప్రథమపురుషైకవచన ప్రత్యయములు వచ్చును. కావున భూయాత్ అనేది ఈ లకారంలో ప్రథమపురుషైకవచన ప్రత్యయము. హల్మాత్రం పరంగా ఉండగా (ప్రథమ పరుష ఏకవచన) వచ్చే 'యా' అనే ఆగమం అచ్చుతో కలసిన హల్లుండగా 'యాస్' గ మారును,

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | — | తామ్ | అన్ |
| మధ్యమపురుష | అః | తమ్ | త |
| ఉత్తమపురుష | అమ్ | వ | మ |

అనే ప్రత్యయాష్టకం పరం కాగా 'యాస్' గ ఉంటుంది. అంటే అంతంలో సకారం చేరుతుందని గ్రహించాలి. వ్యాకరణ రచయిత 'యాస్' ను ఆగమముగా చెప్పి ప్రథమైకవచనంలో తుది 'స్' లోపిస్తుందని చెప్పియున్నాడు.

"యాసుట్ పరస్మైపదేషూదాత్తో ఙిచ్చ" (3-4-103) అనే సూత్రం యాసుట్‌కు ఉగాగమాన్ని విధించే సూత్రం. లిఙః సలోపోఽనన్త్యస్య 7-2-79 అనే సూత్రం ప్రథమైకవచనంలో సకారలోపాన్ని ప్రతిపాదిస్తుంది.

# PART - VI

## అజంత శబ్ద రూపాలు

శబ్దమంజరి మొదలైన సంప్రదాయ విధేయ సంస్కృత వాచకాల్లో అజంత శబ్దాలు మొదట చెబుతారు. అందులోను అకారాంత పుంలింగాలను మున్ముందుగా చెప్పటం గలదు.

కాని, అక్లిష్టములు, సులభజ్ఞేయము లైనందున ఈ విధానంలో హలంత శబ్దరూపాలను వివరించిన యనంతరం అజంతముల విషయమై ప్రయత్నించు చున్నాము. అందును క్లిష్టతరమయినందున అకారాంతముల ప్రసంగము మిగిలిన యజంతముల తరువాత వస్తుంది.

అజంత శబ్దములలో ఋకారాంతములు తక్కినవాని కన్న సులువుగ నుండును. కావున ఋకారాంతములతో మనమీ యజంత రూపనిష్పత్తి నుపక్రమింతము.

ఋకారాంతములు :— ధాతృ - దీనికి మొదటి యైదు ప్రత్యయము లు (ప్రథమా విభక్తిలో మూడు, ద్వితీయా విభక్తిలో ఏక ద్వివచన ప్రత్యయాలు) పరముగా ఉన్నపుడు ప్రాతిపదిక యందలి ''ఋ'' అనే అచ్చునకు వృద్ధివస్తుంది. అందువల్ల ధాతృ అనేది ధాతార్ అని మార్పు చెందుతుంది. అనంతరము ఔ, అః, అమ్ అనేవి పరమైనందున ధాతారౌ, ధాతారః, ధాతారమ్ అని రూపాలేర్పడుతాయి. ప్రథమైక వచనమైన ''స్'' అనే ప్రత్యయం ధాతార్ అనే దానికి పరమైనపుడు ధాతార్+స్ అని ఏర్పడును. అనంతరము తుది

హల్లులు రెండు లోపించినందున ప్రథమైక వచనంలో ధాతా అని రూపం దీర్ఘాంతముగ నుండును.

ధాతృ అనేదానికి ద్వితీయా బహువచనం "అః" అనేది పరం కాగా 'తస్మాచ్ఛసోనః పుంసి' (6-1-103) అనే సూత్రం చేత ద్వితీయా బహువచనంలో తుది హల్మాత్రమైన సకారస్థానంలో వచ్చిన విసర్గలకు "న్" ఆదేశంగా వస్తుంది. కాబట్టి ధాతృ + అన్ అని యుండగా (ఋ+అ)=ౠ గా మారినందున ధాతౄన్ అని రూపం ఏర్పడుతుంది.

షష్ఠీ బహువచనంలో ఆమ్ పరంగా ఉన్నపుడు ధాతృ+ఆమ్ అనుచో (ఋ+అ) = ౠ వచ్చినందున ధాతౄణామ్ అని అవుతుంది.

పంచమీ, షష్ఠీ ఏకవచనము లందు అః అనే ప్రత్యయం పరంగా ఉన్నపుడు 'ఋ' అనే ప్రాతిపదికాంతంలో అచ్చు 'ఉ' గా మారుతుంది. అనంతరం ఉ+అ=పూర్వ సవర్ణం ఆదేశమయినందున "ఉ" అని ఏర్పడుతుంది. తరువాత విసర్గలతో కలసి రూపము ధాతుః అని అవుతుంది.

ఆ, ఏ, ఓః అనే అజాది ప్రత్యయాలు పరంకాగా యణాదేశం వస్తుంది. కావున ధాత్రా, ధాత్రే, ధాత్రోః అని రూపాలేర్పడుతాయి. సప్తమీ ఏకవచనమైన 'ఇ' పరంగా నిలువగా యణాదేశం రాదు, ఋ కు అర్ అనేది ఆదేశం అవుతుంది. దీన్ని గుణంగా గుర్తించదగును. కావున "ధాతరి" అని రూపం ఏర్పడుతుంది.

హలాది ప్రత్యయములైన భ్యాం, భిః, భ్యసు అనేవి పరంగా ఉన్నపుడు అంగము నందు మార్పేమియునుండదు. ధాతృభ్యామ్ ఇత్యాదిగ రూపములు, సప్తమీబహువచనంలో సకారానికి షత్వం వస్తుంది కాబట్టి ధాతృషు అని రూపం ఏర్పడుతుంది.

అభ్యాసం — కర్తృ, భర్తృ, భ్రాతృ, సవితృ, జామాతృ, క్రోష్టృ మొదలైన ఋకారాంతముల కన్ని విభక్తి వచన రూపాలను వ్రాయండి.

ఇకార, ఉకారాంతములు :— హరి, శంభు మొదలైనవి. ప్రథమైకవచనంలో విభక్తిప్రత్యయమైన 'స్' అనేది విసర్గల రూపంలో ఈ రెండు వర్గాలకు చెందిన శబ్దాలకు అంతంలో నిలచి ఉంటుంది. అందువల్ల హరిః, శంభుః అని ఈ ప్రాతిపదికలకు ప్రథమైకవచన రూపాలు. ప్రథమా ద్వితీయా ద్వివచనంలో ప్రాతిపదికలకు అంతంలో గల స్వరాలకు దీర్ఘం రావటం ఈ రెండచ్చులంత మందున్న సుబంతాలకున్నూ తుల్యము. అందువల్ల హరీ, శంభూ అని వాని ద్వివచన రూపాలు. ప్రథమ మరియు ద్వితీయా ద్వివచనాలివి. ప్రథమా బహువచనం అః పరమైతే వీటికి గుణ అయవాదేశాలు వస్తాయి. కాబట్టి హరయః శంభవః అని వీనికి రూపాలు నిష్పన్నాలవుతాయి.

ద్వితీయైక వచనంలో అమ్ పరము కాగా పూర్వరూపం ఏకాదేశంగా వస్తుంది కాబట్టి హరిమ్, శంభుమ్ అని రూపాలు. ద్వితీయా ద్వివచనం ప్రథమా ద్వివచనం వలెనే ద్వితీయా బహువచనంలో అంత్యస్వర దీర్ఘం మరియు హల్మాత్రమైన స్ అనే దానికి 'న్' కారం ఆదేశం. ఇంకు మునుపుగా పూర్వ స్వరైకాదేశం. అందువల్ల హరీస్, శంభూన్ తస్మాచ్ఛసో నః పుంసి (6-1-103) అనే సూత్రం భప్ లో (ద్వితీయా బహువచనం) సిస్ కారానికి "స్" ను విధించే సూత్రము.

భ్యామ్, భిః, భ్యః, సు అనే ప్రత్యయాలు పరంగా ఉంటే ప్రాతిపదికలో మార్పేమియు రాదు. సులోని ష కారానికి షత్వం వస్తుంది. తృతీయా ఏకవచనం 'ఆ' పరంగా ఉండగా సంధి నివారితమై నడుమ 'న్' వస్తుంది. ణత్వం వస్తే హరిణా అనిన్నీ, ణత్వం లేనందున శంభునా అనిన్నీ రూపాలు

చతుర్థ ఏకవచనంలో 'ఏ' పరంగా ఉండగా గుణ. అయవా దేశాలు వస్తాయి. అందువల్ల హరయే, శంభవే అని రూపాలు.

పంచమీ, షష్ఠీఏకవచన ప్రత్యయమైన అః పరం కాగా పూర్వ మందలి స్వరానికి గుణంవస్తుంది. అనంతరం పూర్వ రూప సంధి, దానివల్ల హరేః, శంభోః అని రూపాలు.

షష్ఠీ. సప్తమీ ద్వివచనమైన హరీన్, శంభూన్ అనేవి ఆమ్ పరంకాగా అంగములు కాన హరీణామ్ (ణత్వం), శంభూనామ్ అని రూపములు,

సప్తమీ ఏకవచనమైన ఇ పరంకాగా ప్రాతిపదిక అంతంలోని స్వరానికి ఔ ఆదేశంగా వస్తుంది. ప్రత్యయసంబంధి 'ఇ' లోపిస్తుంది,

ఇకార ఉకారాంత నపుంసకలింగములు కూడ తృతీయావిభక్తి మొదలు అంతము వరకును పుంలింగములకు వలెనే రూపక్రమము. మొదటి రెండు విభక్తులందు

వారి వారిణీ వారీణి

మృదు మృదునీ మృదూని

అని రూపాలు ద్వితీయా విభక్తిలో కూడ యింతే రూపములు. శేషం పుంవత్.

అభ్యాసం :— గిరి, గురు, ముని, తరు అనే శబ్దాలకన్ని విభక్తిరూపాలను వ్రాయండి.

శుచి, పటు అను నపుంసక ప్రాతిపదికల కన్ని విభక్తివచన రూపాలను వ్రాయండి.

<u>అకారాంతము :</u>— రామ శబ్దంలో ప్రథమైకవచనం వారి మొదల యిన వాటికి వలెనే విసర్గాంతంగా (రామః) అని ఉంటుంది. ప్రథమ

ద్వితీయా ద్వివచనంలో ఔ అనేది రామతో సంబంధించినందున రామౌ అని రూపం ఏర్పడుతుంది. రామ శబ్దానికి ప్రథమా బహువచన ప్రత్యయం పరంకాగా సంధి వస్తుంది. కాబట్టి రామాః అని రూపం ఏర్పడుతుంది.

ద్వితీయావిభక్తి ఏకవచనంలో అమ్ పరంకాగా పూర్వ రూపం వస్తుంది కాబట్టి రామమ్ అని అవుతుంది. ద్వితీయా బహువచనంలో సవర్ణదీర్ఘత వస్తుంది తుది విసర్గలకు 6-1-103 వల్ల ''న్'' కారం వచ్చినందున 'రామాన్' అని రూపం ఏర్పడుతుంది.

తృతీయావిభక్తి ఏకవచన ప్రత్యయానికి బదులుగా ''ఇన'' అనేది పంచమ్యేకవచనానికి 'అత్' అనేది వస్తుంది. కాబట్టి రామ + ఇన=(ణత్వం) రామేణ. తృతీయా, చతుర్థీ పంచమీ ద్వివచన మయిన భ్యామ్ పరంకాగా తుది స్వరానికి (ప్రాతిపదికలో) దీర్ఘం వస్తుంది కాబట్టి రామాభ్యామ్, తృతీయా బహువచనంలో ''భిః'' కి బదులుగా ఐః వస్తుంది. సంధివల్లరూపం రామైః అని ఏర్పడు తుంది. ఙేర్యః 7- -13 అనే సూత్రం చేత చతుర్థీ ఏకవచనంలో ''య'' వస్తుంది. ప్రాతిపదిక అంతంలో దీర్ఘం వస్తుంది కాబట్టి రామాయ అని రూపం కంటుంది. భ్యః అనే చతుర్థీ పంచమీ సప్తమీ బహువచన ప్రత్యయాలకు ముందు 'ఇ' చేరుతుంది. రామ + ఇ+భ్యః. సంధివల్ల రామేభ్యః అని ఏర్పడుతుంది.

పంచమ్యేక వచనంలో అత్ అనే ప్రత్యయం విహితమైనందున రూపం రామాత్ అని ఏర్పడుతుంది.

షష్ఠీ ఏకవచనంలో 'స్య" వస్తుంది. కాబట్టి రామస్య. షష్ఠీ సప్తమీ ద్వివచనంలో రామ+ఓః అని యుండగా సంధిని నివారింప యకారం వచ్చినందున రామయోః అని రూపం నిష్పన్నమవుతుంది. షష్ఠీ బహువచనంలో రామ+అమ్ అని యుండగా ప్రాతిపదిక తుది స్వరం దీర్ఘమయినందున (ణత్వం) రామాణామ్ అని రూపం ఏర్పడు

తుంది. సప్తమ్యేక వచనంలో రామ+ఇ అని ఉండగా గుణము వచ్చినందున రామే అని రూపం ఏర్పడును.

<u>అభ్యాసము :</u>— గోవింద, ముకుంద, వృక్ష, గజ, అశ్వ శబ్దముల కన్ని విభక్తి వచన రూపాలను వ్రాయండి.

<u>శతృ శానజంతాలు :</u>— సంస్కృత ధాతువులపై శతృ శానచ్ అనే ప్రత్యయాలు చేరినందున క్రియాజన్యాలయినందున కాలబోధక విశేష ణాలను ఏర్పాటు కావించనగును.

<u>ఆత్మనే పరస్మైపదులు :</u>— సంస్కృతంలో ఆత్మనే, పరస్మై అని వేర్వేరు పదులున్నాయి. శానచ్ (ఆన) ఆత్మనే పదాలపైనే చేరు తుంది. శతృ (అత్) పరస్మై పదాలపైన మాత్రమే చేరుతుంది. కొన్ని ధాతువులుభయ పదులు. వానిపై ఈ ప్రత్యయములు రెండును చేరటం గలదు. భూ, హన్, నృత్ మొదలైనవి పరస్మై పదులు, ముద్, యుధ్ మొదలైనవి ఆత్మనే పదులు. రమ్, చుర్ మొదలగునవి ఉభయపదులు. శతృ శానజంతాలు సార్వ ధాతుకాలైనందున వికరణ ప్రత్యయ సహితాలై ఉంటవి. భవతి లో తుది స్వరాన్ని తొలగిస్తే దాని శత్రంతం ఏర్పడుతుంది. భూ+ అ+అత్ కలియగా ఈ రూపం ఏర్పడుతుంది. శానచ్, ఆన మిగుల్తుంది. యుధ్య అనే వికరణ ప్రత్యయ సహిత రూపానికి ప్రత్యయం (ఆన) చేరగా నడుమ పొల్లు మ కారం వస్తుంది కాబట్టి యుధ్యమాన అని ఏర్పడుతుంది.

చిన్నయసూరి నీతి చంద్రికలో— ''యుధ్యన్మేష మధ్యంబు'' అని ప్రయోగించి యుండటాన్ని గిడుగువారు గుర్తించి 'యుధ్యామ' నకు 'యుధ్యత' అని సూరివంటి వ్యాకర్తయే ప్రయోగింపగా ఇంక లక్షణవిరుద్ధ ప్రయోగాలు సామాన్యకవులు చేయుట అసహజంకాదనీ, మన భాషకున్న లక్షణం అసమగ్రమనీ వాదించిన విషయం మనకు తెలియనిది కాదు.

ఆత్మనేపద ధాతువులకు తెలుగులో వలె గాక ప్రత్యయాలు వేరుగా ఉంటవి. తెలుగులో ధాతు ప్రత్యయాలకు నడుమ కొను. చేరితే అది ఆత్మనేపదం. ప్రత్యయాల విషయమై సంస్కృతంలో వలె ప్రత్యయ భేదంలేదు.

సంస్కృతంలో లట్ లో వచ్చే ఆత్మనే పద ప్రత్యయాలు.

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | తే | ఇతే | అన్తే |
| మధ్యమపురుష | సే | ఇధే | ధ్వే |
| ఉత్తమపురుష | ఏ | ఆవహే | ఆమహే |
| ప్రథమపురుష | మోదతే | మోదేతే | మోదన్తే |
| మధ్యమపురుష | మోదసే | మోదేధే | మోదధ్వే |
| ఉత్తమపురుష | మోదే | మోదావహే | మోదామహే |

ముద్ ధాతు వాత్మనే పదమయినందున ప్రత్యయాలు చేరి పై రూప క్రమమేర్పడినది. ఆత్మనే పదమునందు కూడ వికరణ ప్రత్యయాదులు చేరుతుంటవి. పై ఉదాహరణంలో ముద్ అనేది ధాతువు. "ఇ" మొదటి వర్గానికి చెందినందున 'అ' వికరణ ప్రత్యయం వస్తుంది. ఈ ప్రత్యయం పరంగా ఉన్నందున ధాత్వాదిలో గల 'ఉ' అనే అచ్చునకు గుణం వస్తుంది. కాబట్టి మోద అని ఏర్పడుతుంది.

అభ్యాసము :— ఏధ, స్పర్ధ, బాధృ, గాధృ, వది, స్పది, క్లిది, దధ, గ్రథి, చితీ మొదలగు భ్వాది గణ పఠిత ధాతువులకు (ఆత్మనే పది) లట్ రూపములను వ్రాయండి.

ఆత్మనేపద ధాతువుల లోట్, లఙ్, విధిలిఙ్ అనే ధాతువులపై చేరే ప్రత్యయాలను క్రింద యిస్తున్నాను.

లోట్

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | తామ్ | ఇతామ్ | అన్తామ్ |
| మధ్యమపురుష | స్వ | ఇథామ్ | ధ్వమ్ |
| ఉత్తమపురుష | ఇ | వహై | మహై |

లఙ్

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమపురుష | త | ఇతామ్ | అన్త |
| మధ్యమపురుష | థాః | ఇథామ్ | ధ్వమ్ |
| ఉత్తమపురుష | ఇ | వహి | మహి |

గమనిక :— పై రెండు లకారాలకు గలిగే ప్రత్యయాలలో సాదృశ్యం గుర్తించండి. మధ్యమైక వచనంలో గాక తక్కిన ప్రత్యయము లెనిమిది సమానము లనేది గుర్తింపదగినయంశము.

విధిలిఙ్

| పురుషవాచకం | ఏకవచనం | ద్వివచనం | బహువచనం |
|---|---|---|---|
| ప్రథమ పురుష | (ఇ) త | (ఇ) తామ్ | (ఇ) యుః |
| మధ్యమ పురుష | (ఇ) ః | (ఇ) తమ్ | (ఇ) త |
| ఉత్తమ పురుష | (ఇ) యమ్ | (ఇ) వ | (ఇ) మ |

గమనిక :- అంగము అకారాంతమయిన ప్రత్యయాది, ఇకారంతో గలసి ఏగా మారి తరువాత ప్రత్యయ భాగము చేరును. మోద+ ఇ+త=మోదే+త=మోదేత

అకారేతరముగా అంగమున్నచో "ఇ" కి మారు 'యా' వచ్చును. తను+ఉకారాంతమయినందున పై ప్రత్యయము లన్ని యు ఇ కారమునకు మారుగ 'యా' ను కలిగియుండును తను+యాత్.

కర్మణి ప్రయోగము

కర్మకు ప్రాధాన్యాన్నిచ్చే ప్రయోగాన్ని కర్మణి ప్రయోగ మంటారు. క్రియచే కర్మ ఉక్తమయితే (చెప్పబడుట) కర్మణి ప్రయోగము... రావణః హన్యతే అనేటప్పుడు హన్యతే అనే క్రియకు ముందు కః అనేదాన్ని ఉంచి ప్రశ్నార్థక వాక్యాన్నేర్పాటు (కః హన్యతే) చేసుకున్నప్పుడా ప్రశ్నకు సమాధానంగా రావణః అనేదీ వాక్యంలో వస్తుంది కాబట్టి ఇక్కడ 'రావణ' అనేది ఉక్తము. రావణ కర్మ అయినందున కర్మ ఉక్తమయి నందున దీన్ని కర్మకు ప్రాధాన్యంగల ప్రయోగ మంటారు. కర్మన్ అనే దానికి సప్తమీ విభక్తి ఏకవచన రూపం కర్మణి అనేది.

అలాకాకుండ కర్తకు ప్రాధాన్యాన్నిస్తూ ప్రయోగించినచో రామః హన్తి లేదా రామః జఘాన అనేది కర్తరి ప్రయోగము. కర్తృ అనేదానికి సప్తమీవిభక్తి ఏకవచన ప్రత్యయ సహిత రూపము కర్తరి ప్రయోగము.

కర్మణి ప్రయోగంలో ధాతు ప్రత్యయాలకు నడుమ 'య' అనేది నియతంగా చేరుతుంది. తెలుగులో ఈ సందర్భంలో 'పడు' చేరు తుందని బాల వ్యాకరణము (క్రియ-49 సూ.) కాబట్టి 'భూయ' అనే అంగం ఏర్పడుతుంది. ఇక్కడి వివరణ ప్రత్యయాదు లేమియు రావు.

ఈ యంగములపై, అనగా కర్మణిలో ఆత్మనే పద ప్రత్యయ ములు మాత్రమే చేరుతవి. పరస్మైపద ప్రత్యయములు చేరవు.

'భూయతే' ఇత్యాదిగ రూపములు. 'పా' (త్రాగు) మొదలైన ఆకారాంత ధాతువులకు 'య' పరం కాగా, 'ఆ=ఈ' గా మారుతుంది. కాబట్టి పా+య=పీయ అని ఏర్పడుతుంది. దా=దీయతే. ధా=ధీయతే.

'కృ' ధాతువు 'క్రి' గా మార్పు చెందుతుంది. క్రియతే మృ=మ్రి=మ్రియతే.

హలంత ధాతువులందు మార్పేమియు నుండదు. గమ్యతే, హన్యతే, వధ్యతే మొదలగునవి.

ౠకారాంత ధాతువుల్లోని "ౠ" కుమారుగా ఈర్ వస్తుంది. తౄ =తీర్యతే. జౄ=జీర్యతే (ౠత ఇద్ధాతో: 7-1-100) హ్రస్వమునకు (ఋ=ఇ) హ్రస్వము. దీర్ఘమునకు (ౠ=ఈ) దీర్ఘం వస్తాయి. (ఉరణ్ రపర: 1-1-51) అనే సూత్రంచే ఈ ఆదేశాల అంతమునందు 'ర్' ను కలిగి ఉంటాయి.

కర్మణి ప్రయోగంలో అన్ని లకారాలు ఆత్మనే ప్రత్యయాలను మాత్రమే కలిగి ఉంటాయి.

ఇంతవరకు వివిధ సుబంతాల రూపనిష్పత్తిని పుంలింగంలో నేర్చుకున్నాం.

సుబంతాలు – నపుంసకలింగం :——

నపుంసకలింగ సుదంతాలు తృతీయైక వచనం నుంచి చివరి వరకు పుంలింగ శబ్దాలకు వలెనే రూపక్రమం కలిగి ఉంటాయి. ప్రథమావిభక్తిలో అకారాంత నపుంసక లింగంలో జ్ఞానమ్. జ్ఞానే, జ్ఞానాని అని ఉంటుంది. ద్వితీయావిభక్తిలో కూడ ఇంతే. అనంతరం పుంలింగమైన రామశబ్దాదులకు వలెనే రూపాలు (తృతీయ మొదలు సప్తమీ విభక్తి వరకు)

మనస్, తపస్ అనేవి సకారాంత నపుంసకలింగాలు. వీనికి

ప్రథమావిభక్తిలో మనః, మనసీ, మనాంసి అని రూపాలుంటాయి. ద్వితీయావిభక్తిలో కూడ ఈవిధంగానే రూపత్రయం ఉంటుంది. అనంతరము పుంలింగ శబ్దమైన వేధస్ మొదలైన సకారాంతములకు వలెనే రూపక్రమము.

జగత్ అనేది తకారాంత నపుంసకలింగము. దీనికి జగత్, జగతీ, జగన్తి అని ప్రథమా విభక్తిలో రూపాలు. ద్వితీయావిభక్తిలో కూడ ఈవిధంగానే వచనత్రయంలో రూపక్రమం. తృతీయా ఏకవచనం నుంచి తుది వరకు తకారాంత పులింగమైన 'మరుత్' మొదలైన శబ్దాలకు వలెనే రూపక్రమం ఉంటుంది.

ఇకారాంతమలైన 'వారి' మొదలైన నపుంసకలింగ శబ్దములకు తృతీయా ఏకవచనం నుంచి పుంలింగములకు వలెనే రూపక్రమము. ప్రథమావిభక్తిలో వారి - వారిణీ - వారీణి అని రూపాలుంటాయి. ద్వితీయలో కూడ ఇదే రూపములు.

ఉకారాంతములు నపుంసకలింగములైన మధు మొదలైన వానికి మధు-మధునీ-మధూని అని ప్రథమావిభక్తిలో రూపములు. ద్వితీయా విభక్తిలో కూడ రూపములంతే. తృతీయావిభక్తి ఏకవచనం నుంచి తుది వరకు ఉకారాంతమైన పుంలింగ శబ్దాలకు వలెనే రూపక్రమము.

శబ్దమంజరి :-- శబ్దాలను అధ్యయనం చేసే మంజరిలో ముందు అజంతాలు తరువాత హలంతాలు ఉంటాయి. కాని రూపనిష్పత్తి దృష్టితో పరిశీలిస్తే హలంతాల రూపసాధన సుగమము. అజంతాల రూపము కొంత క్లిష్టము. అజంతాల్లో తుది స్వరమైనందున అకారాంత శబ్దాలను ఆదిలో ఇస్తారు. కాని అకారాంతాలకన్న ఇకార, ఉకారాంతాల నిష్పత్తి సులభతరము. అంతకన్న ఋకారాంతాల నిష్పత్తి సులభతరము, అక్లిష్టము. అందువల్ల ముందుగా ఋకారాంతాలను తరువాత ఉకార, ఇకారాంతాలను వివరించి తుదకు అకారాంతాలను గూర్చిన వివరాలనీ గ్రంథంలో ఇస్తున్నాను.

శబ్దమంజరిలో నపుంసకలింగ శబ్దాలకు ప్రథమావిభక్తి రూపాలను వ్రాసి, మరల వాటినే ద్వితీయా విభక్తిలో గూడ ఇచ్చి తరువాత 'శేషం పుంవత్' అని అనటం పరిపాటి. తృతీయా మొదలు ఆయా అంజతాలకు పుంలింగంలో రూపక్రమం ఎలా ఉంటుందో ఆవిధంగానే నపుంసకలింగాలకు కూడ ఉంటుందని వారి అభిప్రాయం. పుంలింగమైన శంభుకు తృతీయైక వచనంలో శంభునా అని ఉంటుంది. ఇందులో "శంభు-నా' అని విభాగం. అలాగే నపుంసకలింగమైన 'మధు' అనే దానికి 'మధునా' అని ఉంటుంది. సప్తమీ ఏకవచనంలో 'శంభౌ' వలెగాక 'మధుని' అని ఉంటుందని గ్రహింపగలము.

నామధాతువులు :— నామాలను ధాతువులనుగా గల్పించి వానిపై నుండి క్రియారూపాలను నిష్పన్నం గావించి ప్రయోగించుట గలదు. ఆంగ్లంలో hand అనేది నామంగా ఉన్నపుడు 'చేయి' అనే అర్థాన్నిస్తుంది. చేయు అనేటప్పుడు ఈ నామం ధాతువుగా ప్రయుక్తమవుతుంది. hand over అందించు మొదలైన అర్థాలనీ ధాతువునుండి వారు కల్పించటం మనకు సుపరిచితము.

పుత్ర అనేది ఒక సుబంతము. ఇష్ అనే ధాతువు ఇచ్ఛార్థకము. ఈ ధాతువున కర్మగా ఉండదగిన దానికి ఇచ్ఛార్థంలో క్యచ్ (సుప ఆత్మనః క్యచ్ 3-18) అనే ప్రత్యయం వస్తుంది. ఇందులో 'య' మిగులుతుంది. దశరథః పుత్ర మిచ్ఛతి అనే వాక్యంలో ఇష్ ధాతువునకు ఈ వాక్యంలో పుత్ర అనేది కర్మ. దీనికి పై సూత్రం చేత 'య' చేరినందున పుత్ర+య అని అవుతుంది. పుత్రశబ్దంలో తుది అకారానికి (క్యచిచ 7-4-33) "ఈ" కారం ఆదేశమవు తుంది. పుత్రీయ అని అవుతుంది. దీనిపై లట్ అనే లకారానికి పరస్మైపదంలో వచ్చే ప్రత్యయాలు చేరగా పుత్రీయతి, పుత్రీయతః, పుత్రీయంతి ఇత్యాదిగ రూపాలేర్పడుతాయి. నామధాతువులందు వికరణ ప్రత్యయముల ప్రసంగములేదు. అన్ని లకారములందును నామ ధాతువులు నిష్పన్నము లవుతాయి.

'దశరథః పుత్రమిచ్ఛతి'లో Verb Phrase అయిన పుత్ర మిచ్ఛతికి బదులుగా పుత్రీయతి అని వాడవచ్చు అప్పుడు 'దశరథః పుత్రీయతి' అని అవుతుంది. 'కృషీవలః వర్షమిచ్ఛతి' అనే వాక్యా నికి మారుగ 'కృషీవలః వర్షీయతి' అని ప్రయోగించవచ్చును. 'చోరః ధనమిచ్ఛతి' అనే వాక్యానికి బదులుగ 'చోరః ధనీయతి' అని అనవచ్చును.

'సేవకః గామిచ్ఛతి' అనే వాక్యంలో గామిచ్ఛతి అనేదానిలో 'గామ్' అనే విభక్తిప్రత్యయ లోపం రాగా 'గో' అని అవుతుంది. అనంతరం పై సూత్రంచేత 'య' చేరగా గో+య. అయవాదేశ సంధి వస్తుంది. కాబట్టి 'గవ్య' అని అవుతుంది. ఇక్కడ 'ఈ' కారం రాదు. 'గవ్యతి అని రూపాలేర్పడుతాయి. 'గామిచ్ఛతి' కిది పర్యాయం. 'నావమిచ్ఛతి లో నావమ్ అనేదానిలో 'నౌ' అనేది ప్రాతిపదిక. దీనికి పై సూత్రం చేత 'య' అనే ప్రత్యయం చేరి నందున అయవాదేశం వచ్చి నౌ+య=నావ్య అని ఏర్పడుతుంది. దీనిపై పురుషవచన బోధక ప్రత్యయాలు చేరినందున 'నావ్యతి' ఇత్యా దు లేర్పడుతాయి. ''లోట్'' నావ్యతి

'లఙ్' అనావ్యత

'విధిలిఙ్' నావ్యేత్

ఇత్యాదిగ రూపాలు. వీటికి ''లిట్'' లో కృ. భ. అస్తి అగము సహితాలు మాత్రమే. ఏర్పడుతాయి.

నావ్యాం చకార

నావ్యాం బభూవ

నావ్యాం మాస

ఇత్యాదిగ రూపాలు.

గవ్యాం చకార

గవ్యాం గల్పితా (లుట్)
గవ్యాం గల్పిష్యతి (లృట్)

ఇత్యాదిగ రూపాలు.

"ప్రజాః రాజానమిచ్ఛంతి" అనేవాక్యంలోని Verb Phrase ను వివరిస్తే రాజన్+క్య అని ఏర్పడుతాయి. తుది 'న' కారం లోపింపగా రాజ+య అకారాంతమయినందున తుది "అ"- "ఈ" గా మారి "రాజీయ" అని అవుతుంది. దానిపైనుంచి రాజీయతి ఇత్యాదిగ రూపములు.

త్వదాగమము, మద్భాగ్యము మొదలయిన సమాసాల్లో యుష్మద్, అస్మద్ శబ్దములకు మారుగ త్వద్, మద్ అనేది నిలిచి యున్నాయి. వీనిపై "య" చేరి పురుషవచన బోధకాలు చేరి నందున త్వద్+య+తి=త్వద్యతి, మద్యతి మొదలయిన రూపాలు ఏర్పడుతున్నాయి. త్వద్, యద్ అనేవాని పర్యాయాలైన యుష్మద్, అస్మద్ అనేవానికి గూడ 'య' చేరినందున యుష్మద్యతి, అస్మద్యతి అని ఏర్పడుతాయి.

హలంతమైన గీర్ అనేదానికి 'య' చేరినందున గీర్యతి మొదల యిన రూపాలు నిష్పన్నాలవుతున్నాయి.

మకారాంతములకు అవ్యయములకు "క్యచ్" అనే ప్రత్యయం రాదు కాబట్టి కిమిచ్ఛతి, సరిచ్ఛతి అనే అవుతుంటాయి.

అశ్వ క్షీర వృషల వనములకు క్యచ్ పరంకాగా నడుమ అస్ వస్తుంది.. అశ్వమిచ్ఛతి అనే Verb Phrase అశ్వ + య అని ఉండగా ఈకారం అకారానికి వచ్చి అశ్వీయతి అని గావలసియుండగా అట్లుగాక 'అస్' వచ్చినందున (7-1-51) —

అశ్వ+అస్+య=అశ్వస్య అనియై మరల 'తి' మొదలయినవి చేరినందున 'అశ్వస్యతి బడబా' ఇత్యాదిగ రూపాలు ఏర్పడుతున్నాయి.

క్షీరస్యతి (క్షీరీయతి కి మారుగ), లవణస్యతి (లవణీయతి కి బదులుగ) ఏర్పడినట్లు గుర్తింపదగును. ఇకారాంతములకు ఉకారాంతములకు 'స్య' వస్తుంది. (య with initial position ) కాబట్టి దధిస్యతి (దధిమిచ్ఛతి VP ) మధుస్యతి (మధుమిచ్ఛతి NP ) ఏర్పడుతున్నవి.

ఆచారార్థంలో ఉపమానవాచకాలకు క్యజ్ వికల్పంగా వస్తుంది. ఈ ప్రత్యయం (క్యజ్) జిత్తయి నందున కేవలము ఆత్మనేపద ప్రత్యయములనే యంతము నందు గలిగి ఉంటుంది. విద్వస్ స లోపం. విద్వాయతే సలోపం రానందున విద్వస్యతే. కృష్ణతి. ఉపమానంలో కృష్ణ ఇవాచరతి, అతి అఙ్ చరతి. అనునాసికాంతములకు ఉపధా దీర్ఘంవస్తుంది. ఉపమానార్థంలో రాజా ఇవ ఆచరతి, రాజన్+తి, రాజాన్+తి=రాజానతి, పథిన్+తి=పథీనతి. సుమన్ + యతే= సుమనాయతే (ణిచ్ =అయ వచ్చినందున)

<u>ణిజంత ప్రక్రియ</u> .— దీన్నే తెలుగులో ప్రేరణార్థక మంటారు. 'ణిచ' అనేదే యర్థంలో సంస్కృతంలో చేరుతుంది. 'ణిచ్' వల్ల ధాతువులోని స్వరానికి ఆదివృద్ధి వస్తుంది. 'ణిచ్' లో శేషించేది "ఇ". ఇది 'అయ్' గా మారుతుంది. గుణ, అయవాదేశముల వల్ల భూ+ఇ+తి, భావయ్+తి=భావయతి ఆత్మనే పదంలో భావయతే. శీ=శాయయతి. స్థా=స్థాపయతి.

<u>సన్నంతములు:</u> — ఈ ప్రత్యయములు పండ్రెండు ఉన్నట్లుగా గుర్తించారు. మొదటిది సన్, ఇది ఆర్ధ ధాతుకము వంటిది. అంటే ఇది పరంగా ఉండే వికరణ ప్రత్యయాలకు ప్రాప్తి లేక పోగా వలాది ప్రత్యయాలు పరంగా ఉన్నపుడు 'ఇట్' మొదలైనవి నిత్యంగా ను వికల్పంగా వస్తుంటాయి. ధాతువునకు ద్విరుక్తి గమ్.

గమ్+ఇ+స+తి=జిగమిషతి

రుద్=రురుదిషతి

విద్ = వివిదిషతి

గ్రహ్ = జిఘృక్షతి

జ్ఞా = జిజ్ఞాసతి

జి = జిగీషతి

ఈ రూపాలనుంచి అకార, ఉకారాంత ప్రత్యయాలను 'సన్' కు బదులుగ చేర్చితే నామరూపాలేర్పడుతాయి. రురుదిషా, రురుదిషుః; వివిదిషా, వివిదిషుః; జిఘృక్షా, జిఘృక్షుః; జిజ్ఞాసా, జిజ్ఞాసుః; జిగీషా, జిగీషుః మొదలైనవి గుర్తింపదగును.

నామములపై క్యచ్ రావటం కూడ సన్నంతాల్లోనే కొందరు చేర్చారు. అంటే సన్నంతముల విషయంలో వైవిధ్యం తరువాతి కాలంలో గలిగింది. క్యచ = పుత్రీయతి, కామ్యచ. పుత్రకామ్యతి ఆచార్థంలో క్విప్. పుత్రాయతే.

ఇయాయ. ఈ యఙ్, ణిజ్ అని సనాదుల పరిగణన.

సంచవృత్తులు :— 'పుత్ర మాత్మన ఇచ్ఛతి' అనే వాక్యార్థాన్ని 'పు[్రీ]యతి' అనేది చెప్పగలిగి ఉంది. పుత్రీయతి అనేదానికి గల అర్థాన్ని వివరించగలిగి ఉండటం 'పుత్రమాత్మన ఇచ్ఛతి' అనే Phrase కు గలదు. 'పుత్రీయతి' తనలో లేని పదాల అర్థాన్ని (పరార్థ అభిధానం) చెప్పగలిగి ఉంది. ఇలా చెప్పగలగటాన్నే వృత్తి అన్నారు మన ప్రాచీనులు. వృత్తికి గల అర్థాన్ని వివరించి చెప్ప టానికి ఉద్దేశించిన వాక్యము (పుత్రమాత్మన ఇచ్ఛతి) అనేది విగ్రహ మంటారు. వృత్తి యొక్క అర్థాన్ని వివరించి చెప్పటానికి ఉద్దేశించిన వాక్యమే విగ్రహము.

సనాది ధాతు రూపవత్తి గాక కృదంతాలు, తద్ధితాంలు కూడ వృత్తులే. అంటే వీటి కన్నిటికి పరార్థాభిధానత ఉంది. అని గ్రహించాలి. వీటికి గూడ విగ్రహాలు ఉంటుంది. వృత్తుల్లో ఒక పైనసమాసానికే విగ్రహం ఉంటుందని మనం వింటుంటాం. కాని,

తదన్యార్థైన కృదంతాలకు. తద్ధితాంతాలకు, సనాద్యంతాలకు వృత్తి అనే పేరే గాక విగ్రహం ఉంటుంది. వృత్తుల్లో ఐదవది ఏదనేది ప్రశ్న. దీని ఏకశేష వృత్తులు వారు గుర్తించారు.

భాషలో సమానవస్తువులను ఒకదానికన్న ఎక్కువ చెప్పవలసి వస్తే అన్ని పర్యాయాలు ఆ పదాన్ని మనం వాడము. ఆ పదానికంతంలో బహువచన ప్రత్యయాన్ని వాడుతాం. ఆప్రత్యయమే అక్కడ ఉండవలసిన పాదాల్లో ఒకదాన్ని మిగిలి లోపించిన పదాల అర్థాన్ని చెబుతుందంటారు. అందువల్ల దీనికి ఏకశేషవృత్తి అని నామకరణం. రామ + రామ = రాములు. సమాసవృత్తి తెలుగులో చాలవరకు ఉన్నందున దీన్ని ప్రత్యేకించి చెప్పనవసరం లేదు. సంస్కృత సమాసాల్లో అవ్యయీ భావం కాక తక్కిన సమాసాలన్నీ తెలుగులో ఉన్నాయి.

కృత్, తద్ధితముల నిష్పత్తిలో కొంత క్లిష్టత గలగు. వాటిని కొంత వివరించాలి.

సమాసములు స్వతంత్రప్రయోగ యోగ్యత గల పదముల కలయికగా మన వ్యాకర్తలు గుర్తించారు. కృత్‌లో విహితాలైన ప్రత్యయాలను వివరించే ముందీ క్రింది యంశాలను గ్రహించాలి. పదములన్నీ వ్యుత్పన్నాలని ఒక వాదం ఉంది. అంటే ప్రతి పదము దాని నిర్మాణానికి మూలమైన ధాతువులను వానిపై చేరిన ప్రత్యయాలను వివరించటం సాధ్యమని వారంటారు. దీన్నే వ్యుత్పత్తివాద మంటారు. వీరు ధాతువులపై చేరే పురుషవచనకాల బోధకేతరాలను కృత్తులన్నారు ఈ వివరం స్పష్టంగాదని రాని వాటిని వీరు ఉణాదులన్నారు 'ఉణాదయో బహుళాం' అనివీరి సందర్భంలో చెప్పారు హింసించేదయినందున 'హిన స్త్రీతి సింహః" అని వీరి మతం "సింహో వర్ణ విపర్యయాత్" అని వీరు పేర్కొన్నారు. వర్ణ నాంశం వల్ల "పృషోదరమ్" అని వీరంటారు. 'పృషత్' లోని 'త్' లోపించినందున "పృషోదరం" అని వారి నిర్ణయం. 'పృషోదరాదీని

యథోపదిష్టమ్" అని వీరు పేర్కొన్నారు.

అలాకాకుండా ధాతుప్రత్యయ విభాగం నిరూపించదగిన వాటిని కృత్ ప్రత్యయాలయినందున కృదంతాలని వీరు పేర్కొన్నారు.

ధాతు జన్యములైన నామాలని వీటిని ఆధునికులనటం గలదు. ఇవి నామాలేగాక విశేషణాలు గూడ ఉన్నాయి. కొన్ని అవ్యయాలు గూడ ఉన్నాయి.

"క్త్వా" అనే ప్రత్యయాంతాలు (ఇందులో క్ లోపించి 'త్వా' మిగుల్తుంది) అవ్యయాలు. భూ–త్వా; పా > పీ–త్వా, గమ్ > గత్వా, హన్ > హత్వా. త్యజ్ > త్యక్ + త్వా, వచ్ > ఉక్ – త్వా = ఉక్త్వా వద్ > ఉద్ > ఉది–త్వా, రుద్ + త్వా = రుద్ధ్వా, కృ–త్వా

ధాతువుకు మునుపు ఉపసర్గాదులుంటే త్వా కి బదులు ల్యప్ వస్తుంది. ఇందులో శేషించే భాగం 'య' అలం–కృ + కృత్–య = అలంకృత్య, పరిభూయ, నిపీయ, సంత్యజ్య తి–అనేదీ 'త' అనేదీ పై విధంగానే ధాతువులపై చేరుతాయి. భూతి–భూత, గతి–గత, హతి–హత, ఉక్తి–ఉక్త, కృతి–కృత మొదలయినవి. 'పీ' నుంచి పీత అనేది ప్రయోగంలో ఉందేగాని దీనిపై 'తి' చేరిన రూపం కనరాదు. 'తి'–'త' ప్రత్యయాంతాలు సుబంతాలు. అవ్యయాలు కావు. 'తి' అంతాలు నియత స్త్రీలింగాలు. 'త' అంతాలు మూడు లింగాలలో (త్యక్తః. త్యక్తా, త్యక్తమ్) రూపాలు కలిగి ఉంటాయి.
'త' ప్రత్యయాంతాలు భూతకాలాన్ని కర్మణ్యర్థాన్ని చెబుతాయి.

వర్తమాన కాలాన్నీ కర్త్రర్థాన్నీ చెప్పేవి శత్రంతాలు. ఇందులో మిగిలేది 'అత్' అనేది. ఈ ప్రత్యయం చేరేటప్పుడు ధాతు ప్రత్యయాలకునడుమ వికరణప్రత్యయం చేరుతుంది. భూ + అ–అత్ = భవత్. కర్త్రర్థంలో ధాతువుకు వర్తమానకాలంలో గలిగిన ఆదేశాల పైనే ఈ ప్రత్యయం చేరుతుంది. పా > పిబ్ + అ–అత్ = పిబన్.

గమ్ > గచ్ఛ + అ + అత్ = గచ్ఛత్ ధాతువాత్మనేపదమైతే 'ఆన" వస్తుంది. వందమాన (వంద్ + అ + ఆన) మోదమాన (ముద్ > మోద్ - అ + ఆన)

| అ | కర | భవ | గమ | నమ | మత |
|---|---|---|---|---|---|
| అవన | కరణ | భవన | గమన | నమన | — |
| తృ (తా) | కర్త | భవిత | గంతా | నంతా | మంతా |
| తవ్య | కర్తవ్య | భవితవ్య | గంతవ్య | నంతవ్య | మంతవ్య |
| అనీయ | కరణీయ | భవనీయ | గమనీయి | నమనీయ | మననీయ |
| య | కార్య | గమ్య | నమ్య | భవ్య | మాన్య |
| ఆన (వృద్ధి) | కారణ | భావన | — | వాదన | — |
| అ (వృద్ధి) | కార (కుంభకార) | భావ | | వాద | — |
| అక (వృద్ధి) | కారక | | గమక | వాదక | నామక |

ఇంకను పావక- యాచక. మోదక మొదలగునవి.

'ర్ద్' అంతాలకు 'త' పరమైతే 'త' మరియు ద్/ధ్ గా మారుతాయి. భిన్న )భిద్ + త) ఖిన్న (ఖిద్ + త)

రేఫాంతాలకు పరంగా ఉన్న త > న > ది శీర్ణ. కీర్ణ. తీర్ణ. ధాతు ప్రత్యయాలకు (హలాది) నడుమ 'ఇ' వస్తుంది. దీన్ని (స + ఇట్) సేట్ అని అంటారు. ఉదిత (ఉద్ + ఇ + త) కథిత (కథ్ + ఇ + త). కృదంతాలకర్థాలు యథా వ్యవహారంగా గ్రహించాలి.

<u>సనాద్యంత ధాతురూప వృత్తి :--</u>

ఇవి కూడ ధాతువులపైననే వస్తాయి. ఇవి కొన్ని క్రియాపదాలు మరి కొన్ని నామాలు.

| | | | |
|---|---|---|---|
| (సన్) | బుభూషతి | బుభూషా | బుభూషుః |
| | పిపాసతి | పిపాసా | పిపాసుః |
| | చికీర్షతి | చికీర్షా | చికీర్షుః |
| | జిజ్ఞాసతి | జిజ్ఞాసా | జిజ్ఞాసుః |
| (క్యచ్) | పుత్రీయతి | > పుత్రీయత్ | |
| (కామ్య చ) | పుత్రకామ్యతి | పుత్రకామ్యత్ | |
| క్విప్ | అచారే | | |

శేషాయతే, కల్ప శాఖాయతే, కాలదండాయతే ణిచ్ -

<u>తద్ధిత ప్రత్యయాంతములు</u> :— నామాలనే ప్రాతిపదికలంటారు. వీటిపైకిన విభక్తివచన బోధకాలు చేరుతాయి. రామస్య - షష్ఠీ ఏక వచనం- రామాణామ్ - షష్ఠీ బహువచనం. రామాత్ - పంచమీ ఏకవచనం రామః - ప్రథమా ఏకవచనం. వీటన్నింటిలో నియతంగా 'రామ' అనేది ఉంది. దీన్ని మూలరూపం లేదా ప్రాతిపదిక. నామాల పై విభక్తివచనేతర ప్రత్యయాలు చేరుతాయి. వీటిని తద్ధిత ప్రత్యయాలంటారు. దాశరథి, అనేదొక తద్ధిత ప్రత్యయాంతం. ఇందులో మూలరూపం 'దశరథ" అనేది. దీనిపైన 'ఇ' అనే ప్రత్యయం చేరి ప్రాతిపదిక ఆదిలో వృద్ధి గలిగినందున దాశరథి అనే రూపం ఏర్పడింది. "దశరథుని అపత్యమ్" లేదా బిడ్డ అని దీని కర్థం, దశరథ అనే ప్రాతిపదికకు గానీ అపత్యార్థక ప్రత్యయమైన "ఇ" కి గాని వ్యస్తంగా లేని యర్థం దాశరథి అనే తద్ధిత ప్రత్య యాంతానికి గలిగింది. పరార్థాభిధాన మంటే ఇదే. ఈ ప్రత్యయా నికి రాముడు (దశరథసుతుడు) అని అర్థం, దశరథాత్మజులు నలుగు

రయినందున ఈ ప్రత్యయాంతానికి ఆ నలుగురు వాచ్యంగావచ్చు. కాని, ప్రసిద్ధుడయినందున రాముడినే ఈ ప్రత్యయాంతానికి (దాశరథి) అర్థంగా చెబుతున్నాం.

అపత్యార్థంలో తద్ధిత ప్రత్యయాలు సంస్కృతంలో చాలా ఉన్నాయి. ఇలాంటివి తెలుగులో లేవు. ద్రౌపది (ద్రుపద-ఇ) వైనతేయ (వినతా+ఏయ), కౌంతేయ (కుంతి+ఏయ) వాసుదేవ (వసుదేవ+అ), పౌర్వ (పూరు+అ) మొ॥

అపత్యార్థకాలుగాని తద్ధిత ప్రత్యయాలు అసంఖ్యాకంగా సంస్కృతంలో ఉన్నాయి. తెలుగులో 'తన' (చిన్నతనము) అనే ప్రత్యయం 'త్వా' అనే సంస్కృత ప్రత్యయానికి తుల్యార్థకమని సూ ) (తద్ధిత-1) వివరించాడు. ఈ ప్రత్యయార్థంలో "తా" అనేది గూడ సంస్కృతంలో ఉంది. బాలతా, బాలత్వం అనేవి ఈ సంస్కృత ప్రత్యయాంతాలు. 'బాల్య' అని గూడ ఏర్పడుతుంది. ఇక, ఈ ప్రత్యయాంతాలు సంస్కృతంలో అత్యధికం. (ఇ) లోక+ఇక=లౌకిక, వేద+ఇక=వైదిక రథ+ఇక=రథిక. సేనా+ఇక=సైనిక, మార్దంగిక, వైణిక. వైతాళిక మొదలగునవి.

(ఈయ) -- భవదీయ, త్వదీయ, మదీయ

(కీయ) - రాజకీయ (ఈ ప్రత్యయాన్ని ప్రజా, భాషా అనే వానికి గూడ చేర్చి భాషాకీయ. ప్రజాకీయ మొదలగు ప్రయోగాలను మ రీవారు)

(త్య) — దాక్షిణాత్య, పాశ్చాత్య మొదలయినవి. పూర్వ పశ్చిమ మొదలగు పదాలపై ఈ ప్రత్యయాన్ని చేర్చి ప్రయోగించిన పౌర్వాత్య, పాశ్చిమాత్య అనేవి మరాఠీవారినుంచీ ఈ రూపాలు కన్నడంలోకి ప్రవేశించాయి.

(ల) — చూడాల దీన్ని 'ధూమ' పై చేర్చి 'ధూమల' అనే

ప్రయోగాన్ని శ్రీనాథుడు శృంగారనైషధంలో వాడుక చేశాడు. శ్మశ్రుల మొదలైన రూపాలను హిందీవారు వాడియున్నారు.

(ఇమ) — ద్రఢిమ, లఘిమ, ప్రౌఢిమ మొదలగునవి. తెలుగు మొదలైన దేశీయ భాషల్లో కల్పితాలై ప్రయోగ రూఢాలైనాయి.

(ఇత) పండిత, తారకిత, కోరకిత, జడిత మొదలైనవి ఉదాహరణాలు. ఈ ప్రత్యయాంతాల నధికంగా ప్రయోగించినవారు తెలుగువారు. ఈ ప్రత్యయం చేరదగిన నామాలను మూడు పదులకు పైగా కాశికాకర్త ఇచ్చియుండగా భట్టోజీ ఈ గణాన్ని నూటి వరకు పెంచాడు. కాశిక లోనివి ఇంచుమించుగా అన్నీ భట్టోజీలో ఉండగా మిగిలినవి కాలక్రమంగా ఇందులో చేరాయని తలంచనగును. పాండిత్యసంపద గలిగినవాడు "తదస్య సంజాతమ్" అనే అర్థాన్ని పండిత మొదలగు వానికి అర్థంగా వ్యాకరణాలు వివరించాయి. ఇతః పూర్వం పాండిత్యం వ్యక్తిమనసులో దాగి ఉండగా తగిన విద్యాభ్యాసాది శిక్షణ వల్ల ఆ ధీశక్తి వెల్లివిరిసెందనీ, వెలికి వచ్చిందనీ దీని కర్థం. తారక లాకాశంలో అన్నివేళల ఉంటాయి. పగటి పూట సూర్యుని వెలుగులో అవి గతార్థాలయినందున మనకు గనరావు. సూర్యుడస్తమించినంతనే అవి అగపడుతాయి. చంద్రుని వెలుగులో అవి గతార్థాలు గావు. చంద్రుని వెలుగు సూర్యుని వెలుగు వలె తీక్ష్ణమయినది కాదు.

పై వివరణవల్ల వ్యక్తి లేక వస్తునిష్ఠమైన (ధీశక్తి లేదా చుక్కలు) గుణాదులు వెలికిరావటం అనేదాన్ని ఈ ప్రత్యయం తెలియజేస్తుంది.

నన్నయాదులీ ప్రత్యయాంతాలను ఉపమానార్థంలో వాడినట్లు తెలుస్తుంది. చెలియలికట్ట భూమికి వలయంగా ఉన్నదనే సందర్భంలో (అఖిల జలధి వేలా వలయవలయిత....) అని నన్నయ "వలయిత" ను సామ్యార్థంలో వాడియున్నాడు. పెద్దన పోషించిన ప్రవరునకు

హిమాలయ శిఖరం నుంచి భూమి 'తిలతండులితం' గా కనబడింది. తిమ్మన. యక్షుల వక్షస్థలములు శ్రీకృష్ణుని బాణములకు లక్ష్యాలై గవాక్షితములైన వనటంలో (గవాక్షిత వక్షులగు యక్షులు) పోలిక గోచరిస్తుంది. ఇత ప్రత్యయాంతాలన్నీ అన్యపద ప్రాధాన్యాన్ని గలిగి ఉన్నందున బహువ్రీహిగ గుర్తించదగినవి. 'ఇత' ఏకపద ఘటితాలైనందున సమాసాలుగావు. Exocentric Constriction అని వీటిని ఆధునిక భాషాశాస్త్ర పరిభాషలో చెప్పదగును వాస్త్రః కాషాయం, మాంజిష్ఠ మొదలయినవి తద్ధిత ప్రత్యయాంతాలు. వస్త్రముల చేతకప్పబడిన (వస్త్రైః పరివృతః) రథమని పై తద్ధితాంతానికి అర్థం. కాషాయం అంటే కషాయవర్ణము చేత రక్తము (కషాయే రక్తం) కాషాయి, మంజిష్ఠముచేత రక్తము (మంజిష్ఠేన రక్తం మాంజిష్ఠమ్) అని దీని కర్థం. ఈ రెండు ఆయా రంగుగల వస్త్రముల కుద్దిష్టార్థము. ఇవియు exocentric Constructionsగా తలంచనగును.

తద్ధితాంతాల నిర్మాణం అర్థాదికాంశాలపై సంస్కృత వ్యాకరణ కర్తలేలనో అంతగా శ్రద్ధ చూపలేదు. 'తద్ధిత మూఢో వైయాకరణః' అనే సూక్తి సంస్కృత వ్యాకరణ శాస్త్ర పరిభాషలో ప్రచురంగా కనిపిస్తుంది.

దాక్షిణాత్యులు తద్ధితాంతాలను వాడుక చేయటంలో మిక్కిలి ఉత్సుకులనే అర్థం వచ్చే "ప్రియతద్ధితా దాక్షిణాత్యాః" అనే సూక్తి కూడ ప్రచారంలో గలదు.

ఆముక్తమాల్యదలో రాయలొక సందర్భంలో 'శౌకపైకము' లని వాడాడు. శుక మరియు పికముల సముదాయమని ఈ ప్రయోగాని కర్థం. ఈ రెండు సముదాయార్థక తద్ధిత ప్రత్యయాంతాలే.

సంస్కృతాన్ని తమ వ్యవహారంలోకి రాకుండ నివారించే ప్రయత్నం ఉద్దిష్ట పూర్వకంగా చేసిన తమిళుల వ్యవహారంలో చోటు చేసి కొన్ని సంస్కృత పదాల్లో పెక్కులు తద్ధిత ప్రత్యయాంతాలుగా

ఉన్నాయని తెలుస్తుంది. అస్వర్గ్య, నైరపేక్ష్య, ప్రాధమ్య, అయిశన్వ, పారలౌకిక, ఆత్యంతిక, ఐచ్ఛిక, కాయక, వాచిక మొదలగు తద్ధిత ప్రత్యయాంతాల ప్రయోగం తమిళ (మణి ప్రవాళం) వాఙ్మయ గ్రంథాల్లో చోటు చేసికొన్నాయి.

కృత్ సనాద్యంత ధాతు రూప వృత్తులు ధాతువు నుంచే ఏర్పడే తిఙంతేతరాలను వివరించగా, తద్ధిత ప్రకరణం నామాలపై (స్వతంత్ర పదాలపై) విభక్తేతర ప్రత్యయాలు చేరటాన్ని తెలుపుతుంది.

ఏక శేష సమాస వృత్తులు రెండూ సుబంతాల కలయిక చెందినవి.

ఏకశేష వృత్తి .— సరూపాలు, సమానాలు అయిన బహుపదాల్లో ఒక్కటి మాత్రం మిగలటం ఏకశేషం రామ+రామ అనే చోట 'రామ' అని మిగిలిన ద్వివచన ప్రత్యయాన్ని స్వీకరించి 'రామౌ' అని అవుతుంది. రామ+రామ+రామ అనేవి మూడు నాలుగు లేదా ఆపైన ఎన్నిచేరినా ఒక్కటి శేషించి తుదకు బహువచన ప్రత్యయాన్ని పొంది 'రామాః' అనియై లోపించిన వాటినన్నింటిని తెలియజేస్తుంది. పది సరూపాల్లో శేషించిన ఒకటి, లోపించిన తొంభై తొమ్మిదింటిని ఈ శేషరూపం తెలుపుతుంది. ఇదే ఏక శేష వృత్తి యొక్క ఉద్దేశం.

విరూపాల కలయికయితే ఇలా లోపం రావటం ఒక్కటి మాత్రం శేషించటం సంభావ్యం గాదు. ఇలాంటి విరూపాల కలయికనే ద్వంద్వం అంటారు.

సమాసవృత్తి :— సమాసాలను పదప్రాధాన్యం దృష్టితో వేరొకరు చేశారు. ఈ వేర్పాటులో అవ్యాప్తి, అతివ్యాప్తులను వారంగీకరించియే యున్నారు. అందువల్ల ప్రాయికంగా అవ్యయీభావం పూర్వ పద ప్రధానం. తత్పురుష ప్రాయికంగా ఉత్తరపద ప్రధానం. బహువ్రీహి ప్రాయికంగా అన్యపద ప్రధానం. ద్వంద్వం ప్రాయికంగా

ఉభయపద ప్రధానం. ఇవన్నీ విశేషణ సమాసాలు. ఈ పద ప్రాధాన్య విభాగంలో గతార్థం కానివి సామాన్యసమాసాలు- కాక తాళీయం, జీమూతస్యేవ మొదలగునవి సామాన్యసమాసాలు.

ద్వంద్వం :— సరూపాలు గాని పదాల కలయిక ద్వంద్వం - రామలక్ష్మణ అనేది ద్వంద్వం. వీనికి అంతంలో ద్వివచన ప్రత్యయం చేరుతుంది. రామలక్ష్మణౌ అని అవుతుంది. సరూపాలయితే (రామ+రామ) ఏకరూపం శేషించి తుది ద్వివచన ప్రత్యయాన్ని స్వీకరించి 'రామౌ' అని అవుతుంది.

రామలక్ష్మణ శతృఘ్న అనేవి తుది బహువచనాన్ని గ్రహించి 'రామలక్ష్మణ శత్రుఘ్నః'కాగా అలాగే రామలక్ష్మణ భరతశత్రుఘ్నః ఇత్యాదిగ నాలుగు అంతకుమించిన పదాల కలయిక ఇందుంటుంది.

బహువ్రీహి .— 'వాత్రం' అనేది అన్యపద ప్రాధాన్యంగల తద్ధితాంతమని గ్రహించాం. 'త్రినేత్ర' మొదలయినవ శివాది వాచికాలయినందున ఇలాంటి సమాసాలను బహువ్రీహిసమాసాలంటారు.

తత్పురుష :— ఇందులో వ్యధికరణ, సమానాధికరణ అనే రెండు భేదాలున్నాయి. సమసించే పూర్వోత్తర పదాలు సమాన విభక్త్యంతాలై ఉండటం సమానాధికరణం దీనికే కర్మధారయమని పేరు. సమానాధికరణంలో మొదటి అవయవం సంఖ్యావాచకమైతే దాన్ని ద్విగు సమాసమంటారు.

వ్యధికరణ సమాసాన్నే తత్పురుష అంటారు. వ్యధికరణ తత్పురుషల్లో ద్వితీయ మొదలగు సప్తమీ పర్యంతం తత్పురుషలున్నాయి.

అవ్యయీభావం :— సుబంతాలు సమసించి అవ్యయాలుగా మారటం అవ్యయీభావము. 'గంగాయాః పారే' అనే రెండు సుబంతాలు

'పారేగంగం' అని అవ్యయంగా మారి పోయినాయి. దిశోర్మధ్యే = అపదిశం, కృష్ణస్య సమీపం = ఉపకృష్ణం మొదలైనవీ సందర్భంలో గుర్తించదగిన సమాసాలు.

సమాసాలకు ఉపయుక్తాలైన పేర్లన్నీ అన్వర్థకాలు. ఈ యంశాన్ని గ్రహించి రాజశేఖరుడు ఒక శ్లోకాన్ని రచించియున్నాడు.

ద్వంద్వోఽస్మి ద్విగు రస్మి న మే గృహే అవ్యయీభావః।
తత్పురుష కర్మధారయ యేన స్యామహం బహువ్రీహిః॥

నేను వివాహితుడను (ద్వంద్వోఽస్మి) నాకున్నధనం రెండు ఆవులు. మాత్రమే (ద్విగురస్మి) నాయింట వ్యయానికి అభావంలేదు. (న మే గృహే అవ్యయీభావః) ఓ ప్రభూః '(తత్పురుష) అలాంటి పనిని (వితరణను) గావింపుము. (కర్మధారయ) దీనివల్ల నేను ధన ధాన్యాదులను పొందగలను. (యేన స్యామహం బహువ్రీహిః)



# గ్రంథకర్త ఇతర రచనలు

1. A Study of Telugu Compounds (1965)
2. వ్యాసరాజి (1969)
3. వ్యావహారిక భాషావికాసము-చరిత్ర (1975)
4. తెలుగు కవుల సంస్కృత ప్రయోగాలు (1982)
5. తెలుగు కవుల సంస్కృత ప్రయోగాలు - నన్నయ నుండి నేటి వరకు (1985)
6. తాళ్లపాక అన్నమాచార్యుల సంకీర్తనల్లో భాషావిశేషాలు (1989)
7. ఆధునిక భారతీయ భాషల్లో సంస్కృతం- తులనాత్మక విశ్లేషణ (1992)
   (A Comparative Analysis of Sanskrit Element in Moderen Indian Langeages)